# చతుర

The Largest Circulated
Telugu Monthly

సెప్టెంబరు '97
రూ. 7/-






ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

సెప్టెంబర్ చతుర నవల ఎదురింటి అమ్మాయి

**సమీక్షకుని పేరు :** ..............................................................

**చిరునామా :** ..............................................................

..............................................................

..............................................................

..............................................................

# ఏరిన ముత్యాలు

★ తననుగూర్చి తెలియనివాడే అజ్ఞాని

-సోక్రటీస్

★ మనమనస్సే మనకు పెట్టనికోట. అది దెబ్బతింటే జీవితంలో మనం ఓడిపోతాము

-రాజాజీ

★ ప్రపంచమందు నీకు వేరే శతృవులుగాని, మితృడుగానీ లేరు. నీ నడవడికయే నీకు మిత్రులనుగాని, శత్రువులను గాని లభింపజేస్తుంది

-చాణుక్యుడు

★ పురుషుడి హృదయం మెదడులో వుంటుంది. స్త్రీ మెదడు హృదయంలో వుంటుంది

-నెపోలియన్

★ స్వర్గంనుండి మలిన రహితంగా భూమికి విసరివేయబడ్డిన ముత్యాలే పసిపాపలు

-మకీయవెక్లీ

★ విషం తన ప్రభావాన్ని ఒక్కసారే చూపుతుంది. కానీ ఒక చెడ్డ పుస్తకం చాలాకాలం వరకు మనుషుల మనసులను విషమయం చేస్తూనే వుంటుంది

-జాన్ముర్రే

★ విశ్వసౌభాగ్యానికి విద్యార్థి పట్టుగొమ్మ

-టాగూర్

★ విద్యనేర్చుటకు జీవితమును అర్పించినవారు మృతిచెందరు

-మహమ్మద్

★ ఉపాధ్యాయుడు తానింకా నేర్చుకుంటూ వుంటే తప్ప యదార్థంగా చదువు చెప్పలేడు

-టాగూర్

★ విద్యార్థుల అంతరంగంలో విజ్ఞాన జ్యోతిని వెలిగించడమే అధ్యాపక వృత్తి స్వీకరించేవారి లక్ష్యం కావాలి

-రాబర్ట్సన్

★ నేను ప్రజాజీవితమంటే ఏమిటో తెలుసుకున్నప్పటినుంచీ, నేను పలికిన ప్రతిమాట వెనక, నా ప్రతి చేష్టవెనుక మతచైతన్యం, మతభావన ఉన్నాయి.

-యమ్.కె. గాంధీ

సేకరణ: షేక్ సాధిఖ్‌షా

# చతురకథలు

## విజిటింగ్‌కార్డ్

మూర్తి బస్సులో కూర్చున్నాడు. సమయం సాయంత్రం ఆరుగంటలు కావొస్తుంది. చీకట్లు అలముకొంటున్నాయి. బస్టాండు హడావిడిగా ఉంది.

"అమ్మా! రొట్టెల పీట తీసుకొండ్రి'' అని ఓ హాకర్ అరుస్తున్నాడు.

"ఎంత" అంది ఓ కోమలాంగి. ఆ కంఠం తన సీటు వెనుకనుంచే అని మూర్తి పోల్చుకున్నాడు.

"నలభై రూపాయలమ్మా'' అన్నాడు వాడు.

"ఇరవైకి ఇస్తావా'' అన్నది ఆ భామ.

"లేదమ్మా'' అన్నాడు వాడు.

"పోనీ ముఫ్ఫయ్'' అంది సుందరాంగి.

"నోనో ఇట్ డజన్ట్ కాస్ట్ మోర్ దేన్ ట్వంటీ" అన్నాడు మూర్తి

"అలాగా! అవసరంలేదులే! వద్దు'' అంది ముద్దుగుమ్మ కంఠం వెనుకనుండి.

బస్సు బయల్దేరింది. దారిలో ఒకచోట కమలాపళ్ళు అమ్ముతున్నారు. వెనకనున్న ఆమె బేరం చేసింది.

"ఐదు రూపాయలకి మూడమ్మా'' అన్నాడు వాడు బేరం లేదన్నంత నిష్కర్షగా.

కానీ ఎంతకయినా కొనే స్పీడులో ఉందామె. దాహం దంచేస్తున్నట్లుందామెకు.

"రూపాయికి ఒకటి యివ్వలేదూ! నీవు'' దబాయింపుగా అన్నాడు మూర్తి

"సరేలెండి, తీసుకోండమ్మా'' అని ఐదు పళ్ళిచ్చి ఐదు రూపాయిలనోటు అందుకున్నాడు.

"థ్యాంక్యూ అంకుల్! యూ సేవ్‌డ్ మీ థర్టీ రూపీస్'' అందామె.

"ఓకే ఇట్సాల్‌రైట్" అన్నాడు మూర్తి మురిసిపోతూ. కానీ, ఆ వెంటనే గుండె కలుక్కుమంది తనని అంకుల్ అన్నందుకు.

బస్సు నడుస్తూండగా మాటలు కలిశాయి. ఆ అమ్మాయి యూనివర్సిటీలో పి.జి. చేస్తోందిట! సెలవులకి ఇంటికి వెళ్తోందిట!

"అంకుల్ మీరెంతవరకు వెళ్తారు?" అడిగిందామె.

మూర్తి చెప్పాడు.

డ్రైవరు దిగి టీ తాగుతున్నాడు. పాసింజర్సు కూడా దిగారు. మూర్తి ఆ అమ్మాయికి టీ ఆఫర్ చేసేడు. ఇద్దరూ టీ తాగుతున్నారు.

"యూ ఆర్ ఏ స్పెండ్ థ్రిఫ్ట్'' అన్నాడు మూర్తి.

"ఎలా అంకుల్" అందామె ఉత్సుకతతో.

"నీ ఎడమచెయ్యి చూపించు'' అన్నాడు మూర్తి

అమ్మాయి అరచేయి చూపించింది. అరవిచ్చిన కమలంలా ఉందామె అరచేయి. జేబులోంచి భూతద్దం తీసి గీతలు పరిశీలించాడు మూర్తి

"యువర్ లైఫ్ లైన్ యీజ్ వెరీగుడ్" అన్నాడు.

"అంకుల్, అంకుల్! ప్లీజ్ నా చదువు గురించి చెప్పరూ!" అంది అన్నులమిన్న.

"దానికి కొంత టైం పడ్తుంది'' అన్నాడు బింకంగా.

"అయితే ఏం చెయ్యాలి?" అంది అందాలకుప్ప.

"సెండ్ యువర్ హేండ్ ప్రింట్" అన్నాడు మూర్తి

"అడ్రస్ ప్లీజ్" అంది కోమలాంగి.

---

ముఖపత్ర చిత్రం - శివసత్యమూర్తి

రెడీగా ఉంచుకొన్న విజిటింగ్ కార్డు ఇచ్చాడు మూర్తి.

మూర్తికి చాలా రోజులై విజిటింగ్ కార్డు కొట్టించాలని ఉండేది. కాని చేస్తున్న ఉద్యోగం అంత గొప్పదేమీకాదు. ఈలోగా ప్రమోషను వచ్చింది. దాంతోపాటుగా ఎన్నాళ్లగానో అప్లై చేసిన ఫోను యింటికి వచ్చింది. ఇకనేం, టూరుకి వెళ్తూ కార్డులు కొట్టించాడు. పామిస్ట్రీ అంటే పడని వాళ్ళు లేరని మూర్తికి బాగా తెలుసు. పాచిక పారింది. పిట్ట వలలో పడింది. కనీసం ఉత్తరాలైనా రాస్తుంది కదా అని సంతృప్తి.




భళ్లున తెల్లారింది. మూర్తి ఇంటికి చేరుకున్నాడు. తలుపు తెరిచి ఎదురుగా ఇల్లాలు. అపుడే నిద్రలేచిన మొహం. చెంబు, చాప కన్పించాయి. రాణిని చూసిన కళ్లతో పాత పెళ్ళాన్ని చూసిన చందాన మూర్తికి రోత కలిగింది. వారం రోజులు గడిచాయి. సాయంత్రం ఆఫీసునుంచి వచ్చిన మూర్తికి పెళ్లాం మూడంకె వేసుకొని పడుకోవడం కన్పించింది. ఎందుకోగానీ అలిగిందన్న మాట. ఇంకేం మూర్తి తనను కృష్ణుడిలా ఆమెను సత్యాః మలా ఊహించుకుని లాలన చేసాడు.

ముక్కు చీదుతూ సత్యభామ అసలు విషయం చెప్పింది.

"ఎవరో సుందర్ అట. ఫోనుచేశాడు. వాడికి కాబోయే పెళ్లాం యూనివర్సిటీలో చదువుతోందట. మూర్తి ఆ అమ్మాయితో ఉత్తరాల్లో ప్రేమ వ్యవహారాలు గట్రా నడుపుతున్నాట్ట. వ్యవహారం శృతిమించితే ఒప్పేది లేదని, మీ ఊరు వచ్చి కాళ్ళూ చేతులూ విరగ్గొట్టేస్తానని బెదిరించాడు."

"వాడికి మన ఫోను నెంబరు ఎలా దొరికింది?" బేలగా అన్నాడు మూర్తి.

"వాడి ప్రియురాలి వ్యానిటీ బ్యాగ్‌లో మీ విజిటింగ్ కార్డు ఉందట" అంది సత్య వెక్కిళ్ళుపెడ్తూ.

ఎంత బుజ్జగించినా సత్య ప్రసన్నురాలు కాలేదు.

"విజిటింగ్ కార్డు ఎక్కడుందండీ మీకు" అంది సతీమణి.

గ్యాస్ స్టౌ ముట్టించి ఒక్కొక్క కార్డు ఆమెకు చూపుతూ కాల్చేశాడు మూర్తి. బస్‌లో యెదుర్కొన్న అనుభవం చెప్పి పెళ్ళాం ముందు లెంపలు వేసుకున్నాడు.

సత్య ముద్దుగా గునిసింది.

-ఆనందరావు

# బంద్

పట్టణంలో రెండురోజులుగా 'బంద్' పకడ్బందీగా జరుగుతోంది! మూడవరోజు... ఉదయం పది గంటలయింది. రోడ్లన్నీ నిర్మానుష్యంగా ఉన్నాయి.

భాస్కరం నాలుగు రోడ్ల జంక్షనులో నిలబడ్డాడు. అతను స్థానికంగా ఉన్న ఒక దినపత్రికకు విలేకరి. యువకుడు. అభ్యుదయ భావాలు అణువణువునా నింపుకున్నవాడు. ఏ పనిచేసినా, ఏ వార్త రాసినా సంచలనం అతని ప్రత్యేకత.



రెండురోజులుగా జనజీవనం స్తంభించి పోయింది. ప్రజలు గిజగిజలాడిపోతున్నారు.

పులీ, నక్క, తోడేలు, పార్టీలు బంద్‌కు పిలుపునిచ్చాయి. మూడు రోజులకి, మూడు పార్టీలు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. దుకాణాలు బంద్, ఆఫీసులు బంద్, హోటళ్ళు బంద్, నీళ్ళు బంద్, విద్యుచ్ఛక్తి బంద్, బస్సులు, రిక్షాలు, ఆటోలు, అన్నీ బంద్.. అంతా బంద్!

నాలుగు రోడ్ల కూడలిలో మూడు పార్టీల నాయకులు, కార్యకర్తలు, ఓ యాభైమంది ఊరేగింపుగా 'బంద్'ను పర్యవేక్షిస్తున్నారు.

భాస్కరం కూడా ఆ ఊరేగింపుతో, మౌనంగా అడుగులు వేశాడు. నాలుగురోజుల క్రితం 'పులి పార్టీ నాయకుడ్ని ఎవరో నడిరోడ్డుమీద దారుణంగా నరికి చంపారు. నరకబడ్డ ఆ నాయకుడు ఒక నరకాసురుడే! బతికినంతకాలం గూండాయిజాన్ని గుండెల్లో పెట్టుకుని పోషించాడు. ఆ గూండాయిజమే అతణ్ణి గుటుక్కుమని మింగింది.

బంద్ సందర్భంగా ప్రజల మనోభావాల్ని ఏ రోజుకారోజు భాస్కరం తెలుసుకుంటున్నాడు. ఎవర్ని కదిపినా కష్టాలు, కన్నీళ్ళు కలబోసుకుంటున్నారు. ఆగ్రహం, అసహాయత వ్యక్తపరుస్తున్నారు. ఈ బంద్‌లు మా మీద బలవంతంగా రుద్దుతున్నారన్న భావాన్ని వెలిబుచ్చుతున్నారు.

'బంద్' గుంపు ముందుకు సాగిపోతోంది!

ఒక అస్థిపంజరంలాంటి తాత అరటికాయల బండిని తోసుకుంటూ సందులోంచి వచ్చాడు. సగం పళ్ళు కుళ్ళిపోయి ఉన్నాయి. రోడ్డుమీద గుంపుని చూసి భయంతో వెనక్కి వెళ్ళబోయాడు. 'నక్క' పార్టీ కార్యకర్త ఒకడు పరుగుపరుగున వెళ్ళి అతని బండిని కాలితో తన్నాడు. బండి తిరగబడింది. కాయలు ఎగిరిపడ్డాయి. తాత

నెత్తిమీద చేతులు పెట్టుకుని ఘొల్లుమని ఏడుస్తూ కూలబడిపోయాడు.

రోడ్డు మలుపులో కిళ్ళీబడ్డీ తలుపు ఒకటి తెరచి ఉంది. గుంపు ఆ బడ్డీవైపు కదిలింది. కిళ్ళీ బడ్డీ కుర్రాడు చదువుకున్నవాడిలా ఉన్నాడు. ఏదో సమాధానం చెప్పాడు. మరు క్షణంలో అతని బడ్డీ 'పులి'పార్టీ కార్యకర్తల దాడికి బలయిపోయింది. కుర్రాడు ముక్కు తూ, మూలుగుతూ నేల కరిచాడు.

ఎవరో భార్యాభర్తలు టెలిఫోన్ బూత్‌లో ఎక్కడికో భయంభయంగా మాట్లాడుకుంటు న్నారు. 'తోడేలు' పార్టీ మనుషులు ఈలలు వేస్తూ బూత్‌లోకి దూరిపోయారు. సొట్టకా లుతో ఉన్న బూత్ అమ్మాయిని బూతులు తిట్టారు. అంగవైకల్యంతో ఉన్న ఆ అమ్మా యిని గేలిచేస్తూ గాలిలోకి ఎత్తి కుదేసినట్లుగా బయటకు నెట్టారు. టెలిఫోన్ వైరు లాగి తెంపిపడేశారు. భార్యాభర్తలు బయవిహ్వ లంగా బయటకు పారిపోయారు.

ఇంకా, దూసుకుపోతోన్న ఒక ఆటోరిక్షా ను ఆపి, దాని మూడు టైర్లకూ మేకులు గుచ్చి గాలితీసిపడేశారు. డ్రైవరును పిడిగు ద్దులు గుద్దారు. ఆటోలో ఒదిగి కూర్చున్న వృద్ధదంపతుల్లో ముసలావిడ స్పృహతప్పి రోడ్డుమీదకు ఒరిగిపోయింది.

బంద్ దృశ్యాల్ని భాస్కరం బాధామ యంగా వీక్షిస్తున్నాడు.

పులీ, నక్క, తోడేలు పార్టీల మనుషులు కేరింతలు కొడుతూ పట్టణ రహదారుల గుండా వీరవిహారం చేశారు.

ఊరి చివరకు వచ్చారు. వారి ఆగ్రహం పెల్లుబుకింది... ఎదురుగా బియ్యపు మిల్లు ఒకటి ధన్‌ధన్‌మంటూ పనిచేస్తోంది. ఆవర ణలో విశాలమైన సిమెంటు చప్టామీద కూలీ లు ధాన్యం ఆరబెడుతూ ఉన్నారు. మిల్లు నిండా చీమల్లా కూలీలు... పులీ, నక్క, తోడేళ్ళు ఉగ్రరూపంతో మిల్లులోకి ఉరి కాయి.

"మీరంతా బయటకు పొండి. ఎవరూ పనిచేయడానికి వీల్లేదు. మా నాయకుడు చనిపోయి, ఈవాళ్టికి మూడవరోజు. మిల్లు మూతపడాలి'' ముక్తకంఠంతో అరిచాయి. మిల్లులో యజమాని లేడు. గుమాస్తా మిల్లు ను మూసెయ్యడానికి సిద్ధపడ్డాడు.

"ఈ దినం కూడా మాకు పస్తులేగతి'' కూలీలు బయటకు వస్తూ నీరసంగా గొణు క్కుంటున్నారు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకుంటున్నారు. ఒకరి గోడు మరొకరితో వెళ్ళబోసుకుంటున్నారు. ఒక కూలీ భాస్క రంతో తమ కష్టాలు ఏకరువు పెట్టుకున్నాడు.

పులీ, నక్క, తోడేలు, మనుషులు ఏభై మందీ గోల చేస్తూ మిల్లంతా కలయతిరిగా రు. లోపల గోదావునులో బస్తాలు నింపుతూ న్న కూలీల్ని కూడా బలవంతంగా బయటకు పంపారు.

భాస్కరం గేటుముందు నిలబడి ఆశ్చ ర్యంగా చూస్తున్నాడు.

కూలీలంతా మిల్లులోంచి గుంపులు గుంపులుగా బయటకు వచ్చేశారు. మిల్లు ఖాళీ అయిపోయింది.

ఒకటి, రెండు, మూడు, నాలుగైదు.

పది నిముషాలు గడిచాయి. మరో పదిని ముషాలు గిర్రుమని తిరిగాయి. ఎంతసేపటి కీ, పులీ, నక్క, తోడేలు మనుషులుమాత్రం మిల్లులోంచి బయటకు రాలేదు.

భాస్కరం, ఆవరణలో నిలబడ్డ చీమ ల్లాంటి కూలీలవైపు చూశాడు. వాళ్ళ ముఖా లు ఎర్రగా ఉన్నాయి. చేతులు కూడా అంతే!

అతను బంద్ గురించి వార్త రాయడానికి ఆత్రంగా పరుగెత్తాడు.

కొద్దిసేపట్లోనే... పట్టణంలోని ప్రజలు, తమ దైనందిన జీవనం స్వేచ్ఛగా చేసుకో వడం మొదలుపెట్టారు!

-శ్రీకంఠస్ఫూర్తి

# గోళ్లు అమ్మబడును

గిన్నిస్ బుక్ ఆఫ్ వరల్డ్ రికార్డ్స్‌లో గత పదిహేనేళ్లుగా, అతిపొడుగైన గోళ్లు గల వ్యక్తిగా పేర్కొనబడుతున్న భారతీయుడు శ్రీధర్ బిలాల్ బాధలు అతనివి. 53 సంవత్సరాల బిలాల్ అంత పొడుగు గోళ్లకోసం వారానికి నాలుగు నెయిల్ పాలిష్ బాటిల్స్ కొనాలి. నిద్రలో కాస్త ప్రక్కకు ఒరిగితే గోళ్లు విరిగిపోతాయేమోననే భయం ఓవైపు. అతని భార్య ఆ గోళ్లమీది అసహ్యంతో గత అయిదేళ్లుగా అతనికి దూరంగా ఉంటోందిట. ఇరుగు పొరుగువారేమో ఈయన్నో పిచ్చివాడికింద జమకడ్తున్నారట. సైకిలెక్కి ఆఫీసుకెళ్లటం కూడా ఓ సమస్యే. అందుకని ఈమధ్య ఈయనో నిర్ణయానికొచ్చాడు. ఆ గోళ్లని ఓ లక్ష డాలర్లకి, అంటే 36 లక్షల రూపాయలకి అమ్మకానికి పెట్టాడు. అన్నింట్లోకి పెద్దగా పెరిగిన గోరు పొడవు 49 అంగుళాలు.

## సచిత్ర విచిత్రం



# చతుర

సంపుటి: 20 సంచిక: 8 సెప్టెంబర్ 1997

"నా మనసున తానుండి కందిపోవుచున్నదో లేక ఇంత మదనతాపం అనుభవిస్తున్న నన్ను తన మనసులో నుంచుకుని వాడిపోవుచున్నదో" అని చింతిస్తున్నాడు వసుచరిత్రలోని హీరో... ప్రియురాలు గిరికని తలచుకుని.

క్లాసులో ఆ పాఠం చెబుతున్న లెక్చరర్ మాత్రం తానే వసురాజై, తన ఎదురుగా బెంచీపై కూర్చుని తదేకంగా తనవైపే చూస్తున్న విద్యార్థినే గిరిక అయినట్లూ ఊహించుకుంటూ... పరిసరాల్ని మరిచిపోయి మధురోహలలో తేలిపోతున్నాడు. ఆమె పరిస్థితీ దాదాపు అలానే వుంది.

నిత్యం పార్కులో కలుసుకునే ఆ ప్రేమ జంట క్లాసులోని ఆ పాఠాలేగాక జీవితంలో కూడా నేర్చుకున్న అసలైన పాఠాలె లాంటివి?

ప్రేమలతలు పెనవేసుకు సాగిన వారి కథ పెళ్లిపీటల మీదికి చేరుకోగలిగిందా?

పిల్లల పంతాలు, పెద్దల పట్టింపుల నేపథ్యంలో

అద్దేపల్లి సుచిత్రాదేవి నవల

'ఎదురింటి అమ్మాయి'

ఈ నెల చతుర సమగ్ర నవల.



అటెండెన్సు తీసుకున్న తర్వాత ముందు రోజు మొదలుపెట్టిన పాఠం చెప్పడం ప్రారంభించాడు అరవింద్! '

'వసుచరిత్ర' చెపుతున్నాడతను. నాయిక గిరిక కూడా తనలాగే తనను తలచుకుని విరహవేదన పడుతోందని తెలుసుకున్న నాయకుడు ప్రియురాలి కోసం పరితాపం చెందుతున్నాడు పాఠంలో.

"నా మనస్సున తానుండి కందిపోవుచున్నదో లేక యింత మదన తాపం అనుభవిస్తున్న నన్ను తన మనస్సులో నుంచుకుని వాడిపోవుచున్నదో? ఆహో నా వల్లనేకదా ఆ సుందరికి యింతటి వ్యధ?" అని చింతిస్తున్నాడు.

ఆ అంశాన్ని ఎంతో ప్రభావితమై అరవింద్ చెపుతుంటే అమ్మాయిలందరికీ తానే గిరిక అయినట్లూ, అబ్బాయిలందరికీ తానే వసురాజైనట్లూ అనిపించగా శ్రద్ధగా వింటున్నారు. తన పక్కనున్న అమ్మాయిలు పాఠంలో లీనమయిపోయి ఈ ప్రపంచాన్నే మర్చిపోయి పరవశిస్తూ తదేకంగా అరవింద్‌నే చూస్తుంటే సింధూరకు మాత్రం ఒళ్లు మండిపోసాగింది.

'మరీ అంత ఒళ్లు తెలియకుండా ఏం చెపుతున్నాడో చూడు మహాశయుడు. ప్రేమ అనే రెండక్షరాలు ఎక్కడ వినిపించినా కనిపించినా సరే ఈ జనాలెవ్వరికీ శరీరంపై స్పృహ వుండదు' అని లోలోపలే విసుక్కుంది.

కాని అరవింద్ ఈ లోకంలో లేడు. అతని మనోనేత్రం ముందు నాయికానాయకుల స్థానంలో తానూ, సింధూర వున్నట్లు అనిపించసాగింది. బెల్ కొట్టేదాకా అతను ఆ మధుర స్వప్నావస్థలోనే వుంటూ పాఠం అద్భుతంగా చెప్పాడు.

తన అవర్ అయిపోగానే పుస్తకం తీసుకుని రూమ్‌లోంచి వెళ్లబోతూ సింధూరవైపు చూసి ఎవరికంటా పడకుండా నేర్పుగా కళ్లతోనే నవ్వి క్లాసులోంచి బయటపడ్డాడు.

★ ★ ★

కో ఎడ్యుకేషన్ కాలేజీ అయినందువలన మరీ కలర్‌ఫుల్‌గా ఉంది వాతావరణం. రంగురంగుల ఫేషనబుల్ డ్రస్సుల్లో అమ్మాయిలు, ఆ అమ్మాయిల దృష్టిని ఆకర్షించాలని హీరోయిజాన్ని ప్రదర్శిస్తూ, ఏవో కొంటె మాటలంటూ, సినిమా పాటలు హమ్ చేస్తూ అబ్బాయిలు, అప్పుడొకరు అప్పుడొకరు లెక్చరర్స్ తమ పక్కగానో, ఎదురుగానో వచ్చినపుడు టక్కున తమ మాటలు ఆపేసి, వారికో నమస్కారబాణం పడేసి మళ్లీ తమ మామూలు ధోరణిలో పడిపోతున్నారు వాళ్లు.

యువతరంలోని ఉత్సాహమంతా అక్కడే చిందులు వేస్తున్నట్లుంది. ఇంతలో బెల్ మోగడంతో అందరూ ఎవరిదారిన వాళ్లు వారివారి క్లాసురూముల్లోకి నడిచారు నవ్వుతూ, తుళ్లుతూ.

అది ఫైనల్ బి.ఎ క్లాసు. తెలుగు లెక్చరర్ అరవింద్ క్లాసురూమ్‌లోకి వచ్చాడు. ఏడాది కిందటే పాతికేళ్లు దాటిన యువకుడు అరవింద్. కాలేజీలో చాలామంది అమ్మాయిలు అతన్ని ఇష్టపడతారు. అబ్బాయిలు మాత్రం అందమైన ఈ కుర్ర మాష్టారొకరు మన మధ్యన పోటీకి అని ఈర్ష్య పడుతుంటారు.

★ ★ ★

సృష్టిలో మా అంత అందమైనవీ, ఆహ్లాదకరమైనవీ మరింకేవీ లేవు సుమా అంటున్నట్లు ఒయ్యారాలు పోతున్నాయి పార్కులోనిరంగురంగుల పూబాలలు. తోటమాలి అంతకుముందే మొక్కలకు నీరు పెట్టినట్లున్నాడు. పచ్చని ఆకులమీదనుంచి నీటిబొట్లు రాలుతుంటే ముత్యాలు రాలుతున్నట్లున్నాయి దూరానికి. పూల పరిమళాలు





మోసుకొచ్చే పిల్ల తెమ్మెరలు, ఆ పువ్వులతో పోటీపడుతూ కేరింతలు కొడుతున్న చిన్న పిల్లల నవ్వులు, వారితో వచ్చిన పెద్దలు, ఏకాంతాన్ని అన్వేషిస్తున్న జంటలు అలా ఆ సాయంకాలపు వేళ పార్కంతా కళకళలాడుతూ కన్నుల పండువుగా వుంది.

ఆ పార్కులో ఓ క్రోటన్స్ పొదపక్కన కూర్చుని వున్నాడు అరవింద్. అతని కళ్లు ఎవరి కోసమో వెదుకుతున్నట్లున్నాయి. మోచేతిపై వాలి, అపుడపుడు పచ్చికను తెంపిపడేస్తున్నాడు విసుగ్గా. అంతలో అతని కళ్లు మెరిశాయి. దూరంనుంచి నెమ్మదిగా నడిచి వస్తోంది సింధూర.

"నేను అప్పట్నుంచి ఎదురు చూస్తుంటే తమరింతమెల్లగా మెల్లగా నడుచుకుంటూ వస్తున్నారన్నమాట" ఆమె దగ్గరకివచ్చాక సరిగా కూచుంటూ తెచ్చిపెట్టుకున్న కోపంతో అన్నాడు.

"ఫర్వాలేదు. గడ్డి అంతా అలాగే వుంది. వచ్చి మరీ ఎంతో సేపైనట్లు లేదే" అతని పక్కనున్న గడ్డిపరకల్ని చూసి అంటూ ఎదురుగా కూర్చుంది.

"యుగాలైంది నేను వచ్చి తెలుసా? తెంపి పడేసిన గడ్డి గుట్టలుగా పడివుంటే తోటమాలి చూస్తే బతకనివ్వడని అదంతా మేస్తూ గడిపానింతసేపూ"

తమాషాగా అతనన్న తీరుకి పకపకా నవ్వింది సింధూర.

"నీకంతా నవ్వులాటగా వుంది సింధూ. నీకోసం ఎదురుచూస్తూ, కలలుకంటూ వూహల్లోనే గడిచిపోయేలా వుంది బతుకంతా"

"నీకేం తండ్రీ... నువ్వలాగే నిష్ఠూరమాడతావు. మగమహారాజువి. నా బాధలు నీకేం తెలుస్తాయి? "

"నీకేం తల్లీ ఆడ మహారాణివి, నా విరహాలు, తాపాలు నీకేం తెలుస్తాయి? " ఆమె చేతిని తన చేతిలోకి తీసుకుంటూ దగ్గరకు జరగబోయాడు.

"ఆ, ఆ, గుర్రాన్ని కాస్త కట్టేయాలి మహాశయా!" చెయి లాక్కుని దూరంగా జరిగింది.

"ఊ, కట్టేసికట్టేసి నా కోర్కెల గుర్రం పరుగు మర్చిపోయి గాడిద అయ్యేట్లుంది" వుస్సురన్నాడు అరవింద్.

"గాడిదవనీ, ఏనుగవనీ పెళ్లి తర్వాతే ఆ ముచ్చట్లన్నీ" కచ్చితంగా చెప్పింది సింధూర.

"పెళ్లే? నువ్వీ జన్మకి దాన్ని జరగనిస్తావా? మా నానమ్మతో చెప్తానంటే అపుడే వద్దంటావు. పోనీ నువ్వే మీ వాళ్లతో చెప్పు అంటే భయం యిప్పుడే కాదంటావు. ఇంకెలా అవుతుంది మనకి పెళ్లి? "

"మా ఇంట్లో నా పెళ్లి ప్రయత్నాలు జరుగుతున్నపుడు చెపుదాం మన ప్రేమ సంగతి. అయినా నీకయితే ఉద్యోగం వుంది గానీ నా చదువు పూర్తికావాలికదా? "

"నీకు చదువెందుకోయ్, ఉద్యోగాలు చేయాలా వూళ్లేలాలా? మనకు మనవలు పుట్టి కూర్చుని తిన్నా తరగనంత ఆస్తి వుంది గ్రామంలో మాకు"

"ఉద్యోగాలు చేసుకునేందుకు, వూళ్లు ఏలేందుకుకాదు చదువు. చదువు అన్నది విజ్ఞానం కొరకు" చిరుకోపంతో అన్నది.

"అలాగా? అజ్ఞానం కొద్దీ అన్నాలే నేనా మాట. ఇంతకూ మీ ఇంట్లోవాళ్లు యిపుడిపుడే నీ పెళ్లి ప్రయత్నాలు చేయరంటావు"

"మా ఇద్దరక్కయ్యలకి పెళ్లిచేసి ఆపై పెళ్లయినప్పట్నుంచీ చీటికి మాటికి వాళ్లు కోరే గొంతెమ్మ కోరికలు తీరుస్తూ డీలా పడిపోతున్నారు మా నాన్నగారు. డబ్బు కూడదీసుకుని కానీ నా పెళ్లి మాట ఆలోచించర్రు. పైగా మా నాన్న మరో కొద్ది నెలల్లో రిటైరు కాబోతున్నారన్నానా. ఆ డబ్బుదీవస్తే కానీ నా పెళ్లి మాట తలపె



ట్టరు. పెళ్లి సంగతి వదిలెయ్. అసలు ఈవేళ నిన్నో విషయం సీరియస్‌గా అడగాలని వచ్చాను" టాపిక్ మారుస్తూ అడిగింది సింధూర.

"ఏమిటది? "

"నేనీవేళ ఏ రంగు డ్రస్ వేసుకున్నాను? "

"నీలం"

"మీరే కలర్ షర్ట్ వేసుకున్నారు? " సింధూర అరవింద్‌ని ఒక్కోసారి నువ్వు అంటుంది. ఒక్కోసారి మీరు అంటుంది.

"నీలం షర్టు. ఏం నాకేమన్నా కలర్ బ్లైండ్‌నెస్ వుందని నీకు సందేహమా? కళ్ల డాక్టరులా అడుగుతున్నావు"

"నా మొహం, మీరూ నేనూ చెప్పుకున్నట్లుగా ఒకేరోజు ఒకే కలర్ వేసుకుని వస్తే క్లాసులో నా ఫ్రెండ్స్ నన్నెంతో ఉడికించారు. మనిద్దరి సంగతి అందరికీ మీరే ఎగ్జిబిట్ చేసేలా వున్నారు"

"ఇందులో ఉడికించడానికీ వేధించడానికీ ఏముందని? మీ ఇంటికీ మా ఇంటికీ లంకకీ గోదావరికీ వున్నంత దూరంవుంది. ఏదో కాకతాళీయంగా వేసుకొచ్చామనుకోవచ్చుగా"

"ఏం కాకతాళీయమో. బాగా ఎగతాళి చేశారు నన్ను"

"రేపు నీ మెడలో తాళికట్టబోయేది నేనేనని చెప్పు. ఇక ఎగతాళీ చేయరు, దిగతాళీ చేయరు" తమాషాగా అన్నాడు.

"మాటల గారడీ మాత్రం బాగా వచ్చు" ముద్దుగా విసుక్కుంది సింధూర.

"చేతలగారడీ కూడా వచ్చు ప్రదర్శిద్దామంటేనే నువ్వు పర్మిషన్ ఇవ్వటం లేదు మరి"

"ఊ" కోపంగా చూసింది సింధూర "ఇలా మాట్లాడుతుంటే నేను వెళ్లిపోతానంతే"

"ఆల్‌రైట్ ఆల్‌రైట్ దారి మార్చేస్తున్నాను"

నవ్వింది సింధూర. "మీరే దారీ మార్చద్దుకానీ లేవండిక. ఇంటిదారి పడదాము" లేచి నిలబడింది. సింధూర తన డ్రస్‌కి అంటుకున్న గడ్డిపరకల్ని సుతారంగా చేత్తో దులుపుకుంటూంటే తనూ లేచి ముందుకి వంగుతూ కొంటెగా అడిగాడు అరవింద్, "మే అయ్ హెల్ప్‌యూ డార్లింగ్"

"ఏయ్ వద్దు" చేత్తో వారిస్తూ నవ్వేసింది సింధూర.

"ఎక్కడా ముట్టుకునేందుకు చిన్న ఛాన్సివ్వవుగా" చిరుకోపంగా అంటూ ఆమె చేయందుకుని ఆమెతో పాటుగా అడుగులు వేశాడు అరవింద్.



ముచ్చటైన డాబా ఇల్లది. ఇంటి ముందు స్థలం ఎక్కువ లేకపోయినా వున్నంతలోనే పొందిగ్గా వేసిన పూల మొక్కలు ఇంటికి అందాన్నిస్తున్నాయి.

ఆ ఇంటి వరండాలో పడక్కుర్చీలో కూర్చుని కాఫీ తాగుతూ పేపరు చూస్తున్నారు ఇంటి యజమాని ఆనందరావు. నలుగురు పిల్లలాయనకి. ఇద్దరమ్మాయిలకి పెళ్లిళ్లు చేశారు. ఇక అబ్బాయి సంజయ్,

చిన్నమ్మాయి సింధూర వున్నారు పెళ్లికి. మరికొద్ది నెలల్లో రిటైరు కాబోతున్నా వృద్ధాప్యం ఛాయలేమీ కనిపించటం లేదు ఆయనలో. దృఢంగా ఆరోగ్యంగా వుండి తెలియని వారికి ఆయన వయస్సు నలభై అయిదన్నా నమ్మేలా వుంటాడు.

గేటు చప్పుడవడంతో ఆనందరావు తలెత్తి చూసి నారాయణరావుగారు వస్తుండటంతో పేపరు పక్కన పెట్టేశాడు. రెండు వీధుల అవతల వుంది నారాయణరావుగారిల్లు. పొద్దున్నే వాకింగ్‌కి వెళ్లి అపుడపుడూ అలా వచ్చి కూర్చుని కాసేపు మాట్లాడి వెళుతుంటారు.

"అరుంధతీ ఓ కప్పు కాఫీ" లోపలికి కేకేస్తూ "ఆ రావయ్యా కూర్చో" మిత్రుణ్ణి ఆహ్వానిస్తూ పక్కనున్న కుర్చీ చూపించాడు.

అరుంధతి కాఫీ కప్పు తెచ్చి నారాయణరావుకిచ్చి కుశలమడిగి లోపలికెళ్లిపోయింది.

"ఊ, కాఫీ తీసుకున్నావా? ఇప్పుడు చెప్పు ఏమిటి విశేషాలు?" అడిగాడు ఆనందరావు.

"విశేషాలా? నా దగ్గరేముంటాయి. మరో రెండు మూడు నెలల్లో ఉద్యోగ విరమణ చేయబోతున్నావు. నువ్వు చెప్పాలి తర్వాతేం చేయబోతున్నావు ఆ కథాకమామీషు"

"కథలుకాదు, ఆ తర్వాతన్నీ నాటకాలే అనుకో" చిన్నగా నవ్వాడు ఆనందరావు.

"నాటకాలా?"

"ఆ నాటకాలే. యాభై ఎనిమిదేళ్లు పరాధీనంగానే గడిపానా? ఇక నా శేషజీవితమంతా నాటక కళకే అంకితం చేయాలనుకుంటున్నాను"

"ఇన్నాళ్లూ పరాధీనంగా గడపటమేమిటి?"

"కాకపోతే ఏమిటి చెప్పు. మనిషికి నిజమైన స్వేచ్ఛ ఎక్కడుంది? జీవితమంతా పరాధీనమే. చంటి పాపాయిగా వున్నపుడు తల్లి అధీనంలో వుంటారు. బాల్యం అంతా తండ్రి యిష్టప్రకారం నడుచుకోవాలి. మరి కాస్త పెద్దయితే చదువుమధ్య ఎటూ బందీలమే. ఆ తర్వాత పెళ్లి. దాంతో మొత్తం జీవితానికే పెద్ద సంకెలు తగిలించుకున్న వాళ్లమవుతాము. పొద్దున లేస్తే బతుకులో పరుగు ప్రారంభమవుతుంది. తన ఇల్లే తన ప్రపంచం కావాలి. లేకపోతే భార్యకు సంజాయిషీ ఇచ్చుకోవాలి. ప్రతి పైసాకు లెక్క వుండాలి. నిత్యం సంసారంలో జమా ఖర్చులు, సంతానం యొక్క యోగక్షేమాలు వీటితోనే జీవితమంతా తెల్లవారిపోతుంది. ఇంతవరకూ నేనూ ఇలాగే గడిపాను. జీవితంలో ముప్పాతిక వంతు అయిపోయింది. ఇక మిగిలిన పాతిక వంతన్నా నా యిష్టప్రకారం గడపదల్చుకున్నానన్న మాట"

ఆ మాటలకి నారాయణరావు అయోమయంగా చూశారు.

"ఆ తర్వాతేం చేయదల్చుకున్నావు అని అడిగితే ఈ వేదాంతమంతా చెపుతావేమిటి? ఇంతకూ నువ్వు చెప్పిందేమిటో నాకు ఒక్కముక్క అర్థం కాలేదు"

"మనకేదన్నా అర్థం కాకపోతే చాలు దానికి వేదాంతమన్న పేరు పెట్టటం మన కలవాటు. అయినా నేనిప్పుడేం వేదాలు, ఉపనిషత్తులు మాట్లాడానని నీకర్థం కాకపోవటానికి?"

"ఆ, ఆ ఒక్కటి మాత్రం అర్థం అయిందిలే. అయితే రిటైరు అయిన తర్వాత ఇంకే వుద్యోగమో, వ్యాపారమో చూసుకోక లేక ఇంట్లో విశ్రాంతిగా కూర్చోక నాటకాల్లో చేరిపోతావన్నమాట"

"కరెక్టుగా పాయింటులోకొచ్చావు. ఒక నాటక సమాజం పెట్టాలనుకుంటున్నానోయ్. కావాలంటే నువ్వూ చేరవచ్చు. సినిమాల, టీవీల మాయలోపడి జనం నాటక

రంగాన్ని పూర్తిగా మరిచిపోతున్నారు. మన లాంటి వారందరం చేరి ఓ ఉద్యమంలా శ్రమించి మళ్ళీ నాటకానికి జీవం తెద్దాం" ఆనందరావు మాటల్లో తెలియకుండానే ఆవేశం ధ్వనించింది.

నారాయణరావు మిత్రుడివంక పిచ్చాణ్ణి చూసినట్లు చూశారు.

"బహు మంచి మాటలు చెప్పావుకానీ ఇకనేవెళ్ళొస్తాను. బజారుకెళ్ళే పనుంది" అని చెప్పి వెళ్ళిపోయారు.

ఆయనలా వెళ్ళటంతో బయటకు వచ్చింది అరుంధతి.

"ఏమిటీ, ఆయనతో ఏదేదో చెప్పి హడలు గొట్టారు. అయితే ఇంతకీ మీరు నిజంగానే నాటక సమాజం పెట్టబోవటంలేదుకదా"

"అవును, అందులో తప్పేముంది? దానికి నువ్వెందుకిలా పరుగెత్తుకొచ్చి అడుగుతున్నావు? "

"పరుగుకాదు. ఉరికట్టుకు చస్తానంతే. ఇన్నేళ్లూ గుట్టుగా బతికినవాళ్లం. ఈ వయసులో నాటకాలేయటమేమిటి? నలుగురూ ఏమనుకుంటారు? "

"ఇందులో నలుగురూ అనుకునే దానికేముంది? అయినా నాటకాలు అంటే ఏమన్నా తమాషానా? అది మాత్రం కళా సేవకాదూ? "

"కళాసేవో, కాకరకాయో నాకు తెలియదు. రిటైర్ అవటంతో బాధ్యతలు కూడా తీరిపోయాయనుకుంటున్నారా? ఇంకా ఒక పిల్లకు పెళ్ళి చేయాలి. పిల్లాడికో దారి చూపాలి. చక్కగా ఏ ప్రయివేటు కంపెనీకెళ్ళినా మీకు కళ్ళకద్దుకుని ఉద్యోగమిస్తారు. ఆ ప్రయత్నమేదో చేసుకోక నాటకాలంటారేమిటి? "

ఆనందరావుకి భార్య ధోరణికి కష్టం వేసింది. నాటకాలు ఆయన మనసులో ఎంతోకాలంగా అంతర్గతంగా దాచుకున్న ప్రాణప్రదమైన అభిలాష. ఇన్నేళ్ళూ ఎవరితోనూ యింతవరకు ఆ విషయం ప్రస్తావించలేదు. తొలిసారిగా కోరిక బయటపెడితే ముప్పయ్యేళ్ళకి పైగా తనతో కాపురం చేసిన భార్యే అలా తీసేస్తూ మాట్లాడుతుందని ఆయన వూహించలేకపోయాడు. ఇక అప్పుడావిడతో ఏం మాట్లాడినా వృధానే అనిపించింది. అందుకే లేచి పేపర్ పక్కన పడేసి లోపలికి వెళ్ళిపోయాడు మవునంగా.

"అదేంటి, ఒకపక్క నేను మాట్లాడుతుంటే..."

అంతలో యింటిముందు ఆటోవచ్చి ఆగటంతో మాట మధ్యలోనే ఆపేసి అటు చూసింది.

పెద్దమ్మాయి అంజలి సూట్‌కేసుతో దిగుతూంది.

"ఏవండోయ్. అంజూ వచ్చింది" లోపలికి కేకవేసింది.

"ఏమిటమ్మా అంజూ, హఠాత్తుగా వచ్చేశావు. అంతా కులాసానేనా? " ఆనందరావు కూతుర్ని ఆదరంగా అడిగారు.

"అంతా బాగానే వున్నారు నాన్నా. ఊరికే చూడాలనిపించి వచ్చాను" లోపలికి నడుస్తూ అన్నది అంజలి.

"ఊరికేట! ఊరకరాదు మహాత్ములు. చిన్నగా యీరోజు రాత్రికో, రేపటికో బయట పెడుతుంది అసలు విషయం" చదువుకుంటూన్నదల్లా పుస్తకం మూసి వస్తూ మనసులో అనుకుంది సింధూర అక్క సమాధానానికి.

"ఒక్కదానివే వచ్చావేం అక్కయ్యా. వీరూ, ధీరుని తీసుకురాలేదేం? " అడిగింది.

రఘువీర్, రణధీర్ అంజలి కొడుకులు.

"ఎందుకే నేను ఏమన్నా పది రోజులుండేందుకు వచ్చానా! రెండు రోజులికి వాళ్ళు ప్రయాణంలో నలిగిపోతారు. వాళ్ళ

నానమ్మ వుందిగా చూసుకునేందుకు"

ఇంతలో తల్లి "కాఫీ తాగుదువు రా అంజలీ" అని పిలవటంతో అటు వెళ్ళిపోయింది.

★ ★ ★

అంజలి తను వచ్చిన సంగతి ఆ రాత్రికి బయటపెట్టింది. అయితే విషయం చిన్నది కాదు కాబట్టి ఆనందరావు వెంటనే వూ అన లేక ఆలోచనలో పడ్డారు. అరుంధతి మాత్రం కూతుర్లు అడిగినదేదైనా యిచ్చెయ్యాలనే అనుకుంటుంది ఎప్పుడూ. లేకపోతే సొంతకాపురం కాదు అత్తగారు, మామగారు చాటుకోడలు. వాళ్ళేమంటారో కూతుర్ని ఆమె భర్తతో సవ్యంగా కాపురం చేయనిస్తారో లేదోనన్న దిగులు.

దగ్గర దగ్గర ముప్ఫయ్యేళ్ళు రాబోతున్నాయి అంజలికి. ఇంతవరకూ ఎవరితోనూ పెద్దగానూ కఠినంగానూ మాట్లాడి ఎరగదు. మనసు చాలా మెత్తన. ఊరికే కళ్ళమ్మట నీళ్ళు వచ్చేస్తాయి. ఆమె అమాయకత్వాన్ని, మెతకతనాన్ని అత్తవారు బాగానే వాడుకుంటున్నారు. పెళ్ళప్పుడు కట్నం, నగలతో వచ్చినా కోడలు వాళ్ళకి ఏమీ తీసుకురానట్లే లెక్క. ఎప్పుడూ ఏదో ఓ వస్తువు తెమ్మనో, లేదు ఏ అవసరానికో డబ్బు కావాలనో పుట్టింటికి పంపిస్తూంటారు వాళ్ళకి ఎంత డబ్బున్నా కూడాను. అయితే యింతవరకూ ఏడెనిమిది వేల లోపు వస్తువులతో అయిపొయ్యేది. ఈసారి ఏకంగా పదిహేను వేలు రొక్కం తెమ్మని పంపించారు.

"ఇల్లు కడ్తున్నారు కదామ్మా. అనుకున్న దానికంటే ఎక్కువైందట ఎస్టిమేషన్. ఓ పదిహేను వేలు సర్దమంటున్నారు" కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ కూతురు అడుగుతూంటే కడుపు తరుక్కుపోయింది అరుంధతికి.

"సర్దడమంటే అప్పుగానా అక్కా?" సింధూర అడిగింది.

తెల్లబోయి చూసింది అంజలి. "అప్పా? అలా చెప్పలేదే ఆయన"

"అప్పుగా కూడా కాకపోతే యిక్కడేమన్నా చెట్టుకి కాస్తాయనుకుంటున్నారా మీవాళ్ళు. అస్తమానం అడుగుతూంటే నాన్న మాత్రం ఎక్కడ్నుంచి తెస్తారు? అక్కా అసలు నువ్వింత మెత్తగా వుండబట్టే వాళ్ళలా ఆడిస్తున్నారు. నేను మా పుట్టింటి వాళ్ళని అడగను, వెళ్ళను, అని మొండికేస్తే ఏం చేస్తారేం? "

"ఏం చేస్తారా? తన్ని తగలేస్తారు! నీకేం తెలుస్తాయి యీ విషయాలన్నీ. అయినా నీకెందుకు చిన్నపిల్లవి. మా బాధలేవో మేం పడ్తాములే. ఏదో మేము వున్నంతవరకూ ఎవరూ దేనికీ బాధపడక్కరలేదు"అరుంధతి కోప్పడింది చిన్న కూతుర్ని.

సింధూరకి బాగా కోపంవచ్చింది ఆ మాటలకి.

"సరే యిచ్చుకోండి. ఎంత కాలం యిస్తారో" అనేసి విసవిసా తన గదిలోకి వెళ్ళిపోయింది.

అంజలి కన్నీళ్ళు తుడుచుకుంటూ కూర్చుంది. అరుంధతి పెద్దకూతుర్ని ఓదార్చింది. "సింధు మాటలు పట్టించుకోవద్దు. చిన్న పిల్ల కదా ఏదో తెలిసీ తెలియక వాగుతుంది. నీకెందుకు మీ నాన్న చేత ఎలాగోలా ఆ డబ్బు యిప్పించే బాధ్యత నాది. కానీ యిదే చివరిసారి అని చెప్పాలి మీ వాళ్ళకి. అయినా అది అన్నదని కాదుకానీ నువ్వు కాస్త గడుసుతనం నేర్చుకోవాలమ్మా. భర్త మాట వినాల్సిందే కానీ అపుడపుడైనా నీ మాటా భర్త వినేట్లు చేసుకోవాలి. అల్లుడుగారు కనక నీ మాట వినేవాడయితే యిక నువ్వు మీ అత్తగారికీ, మావగారికీ ప్రతి చిన్నవిషయానికీ భయపడనవసరం లేదుకదా!"

అంజలిపైకి ఏమీ అనలేదుకానీ మన

సులో అనుకున్నది.

"ఛీ ఆడదానిగా పుట్టేకన్నా ఏ అడవిలోనో మానుగా పుట్టమన్నారిందుకే కాబోలు. అత్త మామలకేమో కోడలి విషయంలో సంతృప్తే వుండదు. కోడలిగా వాళ్ళ గొంతెమ్మ కోరిక లన్నీ యిటొచ్చి తల్లితండ్రులతో చెప్పాలంటే ఎంత బాధగా వుంటుందో ఎవరూ అర్థంచే సుకోరేం? అత్తగారింటికీ, అమ్మగారింటికీ ఆడపిల్ల డబ్బు అనే వారధి అవటంకన్నా క్షోభ ఏముంటుంది? "

అంజలిలాంటి ఆడవారు అలానే ఆలోచి స్తారుకానీ అలా వారధిలా తామెందుకు వుండాలి అని ఆలోచించరు,

ఆలోచించలేరు.

★ ★ ★

మరుసటిరోజు ఆనందరావు ఆఫీసుకి తయారవుతుంటే అరుంధతి అడిగింది.

"డబ్బు గురించి ఏం ఆలోచించారు? "

"ఇంక ఆలోచించేందుకేముంది. మామూలు ప్రకారమే సింధు పెళ్ళికని దాచిన దాంట్లోంచి తీసిద్దాం"

ఆవిడా ఏం మాట్లాడలేదు. ప్రస్తుతానికి అంతకన్నా మరేం చేయలేమని తెలుసు. అయితే యిది అంతటితో ఆగదనీ తెలుసు. ఇప్పుడిలా పెద్దమ్మాయి డబ్బుతో వెళ్ళగానే రెండో అమ్మాయి మంజుల దిగుతుంది. "అంజుకివ్వగా లేనిది నాకెందుకివ్వరు? " అంటుంది. పదిహేను కాకపోయినా అందులో సగమన్నా మంజుకీ యివ్వా ల్సిందే. లేకపోతే మంజు యిల్లు పీకి పంది రేస్తుంది.

"ఆ మిగిలిన కాస్తన్నా సింధు పెళ్ళికే అవాలనుకుంటే ముందు మీరేదన్నా సంబంధం చూసి దాని పెళ్ళి నిశ్చయం చేయండి" అన్నది అరుంధతి.

"సంబంధాలు అనుకోగానే కుదిరిపోతు న్నాయా? ఎన్ని వెతకాలో, కానివ్వు నా పియఫ్ కూడా వచ్చిన తర్వాత ప్రయత్నం చేద్దాం" అన్నాడు ఆనందరావు.

"మరిన్ని సాదకబాధకాలు పెట్టుకుని అంతా అయిపోయినట్లు టింగురంగా అని తమరు నాటకాలేసుకుంటూ తిరుగుతానంటి రిగా" ఆవిడ కంఠంలో ఎగతాళి ధ్వనించింది. సంతానం విషయంలో ఆమె ఎంత సౌమ్యురాలో భర్త దగ్గర కొచ్చేసరికి సాధించే భార్యగానే కనిపిస్తుంది.

"నువ్వేం వెటకారం చేయక్కరలేదు. నా బాధ్యతల్లా సింధు పెళ్ళి చేయటమేగా. అదీ చేస్తాను. నాటకాలు చూసుకుంటాను" పట్టు దలగా అన్నాడు ఆనందరావు.

"ఆహా... సింధు పెళ్ళి చేయటమేనా? మరి సంజయ్ మాటేం చేస్తారు? "

"మగపిల్లాడు. వాడిదారి వాడు చూసుకో గలడులే. అయినా నీ సుపుత్రుడు ఏదైనా వుద్యోగం సద్యోగం చూసుకుంటాడో లేక యీ మధ్యలోనే జై సద్గురో అని సన్యాసం పుచ్చుకుని ఏ అడవుల్లోకన్నా వెళ్ళిపోతాడో కనుక్కోముందు"

"వాడినలా తీసిపారేస్తూ మాట్లాడకండి. ఎంత పూర్వజన్మ సుకృతం వుంటే వాడికా భక్తిమార్గం అబ్బుతుంది. మీకూనాకూ రమ్మన్నా రాదా సద్బుద్ధి. వాడో నాటికి తప్పక గొప్పవాడవుతాడు చూస్తుండండి"

"ఆ, ఆ, అవాల్సిందే. వాడో స్వామీజీ, నువ్వో స్వామీజీ గారి మాతాజీ"

"మీకు వాడంటే ఎప్పుడూ చిన్న చూపే. ఏవో ఏ పుట్టలో ఏ పాముందో ఎవరు చూడొచ్చారు కనకా? "

"ఏవో పుట్టల సంగతి మనకెందుగ్గానీ మన పుట్టలో ఏముందో మనకి తెలి యదా? " నవ్వాడు.

ఆ మాటలకి అరుంధతి భర్తవంక కోపంతో రుసరుసలాడుతూ చూసి లోపలికె

ళ్ళిపోయింది.

ఆనందరావూ అలాగే చిన్నగా నవ్వు కుంటూ బయటకెళ్ళి పోయాడు.

★ ★ ★

అరుంధతి, ఆనందరావులకి ముగ్గు రమ్మాయిల మధ్య ముద్దుల కొడుకు సంజయ్. పొడుగ్గా, తెల్లగా, అందంగా వుంటాడతను. అయితే ఛూకాలం కుర్రా ళ్ళంతా తమలో లేని అందాల్ని కూడా వూహించేసుకుని రకరకాల అలంకరణలతో అందరి దృష్టినీ ఆకర్షించాలన్న తాపత్ర యంతో కిందా మీదా పడుతుంటే యితను వారందరికీ విరుద్ధంగా అసలు తాను వయ సులో వున్నవాడ్ననీ, అందంగా కూడా వుంటానన్న విషయమే మరిచిపోయినట్లు వుంటాడు. నల్లగా, ఒత్తుగా వున్న క్రాఫ్‌ని చక్కగా కట్ చేయించుకుని అందంగా దువ్వుకోక ఆ తలకి గరిటెడు కొబ్బరినూనె పట్టించి నున్నగా పైకి దువ్వేసుకుంటాడు. వదులు వదులుగా వుండే ఉతికి ఆరేసిన పైజమా లాల్చీ, ఆకు చెప్పులు, భుజాన ఓ చేతి సంచీతో, వయసును కాస్త పెంచి చూపించే ఫ్రేమున్న కళ్ళజోడు, అదీ అతని ఆకారం.

ఎప్పుడూ ఏదో ఓ పుస్తకం చదువుతూనే వుంటాడు. అతని బుర్రలో వుండే విషయ పరిజ్ఞానానికి అతన్నోనడిచే లైబ్రరీ అని చెప్పవచ్చు. ప్రతిరోజూ లైబ్రరి కెళ్ళటం అతని దినచర్యలో తప్పనిసరి కార్యక్రమం.

సంజయ్ గదిలో రామకృష్ణ పరమహం సది నిలువెత్తు ఫొటో వుంటుంది. ఆ పక్కనే వివేకానందుడు. అక్కడెప్పుడూ అగ రొత్తులు వెలుగుతూ వుండాల్సిందే. గదిలో వున్నంతసేపూ చదువుకుంటూనే వుంటాడు. లేకపోతే కళ్లు మూసుకుని ఆ ఫోటోల ముందు ధ్యానంలోనన్నా కూచుని వుంటాడు.

అరుంధతికి కొడుకునలా చూస్తుంటే ఎంతో దిగులుగా వుంటుంది. ఏ వయసుకా ముచ్చటున్నట్లు నవ్వుతూ తుళ్ళుతూ గంతు లేస్తూ వుండాల్సిన యీ వయసులో అంత వైరాగ్యమేమిటో ఆమెకి అర్థంకాదు. మన సులో తన కొడుకూ అందరి పిల్లల్లా వుండా లని కోరుకుంటుంది కానీ పైకి మాత్రం ఎవ రైనా సంజయ్‌కిదేం పిచ్చి అన్నట్లు మాట్లా డితే వూరుకోదు. తన కొడుకెంతో గొప్ప వాడు అందుకే సామాన్యులకెంత ప్రయ త్నించినా లభించని భగవద్భక్తి తన కొడుక్కి మాత్రమే కలిగిందనీ అందుకు తానెంతో గర్విస్తున్నట్లు మాట్లాడుతుంది.

ఇప్పుడూ అంతే భర్త అలా అన్నాడని కొడుకుపై మాట పడనిచ్చింది కాదుకానీ లోలోన ఆమెకూ ఎంతో కష్టం వేసింది. వంటింట్లో కెళుతుంటే సంజయ్ తన గదిలో అప్పుడే ధ్యానంలోంచి లేవటం కనిపిం చింది. పాలు కలిపిద్దామని స్టవ్ వెలిగిం చింది. కాఫీ, టీలు తాగటం, సినిమాలు, టీవి చూడటం, మామూలు వారపత్రికలవీ చదవటం అవన్నీ వదిలేశాడు సంజయ్.

తిండి అయినా ఎప్పటికప్పుడు తల్లి గమ నించి పెడితే తింటాడు కానీ నోరు తెరిచి "అమ్మా ఆకలేస్తోంది" అని అడగటం మానేసి ఎన్నో రోజులైంది.

డిగ్రీ ఆఖరు సంవత్సరం వరకు సంజయ్ కూడా అందరి కుర్రాళ్ళలాగే సినిమాలు, షికార్లు, ఫాషన్లు అంటూండేవాడు. బి.కామ్ మూడో సంవత్సరంలో వుండగా అతని ఫ్రెండ్ వాళ్ళింటికి ఎవరో ఓ స్వామీజీ వచ్చివుంటే ఓరోజు ఆయనతో కొద్దిసేపు కూర్చుని మాట్లాడాడు. అందరికీ ఒక నిర్ణీతకాలంలో అదీ కొద్దిసేపే తప్ప దర్శనమివ్వని ఆ స్వామీజీ సంజయ్‌ని కూచోపెట్టుకుని గంటల తరబడి మాట్లాడే వాడు. అవి మామూలు మాటలు కాదు వాదనలు.

ఎప్పుడూ క్లాసు ఫస్టువచ్చే తెలివైన సంజయ్ ఆ స్వామీజీతో చర్చలు, వాదనల్లో ఓటమిని అంగీకరించనట్లుండేవాడు. అందరూ ఎంతో ఆశ్చర్యపోయేవారు. ఇంత గొప్ప స్వామిగారు యీ కుర్రాడికి మాత్రం ఎందుకింతసేపు మాట్లాడేందుకు అవకాశం యిస్తారో వారికెవ్వరికీ అర్థమయ్యేది కాదు. నిజానికి ఆయన యింటర్వ్యూ కోసం క్యూలో నిలిచేవారు భక్తులు. కానీ స్వామీజీ అక్కడ విడిదిచేసిన పదిరోజులూ సంజయ్ పట్ల ప్రత్యేకమైన ఆదరణను కనపరిచారు. ఆయన వెళ్ళిపోయేటప్పుడు ఆ యింటి యజమాని, మిగిలిన భక్తులనుద్దేశించి అన్నారుట.

"ఈ కుర్రాడికి పూర్వజన్మ సాధనా సంపత్తి ఎంతో వుంది. తన లక్ష్యం మరిచి పోయి సంచరిస్తున్న యితనికి నేను గమ్యం గుర్తుచేస్తున్నానంతే" అని.

చివరికేం చెప్పారో ఏమయిందో కానీ సంజయ్‌లో ఆ తర్వాత ఎవరూ వూహించ లేనంత మార్పు వచ్చేసింది. అతని యీడు స్నేహితులందర్నీ కలవటం మానేశాడు. సినిమాలు, షికార్లకి స్వస్తి చెప్పేశాడు. అంతకుముందు పాకెట్‌మనీకింద ఎంతి చ్చినా ఖర్చుపెట్టేసి యింకా అడిగేవాడల్లా అసలు డబ్బులే వద్దనేశాడు. వేసుకుంటున్న ఫాషనబుల్ డ్రస్సులన్నీ పక్కన పెట్టేశాడు.

ఒక్కసారిగా కొడుకులో అంతగా మార్పుకి భయపడిన తల్లితండ్రులను చూసి "నేనేమీ సన్యాసుల్లో కలవటంలేదు. ఒకవేళ అలా కావాలనుకుంటే ముందుగా మీకు చెప్పి మీ అనుమతితోనే అవుతాను" అని చెప్పాడు.

"ఆ, యిలా ఎన్ని రోజులుంటాయిలే. వయసులో వున్న పిల్లాడు. ఏదో కొన్ని రోజులు అలా పిచ్చిలో పడినా ఉరకలువేసే వయసాకర్షణ నుంచి తప్పించుకోగలడా?" అని అనుకున్నా కొడుకు రోజురోజుకీ వైరా గ్యానికీ దగ్గరవటం చూసి ముఖ్యంగా అరుంధతికి మనోవేదన పెరిగి పోయింది.

భర్త వెళ్ళిన వంకే చూస్తూ కొడుకు గురించి ఆయనన్న మాటలు తలుచు కుంటూ పాలగిన్నె ముందు అలాగే నిలు చుండి పోయిన అరుంధతి "అమ్మా" అన్న పిలుపుతో యీ లోకంలోకి వచ్చి ఎదురుగా చూసింది.

సంజయ్ చిరునవ్వుతో నిలబడి వున్నాడు.

"అదేమిటమ్మా, అలా వుండిపోయావు. సమాధి స్థితిలోలాగ నేను వచ్చిన అలికిడికి కూడా యిటు తిరగలేదు"

"ఒరే సంజూ, నాకు తెలియక అడుగు తాను. ఎప్పుడూ సమాధిస్థితులు, ధ్యానాలు తప్ప వేరే మాటలుండవా నీకు?" మనసు లోని విసుగును బయటకు తెలియనివ్వ కుండా అన్నది.

"అంటే మరేం మాట్లాడాలంటావు?"

"నీ వయసువాళ్ళంతా ఎలా వున్నారు? నువ్వెలా వున్నావు. ఏవయసుకా ముచ్చటని లేకుండా నీకీ ఇరవైలో అరవై ఏమిటి?"

"ఆధ్యాత్మికతకు వయసుతో పని ఏంటమ్మా. నిజానికి వైరాగ్యం మొక్కగా వున్నపుడే కలగాలి. నేనిప్పటికే ఆలస్యంగా కళ్ళు తెరిచాను. ఇప్పుడు నువ్వే వున్నావ నుకో. నీకు వైరాగ్యం ఇప్పుడు కలగమన్నా కలగదు. ఇన్నేళ్ళూ నీ సంసారం, నీ పిల్లలు అనే తాపత్రయ పడుతూ వచ్చావు. పిల్లలం దరం పెరిగి పెద్దయ్యాము. ఎవరి బ్రతు కులు వాళ్ళు బతగ్గలము. కానీ నువ్వు ఇంకా మాకోసం ఆలోచించకుండా వుండ లేవు. ఇంకా నేను స్థిరపడాలంటావు. సింధుకి మంచి భర్త రావాలంటావు. అక్క య్యల కాపురాలు బాగుపడాలంటావు. ఇవ న్నీకాక మనవలపై మమకారం. ఇక శరీరా నికి ఏవన్నా అనారోగ్యం సంభవిస్తే మళ్ళీ

ఆరోగ్యానికై తాపత్రయం. ఇలా ఈ చింతల తోనే జీవితమంతా ఖర్చయిపోయింది. ఇంక నీకు దైవం, ధ్యానం అనుకోవడానికి సమయమేది? "

ఆశ్చర్యంగా చూసింది అరుంధతి.

"అదేమిట్రా, నాకు దైవభక్తి లేదంటావా? నేనేమన్నా నాస్తికురాలినా, ఇవన్నీ చూసు కుంటూ మాత్రం నిత్యం పూజ చేసుకోవటం లేదూ? దైవాన్ని స్మరించుకోవటంలేదూ? "

"పూజ చేస్తున్నావు నిజమే. ఆ పూజలు దేనికి? నీ పూజలన్నీ నీ కుటుంబం కోస మేగా. వెంకటేశ్వర సుప్రభాతం చదువు తూనే స్టవ్‌పై పాలు పొంగిపోతున్నాయనీ, సింధూకి వీధిలోని కూరల బండివాడి దగ్గర కూరలేమేం తీసుకోవాలో చెపుతూ అరుస్తుం టావు. ఏమిటి దానివలన ప్రయోజనం? ఇక దైవాన్ని స్మరించటం మాత్రం దేనికి? మేం పరీక్షలు పాసుకావాలనో, జ్వరాలొస్తే నయం చెయ్యమనో, నాన్న ఆఫీసునుంచి రావడం ఆలస్యం అయితే క్షేమంగా ఇల్లు చేరాలనో ఇలా ఈ కోరికలకేగా నువు తలు చుకోవడం. నువ్వే కాదమ్మా. లోకంలో పూజలు చేస్తున్నామని చెప్పే అందరూ ఇంతే. ఆత్మ సాక్షాత్కారానికి కావలసింది ఈ పూజలు కాదమ్మా" కొడుకు మాటలకి తెల్లబోతూ నిల్చోవడంతప్ప నోరు విప్పి మరేం మాట్లాడలేకపోయింది అరుంధతి.

"క్షమించమ్మా, ఏదేదో మాట్లాడి నీ మనసు కష్టపెట్టినట్లున్నాను" తల్లితో అలా మాట్లాడినందుకు బాధవేసి అక్కడ్నుంచి వెళ్లిపోయాడు సంజయ్.

★ ★ ★

సంధ్యాసమయం.

అరవింద్, సింధూర ఎప్పుడూ కలుసు కునే చోట పార్కులో ఓ మూలగా ఎవరూ కనిపించని చోట కూర్చున్నారు.

"పరీక్షలు వస్తున్నాయి. కాస్త శ్రద్ధగా చదువుదామంటే మీరు చదవనివ్వరుకదా" సింధూర నేరారోపణ చేస్తున్నదానిలా అన్నది.

"ఇది మరీ బావుంది. నువ్వు చదువు తూంటే నేను అడ్డొచ్చానా? ఎప్పుడు? " తెల్ల బోతూ అడిగాడు అరవింద్.

"ఎప్పుడుట? ఏం తెలియనట్లు. ఎప్పుడూ అడ్డమే. అసలు మీ క్లాసు వస్తే చాలు కళ్ళు కళ్ళు కలిపేస్తారు. ఇక నేను ఒంటరిగా కూచుంటే చాలు మీ కళ్ళే వెంటాడుతాయి. ఆ మూగ భాషలే ఏవేవో కలల్ని రేపుతాయి. ఆపై ఇక ఒకటే కలవరింత. అరవింద్ అన్న అక్షరాలు తప్ప మరేం కని పించవు పుస్తకాలలో. నేనేం చేసేది చెప్పండి" బుంగమూతితో అడిగింది సింధూర. ఆ మాటలకి సంతోషంతో ఛాతి విప్పారిన అతను ఆపై ఇక ఆగలేనట్లు సింధూర వారించే లోపులో ఆమెని దగ్గరకు లాక్కుని ఎర్రని పెదవులపై ముద్ర వేసేయ బోయాడు.

కానీ చేతికందింది నోటికందనట్లు చప్పున అతని ముఖాన్ని దూరంగా నెట్టేసింది సింధూర.

అతని బలమైన బాహువుల మధ్యనుంచి విడివడాలని చూసిందికానీ వీలుకాలేదు. ఆమెనలాగే చేతులమధ్య చుట్టేసే అడి గాడు.

"ఇంతగా మాటలతో కవ్విస్తావు. ఓ చిన్న ముద్దిస్తే ఏం పోతుంది? "

"నామీద నాకున్న నమ్మకం పోతుంది" అన్నది సింధూర.

అంత దగ్గరగా అతని హృదయానికి హత్తుకుని అలా ఉండటం ఆ వెచ్చని స్పర్శకు తనకుతాను నిలవరించుకోలేన ట్లుంది ఆమెకు.

"ప్లీజ్, అరవింద్" దీనంగా చూసింది.

"ఓకే" చేతులు వదిలేసాడు అరవింద్.

"నీకై నువ్వే వచ్చి పెదవులు కలిపే వరకు ఇకపై నేను నిన్నేమి అడగను" చిరు కోపంతో అన్నాడు.

నవ్వొచ్చింది సింధూరకు.

"మన పెళ్ళయిన తర్వాత కూడా మొట్ట మొదటగా నా అంతట నేను దగ్గరకు వస్తే తప్ప నువ్వు దగ్గరకు రావా?" అడిగింది.

"అంటే పెళ్ళి అయిపోయినా కూడా నువ్విలాగే... మహాప్రభో ఇదెక్కడి ప్రేయసిరా బాబోయ్" కూర్చున్న వాడల్లా పచ్చికపై వెనక్కి వాలిపోయాడు అరవింద్.

"చాల్లే వేషాలు కానీ, నేనివాళ నీకు ఓ శుభవార్త చెపుదామనుకుంటూ వచ్చాను"

టక్కున లేచి కూర్చుంటూ అడిగాడు, "ఏమిటి మన పెళ్ళికి సంబంధించిందా?"

"నా పరీక్షలైనదాకా ఆమాటే ఎత్తవద్దన్నానా?"

"మరింకేం శుభవార్త?"

"మీకది తప్ప మరేం శుభవార్తకాదా? మా ఎదురింటివాళ్ళు ఇల్లు అమ్మేస్తున్నారు"

"మీ ఎదురింటివాళ్ళు ఇల్లు అమ్మేయటం నాకు శుభవార్తా? ఎలా కనిపిస్తున్నాను నేను నీ కంటికి. ఎవరైనా ఇల్లు వాకిళ్ళు అమ్ముకోవటం విని ఆనందించే కుళ్ళు వెధవననుకుంటున్నావా?"

"అబ్బ, నన్ను పూర్తిగా చెప్పనివ్వరా? ఇలాగయితే నేనేం చెప్పను" అలుకగా పుస్తకాలందుకోబోయింది సింధూర వెళ్ళేందుకై.

"వద్దు... అంతలోకే అలగకు అపరసత్యలా, ఇంతకీ మీ ఎదురింటివాళ్ళు ఇల్లు అమ్మేస్తున్నారు. ఆ, అయితే?"

"ఆ ఇల్లు మీరు కొనుక్కోండి"

"ఏమిటీ?"

"అవును... అప్పుడెప్పుడో ఓసారి అన్నారుకదా. ఈ హోటల్ తిండి పడదునాకు. స్వయంపాకం తినలేక పోతున్నాను. ఊరి నుండి నానమ్మను వచ్చి వుండమంటే ఆ అద్దెకొంపల్లో నేనుండలేనురా అన్నదనీను. ఎక్కడైనా మంచి ఇల్లుంటే చూసి కొనుక్కుని నానమ్మని తీసుకొచ్చేస్తాను. పూర్ణించి అనలేదూ?"

"ఆ, గుర్తొచ్చింది అన్నాను. నిజమే బాగానే వుంటుంది. కానీ ఆ అయిడియా నాదికదా, నానమ్మ ఒప్పుకుంటుందో లేదో?"

"ఏమిటండీ మరీ ఆలోచిస్తారూ, ఎటూ ఇక్కడే వుండి పోవాలనుకుంటున్నారుగా. ఇల్లు ఎప్పుడైనా కొనాల్సిందేగా. చక్కని కొత్త మేడ. వాళ్ళేదో అవసరం వచ్చి అమ్మేస్తున్నారు. మంచి అవకాశం. ఇక మీ ఇష్టం."

"నా యిష్టం ఏమిటి? ఆ ఇల్లు ఎలా గున్నా కొనాల్సిందే. ఎందుకంటే ఎదురింట్లో నువ్వుంటావు కాబట్టి. నానమ్మను ఒప్పించడం ఎంతపనిలే. ఇంటి విషయం వివరాలన్నీ చెప్పి, ఆ ఏదో అన్నానులే మనం కొనద్దు అన్నానంటే ఆరునూరైనా కొని తీరుతుంది" తేలిగ్గా నవ్వుతూ అన్నాడు అరవింద్.

"అయితే ఇకనేం ఆ యిల్లు మీరు కొనేసినట్లే. ఆ ఇప్పుడు చెప్పండి నానమ్మకి ఏమేం ఇష్టమో, ఏమేం అయిష్టమో. ఎలా వుంటే నచ్చుతుందో?" ఉత్సాహంగా అడిగింది సింధూర.

"అమ్మదొంగా. పెద్ద ప్లానే వేసినట్లున్నావు" ఆశ్చర్యపోయాడు అరవింద్.

నవ్వేసింది సింధూర.

★ ★ ★

ఉదయం పదిగంటలదాకా అరుంధతికి పనితో హడావుడిగా వుంటుంది. ఆనందరావు, సింధూర పొద్దున టిఫిన్ తినేసి




బాక్సుల్లో లంచ్ పట్టుకెళతారు. సంజయ్ పదిగంటలకి భోంచేస్తే ఇక మళ్ళీ రాత్రికే భోజనం. ఇంట్లో వుండేది తాము నలుగురే అయినా పదిమంది వున్నట్లు హడావుడి పడిపోతూంటూందామె.

ఆ పని తొందరలో సింధూరకు, ఆనంద రావుకీ లంచ్ బాక్సు సిద్ధం చేస్తుండగా వచ్చింది మంజుల ఏడాది కూతురుతో

"అరె, మంజూ ఎలా వచ్చావే. ఆటో శబ్ద మన్నా వినిపించలేదు?" సంబరంగా రెండో కూతురికి ఎదురువెళ్ళి పాపాయి నందు కుంది అరుంధతి.

"నేను ఎక్కి వచ్చిన ఆటో శబ్దం ఎందుకు వినిపిస్తుంది? అదే అంజలి వచ్చి వుంటే ఈ వరకు అందరూ గేటు దగ్గరే ఎదుర య్యేవాళ్లు" తనతో తెచ్చిన బ్రీఫ్‌కేసు దభీమని కింద పెట్టూ అన్నది మంజుల గట్టిగా.

"ఎందుకమ్మా వస్తూనే నిష్టూరాలూ? అల్లుడుగారు బాగున్నారా?" ఆనందరావు షర్టు వేసుకుంటున్న వాడల్లా అలాగే బటన్స్ పెట్టుకుంటూ వచ్చారు.

"నువ్వొచ్చేముందే నిష్టూరం వచ్చిందే చిన్నక్కయ్యా. దాన్ని పలకరించి నీ వెనుకే అక్కయ్య వస్తున్నదా? అని అడుగుతుం డగా ఇంతలో నువ్వొచ్చావు" తమాషాగా అంటూ సింధూర కూడా వచ్చింది.

"అంటే నా ముందు నిష్టురం వస్తుం దనా? చూశావామ్మా దీని పొగరు?" చెల్లెలి మీద గయ్యిమంది.

"లేకపోతే ఏమిటి, ఏదో పొద్దున్నే బయ టకు వెళ్ళే తొందరలో ఆటో చప్పుడు విన లేదు. నువ్వు లోపలికి రావడం చూడలేదు. దానికి రాగానే ఇంత గొడవ చేస్తావా?"

తల్లి చేతుల్లోంచి పాపనందుకుంటూ అన్నది సింధూర.

"బాగానే సమర్థించుకుంటారులే. అమ్మా ముందు పాపకి కాస్త పాలు కలిపిచ్చెయ్యి" అనేసి కాళ్ళు చేతులు కడుక్కునేందుకు పెర ట్లోకి వెళ్ళిపోయింది మంజుల.

"అబ్బబ్బ, గాలి దుమారమే. ఇన్నేళ్ళొ చ్చాయి. కానీ దీని స్వభావంలో మాత్రం ఏమార్పు రాలేదు" చిన్నగా అనుకుంటూ మనవరాలికి పాలు కలిపేందుకు వంటిం ట్లోకి నడిచింది అరుంధతి.

"అమ్మా, ఇప్పుడు చిన్నక్కయ్య ఎందుకొ చ్చిందో నాకు తెలుసు" వెనుకే వచ్చి నవ్వుతూ గుసగుసగా అన్నది సింధూర.

"నాకూ తెలుసులే. అయినా అక్క య్యల్నేమీ అనక్కరలేదు. రేపు పెళ్ళయితే నువ్వూ వస్తావు పోటీకి"

తల్లిమాటలకి తల అడ్డంగా వూపింది సింధూర.

"నేనా, నెవ్వర్. పెళ్ళంటూ జరగ్గానే పుట్టి ల్లంటే ఏదో మనం డబ్బు దాచిన బేంక్‌లా భావించి ఇక్కడ్నుంచి అందినంతవరకు రాబట్టుకోవాలని ఆలోచించే వారంటే నాక సహ్యం. పెద్ద బావగారిలా నాక్కాబోయే మొగుడేమీ పీడించడు. ఇక చిన్నక్క య్యలా నేనేమీ మీ దగ్గర్నుంచిలా ఆశిం చను" అని తనలోతనే అనుకుంటూ, అర వింద్‌తో తన వైవాహిక జీవితాన్ని మధు రంగా వూహించుకుంటూ, కలల్లో తేలి పోతూ కాలేజికి బయలుదేరింది సింధూర.

★ ★ ★

ఇంట్లో అందరూ బయటికెళ్ళిపోయాక స్నానమూ, భోజనమూ చేసి పాపను నిద్ర పుచ్చుతూ తల్లి దగ్గర చేరి నెమ్మదిగా విష యంలో కొచ్చింది మంజుల. "అమ్మా మొన్న అంజుకి మీరు డబ్బిచ్చిన సంగతి మా వారికి తెలిసింది"

అంజలి, మంజుల ఇద్దరూ వుండేది విజ యవాడలోనే. పదిరోజులకోసారన్నా ఒక

ర్నొకరు కలుసుకుంటూనే వుంటారు. ఎవరు ఇక్కడ్నుంచి పూచికపుల్ల తీసుకువెళ్ళినా రెండో వాళ్ళకి వెంటనే తెలిసిపోతుంది. ముందుగా మంజుకి ఏదన్నా యిచ్చారంటే అంజలివాళ్ళ అత్తగారు ఒప్పుకోరు. వెంటనే కోడల్ని పుట్టింటికి పంపుతుంది. లేదు అంజలికేదన్నా ఇచ్చారని తెలుసుకుంటే మంజుల వెంటనే తనే బయలుదేరి పుట్టింటికి వచ్చేస్తుంది. ఇది వాళ్ళిద్దరి పెళ్ళయిన దగ్గర్నుంచి జరుగుతున్నదే.

నిజానికి మంజులది ముచ్చటైన సంసారం. స్వంత ఇల్లు. భర్తకి మంచి ఉద్యోగం, ఏ బాదరబందీ లేని జీవితం. మామగారు లేరు. అత్తగారు దగ్గరే వుంటుందికానీ ఆడపిల్లలు లేని ఆమె మంజులను కన్నకూతురిలానే చూసుకుంటుంది. భర్తగానీ, అత్తగారుకానీ ఎప్పుడూ మంజులను పుట్టింటినుంచి అవీ ఇవీ తెమ్మని వేధించరు. కానీ మంజులకి అక్కకెంత యిస్తే తనకూ అంత రావాలన్న పంతం. చిన్నప్పట్నుంచీ అన్నిటా పోటీ మంజులకి. మంజు మనస్తత్వం అరుంధతికీ, ఆనందరావుకీ తెలుసు. మంజుల ఏద డిగినా అది స్వయంగా ఆమె అడిగినదేననీ భర్త అడిగాడనో, అత్తగారు నసుగుతున్నారనో తమకు వూరికే చెప్తుందనీను.

కానీ, ఏం చేయగలరు. మవునంగా తమ శక్త్యానుసారం తమ పిల్లలకి ఏలోటూ లేకుండా చూడాలనే అనుకుంటారెప్పుడూ.

"ఏమిటమ్మా ఆ,వూ, అనవు? "

పరధ్యానంగా వున్న అరుంధతి మంజుల స్వరం విని కూతురివైపు తిరిగింది.

"ఏమిటి? "

"అంజుకి పదిహేను వేలిచ్చారటగా? "

"మేమేమీ వూరికే ఇవ్వలేదే. అప్పుగా అని అడిగితే సింధు పెళ్ళికని దాచిన దాంట్లోంచి తీసిచ్చారు మీనాన్న"

మెల్లగా చెప్పింది అరుంధతి.

"వడ్డీ కూడా తీసుకుంటున్నారా? " వ్యంగ్యంగా అడిగింది మంజు.

"అదేమిటే మంజూ, అలా మాట్లాడతావు. కన్నబిడ్డల దగ్గర వడ్డీ ఏమిటి? "

"అప్పివ్వగా లేనిది వడ్డీ పుచ్చుకుంటే మాత్రం తప్పేమిటి? లేకపోతే తిరిగి రాని అప్పుకి వడ్డీ అనుకుని మాత్రం ఏంలాభంలే దనుకుని వుంటారు"

అరుంధతి ఏం మాట్లాడలేదు.

"చూడమ్మా మీరు అక్కకి అప్పుగా యిచ్చారనటం, అది మళ్ళీ మీకు తిరిగిస్తుందనటం ఇవన్నీ వట్టిమాటలని నాకు తెలుసు. తనకిచ్చారని నేనేదో పోటీ కొచ్చి మరో పదిహేను వేలడుగుతున్నారనుకుంటారేమో. నాకేమీ అంత లావు మొత్తాలు అక్కర్లేదు. దానిలా తల్లీదండ్రిని ఇలా వేలకి వేలు ఇవ్వమంటూ పీడించి నేను బాగుపడాలని కోరుకునేదాన్నికాదు"

మంజు మాటలకి లోలోన ఆశ్చర్యపోయింది అరుంధతి. ఏమిటి తన కూతురేనా అలా మాట్లాడేది అని. ఇంత మంచి బుద్ధి ఎలా వచ్చిందనీను.

"కానీ ఆమె ఆశ్చర్యం, కలవరమై తెల్లబోవటానికెంతో సేపు పట్టలేదు.

"మా ఆయనకి సినిమాల పిచ్చిలేదు నీకు తెలుసుకదా. నాకేమో కొత్త సినిమాలు చూడాలనుంటుంది. టీవీలో చూద్దామంటే మాకేబుల్ వాడు పాత సినిమాలే అస్తమానం మార్చి మార్చి వేస్తుంటాడు. మా వీధిలో అందరికీ వీసీఆర్ లున్నాయి. మనమూ వీసీఆర్ కొందామండి. చక్కగా మనకు కావలసిన సినిమాలు అవీ చూడొచ్చు అంటే ఆయన ఇప్పుడు నావల్ల కాదు. ఏం మీ అక్కయ్యా అడగ్గానే అంత డబ్బిచ్చారు. నీకు ఓ వీసిపి అన్నా కొని వ్వరా? వెళ్ళి అడుగు. అని పంపించా

రమ్మా? ”

“హమ్మనా తల్లీ, ఇంత తెలివిగా మాట్లాడడం ఎలా అలవడిందీ నీకు? ” అనుకోకుండా వుండలేకపోయింది అరుంధతి.

తల్లి తన కోరిక విని కూడా అవుననో కాదనో అనకుండా అలా కామ్‌గా వుండిపోవటం ఏంనచ్చలేదు మంజులకి.

“అవునులే... నేనో పిచ్చిమొద్దును. మీకు నా మీదకూడా ఏదో ప్రేమ వున్నట్లు, ఈ ఇంటిలో నా మాటకూ విలువ వున్నట్లు రావటం నాదే బుద్ధి పొరపాటు. చిన్నపుడు ఏది అడిగినా ఎలా కొనిచ్చేవారు? ఇప్పుడు నాకు పెళ్ళయిపోయిందనే కదా వేరైపోయాను. మూడు ముళ్ళు వేయించేస్తే చాలు మా బాధ్యత తీరిపోయిందనుకుంటారు. అంతేనా? పెళ్ళయి పోతే పరాయి వారమయిపోతామా? ఇక అమ్మా నాన్నను ఏమీ అడక్కూడదు కాబోలు. ఈ ఇంట్లోంచి పంపేసినంత మాత్రాన కన్నవారి ప్రేమకూ నోచుకోకుండా పోవాలా? ”

రాని కన్నీటిని తుడుచుకుంది మంజుల.

“కన్నవారి ప్రేమకూ, ఖరీదైన కోరికలకూ ముడిపెడితే ఎలానే తల్లీ? ” అని అందామనుకుందికానీ, ఆమాట పైకంటే కూతురి నుంచి మరిన్ని నిష్టురాలు వినాల్సివస్తుందేమోనని ఆ మాటలను పెదవులు దాటనివ్వలేదు అరుంధతి.

అయినా ఇక తాము ఏమనేందుకూ వీల్లేకుండా మంజు కన్నీరు కూడా తుడుచుకోవటం చూసి మరింకేం చెప్పి లాభం వుండదనుకుని, “నాన్నగారు రానీమ్మా, చెప్పి చూస్తాను” అంది. తల్లి ఆమాట అంటే చాలు ఇక తనకా వస్తువు వచ్చేసినట్లే అని తెలుసు మంజుకి.

అందుకే నిశ్చింతగా పాపాయి వైపు తిరిగి, “నేనో అరగంట పడుకుంటానమ్మా” అనేసి కనులు మూసుకుంది. అరుంధతి కూడా నిట్టూరుస్తూ మరోవైపు తిరిగి నిద్ర పోవాలనుకుంది కానీ మూసుకున్న కనురెప్పల వెనుకకు నిద్రాదేవి మాత్రం రావటం లేదు.

“ఏమిటీ పిల్లలు? తల్లితండ్రుల కష్టసుఖాలనెందుకు ఆలోచించరు? పెళ్లి అయి వాళ్ల సంసారమంటూ ఏర్పడితే చాలు ఇక తామొక్కరూ బాగుంటే చాలు మిగిలిన వారు ఎలాపోయినా పర్వాలేదు అనుకుంటారా? పెళ్లయి ఒకదారి చూసుకున్న పిల్లలు ఇలా వున్నారు. ఇంకా పెళ్లి కావాల్సిన పిల్ల ఒకతుంది దాని సంగతేమిటి? అయినా ఆడపిల్లలు చూస్తే ఇలాగ, మగపిల్లాడు చూస్తే అలాగు, సర్వేశ్వరా ఈ సంసారాన్ని నువ్వే కాపాడాలి”

అలా సాగిపోతున్న ఆలోచనల్తో ఆ పూటకిక నిద్రపట్టదని తెలిపోవటంతో లేచి వంటింట్లోకి నడిచింది గోధుమలన్నా బాగు చేసుకోవచ్చని.



ఎలాగయితేం మంజుల తన కోరిక తీర్చుకుని మరీ వూరికి వెళ్లిపోయింది.

రెండో కూతుర్ని అలా పంపించి తీరిగ్గా పడక్కుర్చీలో కూర్చుని ఏవో నాటకాలు చదువుకుంటున్న ఆనందరావుపై సాధింపు మొదలెట్టింది అరుంధతి.

"తిత్తికాసులు తిరునాళ్లకే చెల్లన్నట్లు తమరు చిన్నకూతురి పెళ్లికని దాచింది పెద్దకూతుళ్ల గొంతెమ్మ కోర్కెలకే సరిపోతే ఇక చిన్నదాని పెళ్లెలా చేస్తారు? "

"ఇది మరీ బాగుంది. అప్పటికి వాళ్లు నాకు మాత్రమే కూతుళ్లయినట్లు నీకేమి కాదన్నట్లు నా మీద విరుచుకు పడతావేం. నువ్వుకాదూ వాళ్లలా దిగి ఏదైనా అడగ్గానే నాకు వూపిరి కూడా తిరగనివ్వకుండా చేసి వాళ్లు అడిగిన దానికల్లా తలవూపేలా చేసేది. మళ్లీ ఇదంతా నీకేమి సంబంధం లేనట్లు నేనేదో దారిన పోయేవాళ్లెవరికో డబ్బంతా ధారపోసినట్లు మాట్లాడతావేం? "

"అవును నేను తల్లిని కాబట్టి, వాళ్లు ముందు నా దగ్గరకే వచ్చి అడుగుతారు



కాబట్టి ఏదో కాదనలేక మీతో వచ్చి చెప్తాను. నేను చెప్పి చెప్పగానే మీరు సరే నని తలవూపేస్తే ఎలా? ఇలా అడుగు తూంటే ఎలాగ వెనుక మీ చెల్లెలు వుంది కదా! దాని సంగతీ చూడాలికదా అని ఏదో విధంగా నచ్చచెప్పి పంపాలిగానీ..."

"అంటే అప్పటికి అమ్మాయిలు వచ్చి అడ గ్గానే నువ్వేమో సరేనంటూ భారమంతా నాపైన వేస్తావు? నేనేమో వీలుకాదనీ చెప్పాలి. అంటే ఏమిటి నీవుద్దేశం? నువ్వేమో పిల్లల దగ్గర మంచి అనిపించుకో వాలి. నేను మాత్రం కర్కోటకుడిగా మిగిలి పోవాలా? అయినా వెనుక యింకో పిల్ల వుందనీ నువ్వు మాత్రం ఆలోచించలేవా?" నిలదీశారాయన.

"అబ్బబ్బ! ఏమిటమ్మా ఎప్పుడో జరగ బోయే నా పెళ్లి గురించి యిప్పట్నుంచీ ఎందుకు గొడవ?" అక్కడే కూర్చుని చదు వుకుంటున్న సింధూర కాస్తా చిరాగ్గా వారి స్తున్నట్లుగా అంది.

అరుంధతి, ఆనందరావు ఇద్దరూ కూడా ఒకరి ముఖం వంక ఒకరు కోపంగా చూసు కుని కామ్‌గా వుండిపోయారు.

కొద్దిసేపుండి అప్పుడే గుర్తుకు వచ్చినట్లు చెప్పారు ఆనందరావు.

"అన్నట్లు చెప్పడం మర్చేపోయాను. సాయంత్రం మనింటికో అతిథి వస్తున్నారు" ఆయన ముఖంలో చిరునవ్వు.

"ఎవరు?"

"ప్రమద్వర!"

"ఏమిటీ ప్రేమజ్వరమా?" అరుంధతికి సరిగా వినిపించక తెల్లబోతూ అడిగింది.

పకపకా నవ్వింది సింధూర. "ప్రేమ జ్వరం కాదు అమ్మా! ప్రమద్వరట"

"అదేం పేరు? ఇంకేం పేర్లులేనట్లు"

"పురాణాలు చదువుతుంటావుకదా ప్రమ ద్వర అన్న పేరు వినలేదూ! రురుడి భార్య ప్రమద్వర. సర్లే ఆ కథగానీ ఆ పేరులోని అందంగానీ నాకర్థంకావుగానీ ఆవిడ ఈవేళ మనింటికొస్తారు. ఏ గుడికో అని నువ్వు బయటికెళ్లిపోకు. అందుకే చెపుతున్నాను"

"అలాగేలెండి. మీకు స్నేహితులు, చుట్టా లకేం తక్కువ?" అరుంధతి గొణుక్కుంటూ లోపలికెళ్లిపోయింది.



ఆరోజు సాయంత్రం అన్నట్లుగానే ప్రమ ద్వర వచ్చింది. వయసు ముప్ఫయి అయిదు నలభై మధ్య వున్నా చూసేందుకు పాతికేళ్లన్నట్లు కనపడటం ఆమె ప్రత్యేకత.

సన్నగా కత్తిరించుకున్న కనుబొమలు, లైట్‌గా లిప్‌స్టిక్ వేసుకున్న పెదవులతో ఆక ర్షణీయంగా వుందామె ముఖం. వత్తుగా వున్న జుట్టు యు షేప్‌లో కత్తిరించుకుని పోనీ టెయిల్ కట్టుకుంది. పొందిగ్గా అమ రిన ప్రింటెడ్ కాటన్ చీర, దానికి మాచ్ అయి స్లీవ్‌లెస్ బ్లౌజులోంచి పచ్చని ఆమె భుజాలు నున్నగా మెరుస్తూ శరీర వన్నెను తెలియజేస్తున్నాయి.

చూపరులకు అందంగా ఆధునికంగా కని పిస్తుందామె.

"చేసుకున్న అలంకరణ ఆమెకి సరిగా నప్పింది. అందుకే కాబోలు అందం మరింత యినుమడించింది" అని సింధూర అనుకుంటే,

"ఎవరీ వన్నెల విసనకర్ర. ఈయనగారి కెలా పరిచయం అయిందో? " అనుకుంది అరుంధతి.

ఆనందరావుకయితే ప్రమద్వర తన యింటికి రావటం ఏ దేశాధినేతో వచ్చిన ట్లుగా వుంది. ముఖంలో సంతోషం దాచినా దాగడంలేదు.

"అరుంధతీ ఈమె ఎవరో తెలుసా? " పరి చయం చేయబోతూ చిన్నపిల్లాడిలా అడి గారు.

తెలియదని తలాడించింది అరుంధతి.

"మూర్తీభవించిన కళాస్వరూపం అనుకో. మొన్న జరిగిన నాటక పరిషత్తుల్లో ఈమెకు ఉత్తమనటి బహుమతి వచ్చింది. ఓహ్! అది నటనా? నాకయితే కళ్లముందు కదిలే జీవితాన్ని నేనేదో వేరే లోకంనుండి చూస్తున్న అనుభూతి కలిగిందనుకో"

ఆయన మాటలకి అరుంధతి యిబ్బం దిగా నవ్వితే ప్రమద్వర మొహమాటంగా నవ్వింది.

"మరీ పొగిడేస్తున్నారు నన్ను" ప్రమద్వర వారించింది.

"ఉన్నమాట అంటే అది పొగడ్తెలా అవు తుంది? "

ఈసారి సిగ్గుగా నవ్వింది ప్రమద్వర.

వారిద్దరూ మరికాసేపటికి తమదైన ప్రపంచం అంటే నాటకరంగం కబుర్లలో పడిపోయారు.

సింధూరకు యింట్రస్టు లేకపోవటంతో కొద్దిసేపు బలవంతంగా అక్కడ కూర్చున్నా నెమ్మదిగా లేచి తన గదిలోకి వెళ్లిపో యింది. అరుంధతి కూడా మంచినీళ్లు, టీ, టిఫిన్ అన్నీ అందించిన తర్వాత వంటిం ట్లోకి వచ్చేసింది ఏదో పనివున్నట్లు. ఆవిడ కెందుకో ప్రమద్వర నచ్చలేదు.

"జీవితంలో ముప్పాతిక వంతు గడిచేపో యింది. నాటకాలంటే ఆసక్తి చూపెడతార నుకున్నానేకానీ యింత నాటకాలపిచ్చి వుందన్నమాట. ఈ వయసులో ఈయన కిదేం బుద్ధి. ఇంత బతుకూ బతికి ఇంటివె నకాల ఏదో అయినట్లు ఇప్పుడెళ్లి రంగస్థల సేవ చేస్తారుకాబోలు. చేయనీ, చేయనీ, మహామహా వాళ్లే రంగు పిచ్చిలోపడి వెనక్కి తిరిగి వచ్చారు తెల్లముఖం వేసుకుని" కోపంగా అనుకుంది.

కొద్దిసేపటి తర్వాత అరుంధతీ అన్న ఆనందరావు కేక విని హాల్లోకి వచ్చింది.

ప్రమద్వర వెళ్లబోతున్నట్లుంది. "వెళ్లొస్తా నండీ. నమస్తే" అన్నది అరుంధతితో.

"నమస్తే...", ముక్తసరిగా అన్నది అరుం ధతి. ప్రమద్వర నటి అవడమే ఆవిడ అయి ష్టతకు కారణమైంది.

ఆనందరావు వీధికొసదాకా వెళ్లి ఆమెను ఆటో ఎక్కించి మరీ వచ్చాడు.

"హూ! జుట్టు నెరుస్తున్నా ఈ మగవా ళ్లకి ఆడది కనిపిస్తే చాలు ఒళ్లు తెలియదు" అనుకుంది అరుంధతి.

ఆనందరావు ఇంట్లోకి రావటం రావటం అంతవరకు దాచుకున్న కోపాన్ని వెళ్లగ క్కాడు.

"ఎంతగానో పిలిస్తే తప్ప ఆవిడ మనిం టికి వచ్చేందుకు సరే అనలేదు. అలాంటిది ఆవిడవస్తే ఏదో మొక్కుబడిగా అన్నట్లు ఓసారి పలకరించేసి అందరూ ఎవరిదారిన వాళ్లు వెళ్లిపోతారా? ఏమనుకుంటుం దామె? "

"ఆ ఏమనుకుంటుందిలే. ఇంటిల్లిపాదీ వంతు మీరే మాట్లాడి, మర్యాదలు చేశారుగా? " వేళాకోళం ధ్వనించింది అరుంధతి గొంతులో.

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం? " ఈసారి ఆయన స్వరం మరింత హెచ్చింది.

ఈ గొడవకు తన గదిలోనుంచి సింధూర హాల్లోకి వచ్చింది. తల్లీతండ్రి అలా గొడవ పడటం చూసి సింధూరకు ఎంతో ఆశ్చర్యం వేసింది. ఎవరో సరిగా తెలియని మూడో మనిషికోసం వీరిద్దరూ గొడవ పడటం ఏమిటి?

అసలు తండ్రి ధోరణి ఆమెకూ కాస్త వింతగానే తోచింది. ఎన్నడూ లేనిది ఎవరో రంగస్థల నటిని ఇంటికి టీకి పిలవడమేమిటి? ఆమె కారణంగా తల్లిపై కోప్పడడం ఏమిటి? మామూలుగా ఆ ఇంట్లో అరుంధతి స్వరమే కానీ ఆనందరావు గొంతు అంతగా వినిపించదు. పొద్దునే లేచింది మొదలు ఒక రొటీన్‌గా వుంటుంది ఆయన దినచర్య.

ఊరికే కోప్పడడం, అరవటం ఆయన స్వభావానికే విరుద్ధం. అలాంటిది అంత పెద్దగా అరుస్తూ మాట్లాడటం ఏమిటి? అనుకుంది.

ఆయన కోపాన్ని చూసి అరుంధతి కూడా ఓ క్షణం ఆశ్చర్యపోయింది. "ఈయన తానెరిగిన మనిషేనా? " అనిపించిందామెకు.

"ఇప్పుడేమయిందని అంతలా అరుస్తున్నారు? " అడిగింది.

"ఏమిటి నాన్నా మీరు కూడా! ఆవిడెవర్ని గురించో పోట్లాట? " సింధూర నచ్చచెపుతున్నట్లుగా అంది.

ఆయన చివుక్కున కూతురివైపు చూశారు. పరిశీలించి చూడగలిగితే ఆయన కళ్లలో బాధ కనిపించి వుండేది.

"వీరికోసమేనా తానిన్నాళ్లూ శ్రమించింది. తన మనసూ, తన ఇష్టాలు వీళ్లకేం పట్టవా? "

ఆ భావం మదిలోకి రాగానే ఆనందరావు ఇక ఏం మాట్లాడకుండా చకచకా అక్కడ్నుంచి వెళ్లిపోయాడు.

★ ★ ★

ఇద్దరక్కయ్యలకూ పెళ్లయినప్పట్నుంచీ ప్రతి సంవత్సరం దసరా సెలవులకి సింధూర విజయవాడ వెళ్లటం అలవాటయింది. కనకదుర్గ గుడి అన్నా, ఆ పరిసరాలన్నా సింధూరకు ఎంతో ఇష్టం. పెద్దక్కయ్య దగ్గర సగం రోజులు, చిన్నక్కయ్య దగ్గర సగం రోజులు వుండి సెలవులన్నీ వాళ్ల పిల్లలతో సరదాగా గడిపివస్తుంది.

ఈ సంవత్సరమూ అలాగే వెళ్లి సెలవులయి మళ్లీ వచ్చేసరికి తమ ఎదురిల్లు కొత్తగా వేసిన రంగులతో కళకళలాడుతూ కనిపించింది.

ఇంటిముందు ఆటో దిగి వస్తుంటే ఎదురింటి గేటు దగ్గర కూరలబండి వాడి ధగ్గర కూరగాయలు తీసుకుంటూ కనిపించిందో పెద్దావిడ. అరవింద్ నాన్నమ్మ కాబోలనుకుంది. ఇంట్లోకి వచ్చీరావటంతోనే తల్లి అక్కయ్యల గురించీ, పిల్లల గురించీ ఏదో అడుగుతున్నా చెప్పకుండా కుతూహలంగా అడిగింది.

"అమ్మా మన ఎదురిల్లు ఎవరైనా కొనుక్కున్నారా? "

"ఆ మీ కాలేజి లెక్చరరేనటగా పేరు... ఆ అరవింద్ అట. వాళ్లు కొన్నారు"

సంతోషంతో సింధూర ముఖం వెలిగిపోయింది. కానీ తన సంతోషం తల్లి కంటపడకుండా మామూలుగా అడిగినట్లు అడిగింది.

"ఓ అరవింద్ మాష్టారా? " అని ఏమీ

తెలియనట్లు.

"ఎవరెవరు వుంటారమ్మా వాళ్లింట్లో?" అని అడిగింది.

"అతనూ అతని నానమ్మ మాత్రమే వుంటారుట. అతనికి చిన్నతనంలోనే తల్లీ తండ్రీ అంటే ఈ ముసలావిడ కొడుకూ కోడలు చనిపోతే ఇక అన్నీ ఈవిడే అయి ఈ కుర్రాణ్ణి పెంచుకొచ్చిందట. బాగా ఉన్న వాళ్లలాగేవున్నారు. గ్రామంలో పొలాలు, తోటలు దండిగా వున్నట్లున్నాయి. నువ్వ సలు రెండు రోజుల ముందు రావలసింది. ఇంట్లో చేరుతూ సత్యనారాయణ వ్రతం చేయించారు. కాలనీ మొత్తాన్ని పిలిచారు. ఘనంగా చేశారు. ఆ పెద్దావిడది భారీ చేయిలా వుంది"

'ప్చ్.. రెండు రోజులముందే రావలసిం దిట. వూ! ఇంట్లోకి వచ్చింది మొదలు ఆ మహాశయుడు నాకోసం వెదుకుతూ వుండి వుంటాడు. చెప్పలేదుకదా వూరికి వెళుతు న్నట్లు విషయం తెలియక నేనేమ య్యానోనని పిచ్చెక్కిపోయి వుంటాడు' అర విండ్ ఆరాటం తెలిసిన సింధూర తనలో తాననుకుంటూ నవ్వుకుంది.

తర్వాత తల్లి విజయవాడలో అక్కల గురించి అడుగుతుంటే అన్యమనస్కంగానే జవాబిచ్చింది.

మరునాడు కాలేజీకి వెళ్లేందుకు హుషా రుగా తయారవసాగింది. రెండు జడలు వేసుకుని కట్టుకున్న ఎల్లో సిల్క్ చీరకు మేచింగ్‌గా ఓ ఎల్లోరోజ్ జడలో పెట్టు కుంది.

"అమ్మా నే వెళ్లొస్తాను" అని చెప్పి రోడ్డు పైకి రాగానే ఎదురింటి గేటు దగ్గర స్కూటర్ బయటకు తీస్తూ అరవింద్ కని పించాడు.

సింధూరను చూసి అతని కళ్లు మెరి శాయి.

"హాయ్!" అన్నాడు అటూ ఇటూ చూసి ఎవరూ గమనించకుండా.

"హలో మాష్టారూ!" నవ్వుతూ అల్లరిగా అన్నది సింధూర. స్కూటర్ వెనుక సీటు చరిచాడు కూర్చోమన్నట్లుగా కళ్లతో పిలిచి.

"ముందు ముందు ఆ సీటు ఎటూ నాదే నని నాకు తెలుసు" పక్కగా నడుస్తూ మెల్లగా అన్నది అతనికి మాత్రమే వినిపిం చేలా.

"ష్, నీలాంటి గాళ్ ఫ్రెండ్ వున్నందుకు నన్ను అనుకోవాలి!" చిన్నగా గొణుక్కుంటూ స్కూటర్ స్టార్ట్ చేసుకుని రయ్యిమని వెళ్లిపో యాడు అరవింద్.

అతను వెళ్లిన వంకే చూస్తూ అనుకుంది సింధూర.

రోజులు ఎంతలో గడవాలి. ఈ ఫైనలి యర్ అయిపోగానే పెద్దవాళ్లకి చెప్పేసి ఆ మూడుముళ్లూ వేయించేసుకుంటే ఆపై... ఓహ్ తానెంత అదృష్టవంతురాలు? కన్నెపి ల్లలందరూ కోరుకునే అన్ని మంచి లక్షణా లున్న వాడు జంట కాబోతున్నాడు తనకి"

సింధూర తీయని కలల్లో తేలిపోతూ ముందుకు సాగింది.

★ ★ ★

ఆరోజు పొద్దున్నే అనుకోకుండా ఆనంద రావు గారింట్లో ఓ సంఘటన జరిగింది.

సంజయ్ ధ్యానం చేసుకునే బల్లకెదురుగా రామకృష్ణ పరమహంస వివేకానందుల ఫొటో దగ్గరగా ఒక కాషాయపు వస్త్రం కని పించింది.

చిన్న కాగితపు పొట్లంతో ముందు అదేదో పేకెట్ కాబోలులే అనుకున్నాడు సంజయ్. కానీ కాగితంలోంచి తొంగిచూస్తున్న ఆ వస్త్రాన్ని చూస్తూ ధ్యానానికి కూర్చుంటే ఆ మరునాడు ఎంతసేపటికీ ధ్యానం కుదర లేదు. కళ్లు మూసుకున్నా అదే కనిపించసా

గింది.

దాంతో గబుక్కున లేచి వెళ్ళి వంటింట్లో పనిచేసుకుంటున్న తల్లినడిగాడు. తన గదిలో పటాలముందు ఆ పేకెట్ ఎవరుం చారని.

"నీ గదిలోనా? ఎవరు పెట్టారు. నేను కాదు. నాకు తెలిసినంతలో మీ నాన్నగారు నీ గదివేపే రారు. ఇక సింధు... సింధు కూడా ఏదైనా తెస్తే తన గదిలోనే పెట్టు కుంటుంది. కానీ నీ పటాల దగ్గరెందుకు వదుల్తుంది. అయినా సాయంత్రం అది కాలేజినుంచి వచ్చాక అడుగుతానులే. ఇంతకూ ఇప్పుడా పొట్లం ఎవరిదైతేనేం? "

కొడుకు ముఖంలో ఆందోళన గమనించి అయోమయంగా అడిగింది అరుంధతి.

"మామూలు పొట్లమే అయితే నేనూ పట్టించుకోకపోదును. కానీ అందులో కాషాయపుబట్ట వుంది"

"అయితే? !"

"కాషాయం సన్యాసుల కొరకు!"

ఆ మాట అనేసి వడివడిగా వెళ్ళిపోతున్న కొడుకు వంక అర్థం కానట్టు చూస్తుండిపోయింది అరుంధతి.

రోజూ సింధూర వచ్చే టైమ్‌కు సంజయ్ ఇంట్లో వుంటాడు. ఆ సాయంత్రం అరుంధతి ఆ విషయం సింధూరను అడుగుదామనుకున్నా అడగలేకపోయింది.

ఆ సాయంత్రం, పదేళ్లకిపైగా పక్కింట్లో కాపురం వుండి స్వంత ఇల్లు కట్టుకు వెళ్ళిపోయిన పాతస్నేహితుల కుటుంబం ఇంటికి రావడంతో కాఫీ, టిఫిన్లు అందచేయటం, వాళ్ళతో కబుర్లతోనే సరిపోయింది. వాళ్లు వెళ్లేసరికి ఎనిమిదయింది.

ఆపై వంట, భోజనాలయ్యేసరికి పదయింది. సంజయ్ ఆ సమయంలో ఇంట్లో నన్నా వుంటే గుర్తుండేదేమో. కానీ అతను రోజూ పది దాటాక వచ్చి భోంచేసి పడుకుంటాడు.

ఆరోజు నిద్ర కళ్లతోనే లేచొచ్చి తనకు భోజనం వడ్డిస్తున్న తల్లినడిగాడు ఆత్రుతగా.

"అడిగావా అమ్మా, నాన్న కానీ, సింధు గానీ పెట్టారటనా దాన్నక్కడ? "

వాళ్ళిద్దరూ అప్పటికే నిద్రపోతున్నారు.

"అరెరె, అడగలేదురా. మరిచేపొయ్యాను. మన పక్కింటిలో వుండెళ్ళిన సుశీలా ఆంటీ వాళ్లు వచ్చారు సాయంత్రం. ఆ సందట్లో వుండిపోయాను" ఆవిడ నొచ్చుకుంటూ అన్నది.

"హు! తనకు జీవన్మరణ సమస్యగా ఆ కాషాయమే కళ్ళముందు కదులుతుంటే ఈమె మరిచిపోయిందట!"

చిన్నగా నిట్టూర్చి భోజనం దగ్గరనుంచి అన్యమనస్కంగానే లేచి వెళ్ళిపోయాడు సంజయ్.

కొడుకు ధోరణేమిటో, ఎప్పటికి మారుతాడో, అని ఆలోచిస్తూనే రోజంతా ఇంటిపనితో అలసిన శరీరం కావటంతో నెమ్మదిగా నిదురలోకి జారుకుంది అరుంధతి.

★ ★ ★

మరుసటిరోజు పొద్దున్నే సింధూ స్పెషల్ క్లాసుందని ఎనిమిదింటికల్లా కాలేజీలో వుండాలని త్వరత్వరగా తయారవుతుంటే అరుంధతి వెళ్ళి అడిగింది.

"సింధూ, నువ్వుగాని అన్నయ్య గదిలో ఏదన్నా పేకెట్ పెట్టావా? "

ఏదో నోట్సు కనిపించక వెతుక్కుంటున్న సింధూర "ఏం పేకెట్? నేనెందుకు పెట్టాను? పదమ్మా నాకు కాఫీ యిచ్చెయ్యి. టిఫిన్ వద్దులే" తల్లిని టైమ్ అయిపోతోందని హడావుడి పెడుతూ అన్నది.

ఆ తర్వాత ఆనందరావుకి టిఫిన్




పెడుతూ అడిగింది.

"మీరేమన్నా సంజు గదిలో పటాల ముందు ఏదన్నా పొట్లం పెట్టారా?"

ఆయనోక్షణం దీర్ఘంగా చూశాడు భార్య వంక.

"మన పెళ్ళయి ఎన్నేళ్ళయింది?"

"ఇప్పుడా ప్రసక్తి దేనికి?"

"లేదు. ఇన్నేళ్ళలో నేనెప్పుడయినా ఏదైనా ఇంటికి తెస్తే నీ చేతికివ్వకుండా అక్కడా ఇక్కడా పెట్టే అలవాటుందా నాకు?"

"ఇప్పుడా రామాయణమంతా దేనికి? నేనేమి తేలేదు అంటే సరిపోయేదానికి?" ముచ్చటుగా విసుక్కుంది అరుంధతి.

"రామాయణం కాదూ మరి నువ్వు కొత్తగా అడుగుతుంటేనూ? అవునూ ఇంతకూ ఏముందా పొట్లంలో?"

"కాషాయ వస్త్రమట!"

"కాషాయ వస్త్రం వాడి గదిలో వుంటే వింతేమిటి? ఉండకపోతే ఆశ్చర్యపడాలి కానీ బైరాగి వాడు తప్ప మరెవరున్నారు మనింట్లో. సరే ఎవరో పెట్టారనుకో. ఇప్పుడేమిటట? అదేదో పెద్ద అంతర్జాతీయ సమస్యలా ఆరాతీస్తున్నారేమిటి?" ఆయన దోసెలు తినటం ముగించి చేయి కడుక్కుంటూ తేలిగ్గా అడిగాడు.

"అంటే ఖచ్చితంగా మనింట్లో ఎవరూ పెట్టలేదు. మరి అదెక్కడ్నుంచి వచ్చింది?" అంతవరకూ పక్కగదిలోంచి తల్లీతండ్రి సంభాషణంతా వింటున్న సంజయ్ చటుక్కున బయటకొచ్చి అడిగాడు.

"మరెక్కడ్నుంచి వచ్చిందది?"

"అవును. ఎక్కడ్నుంచి వచ్చింది. బహుశా ఆ పరమహంసే పెట్టివుంటాడు. నాయనా సంజయ్ ఇవి కట్టుకుని సన్యాసుల్లో చేరిపో! అని అవునా?"

ఆనందరావు కొడుకునైపు చూస్తూ కోపంగానూ, హేళనగానూ అన్నాడు.

ఒక్కక్షణం కళ్ళు మూసుకుని అలానే నిలబడ్డాడు సంజయ్.

"అవును. అదే నేనూ అనుకుంటున్నాను" గంభీరంగా అనేసి వడివడిగా అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

"అదేమిట్రా" తెల్లబోయింది అరుంధతి.

కొడుకు వెళ్ళినదిక్కే అయోమయంగా చూశాడు ఆనందరావూ.

తర్వాత కోపంగా అరిచారు.

"ఓహో... పెద్ద ఆదిశంకరాచార్యననుకుంటున్నాడేమో నీ కొడుకు. ఆయన కొచ్చినట్లు కాషాయపు వస్త్రాలు దేముడే ప్రసాదించాడనుకుంటున్నాడేమో. ఇక శుకమహర్షికొచ్చినట్లు దండమూ, కమండలమూ కూడా ఆకాశంలోంచి వూడిపడతాయేమో వేచి చూడమను"

"ఏమిటండీ మీరు కూడానూ" అరుంధతికి కళ్లలో నీళ్లు తిరిగాయి.

"కన్నావుగా బైరాగి కొడుకును అఘోరించు. వీడి వయసువాళ్ళంతా ముచ్చటుగా చదువులు పూర్తిచేసుకుని లక్షణమైన ఉద్యోగాలు చేసుకుంటున్నారు. మన కర్మకి వీడిలా తయారయ్యాడు"

టిఫిన్ తర్వాత కాఫీమాట కూడా మర్చిపోయి చెప్పులేసుకుని ఆ ఆవేశంతో బయటకెళ్ళిపోయారాయన.

"భగవంతుడా, ఈ కాషాయపు పరీక్షేమిటి నాకు?" కాషాయపు వస్త్రాలతో కొడుకు సన్యాసుల్లో కలిసిపోతున్న దృశ్యం కనులముందు కదిలింది అరుంధతికి. మనసంతా కలిచినట్లయింది. ఆ సాయంత్రం మరో గమ్మత్తు జరిగేవరకు ఆమె ఆందోళనగానే వుంది.

★ ★ ★

ప్రతిరోజూ సాయంత్రం సింధూర కాలేజి

నుంచి రాగానే, బట్టలు మార్చుకుని వచ్చేలో పల కాఫీ కలిపివ్వటం అరుంధతికి అల వాటు.

ఆరోజు వచ్చి పదిహేను నిముషాలవు తున్నా తల్లి కాఫీ ఇవ్వకుండా అదోమాది రిగా వుండటం గమనించి కాస్త ఆశ్చర్యపో యింది సింధూర.

"ఏమ్మా అలా వున్నావు. ఒంట్లో బాగుం డలేదా? కాఫీ నేనే కలుపుకుంటాలే" గిన్నెలో పాలు పోసుకుంటూ, ఫిల్టర్ తీస్తూ అడిగింది.

అరుంధతి కూతురి మాటలకి కాస్త మామూలుగా అయింది.

"అయ్యో రామా, నువ్వు వచ్చి ఇంతసే పైంది. నీ కాఫీమాటే మర్చిపోయాను. ఏమిటోనే సింధూ. మనసు స్థిమితం లేదు" ఆవిడే స్టవ్ వెలిగిస్తూ అన్నది.

"ఏమయింది అసలు విషయం చెప్పు. మళ్ళీ ఏ అక్కయ్యయినా ఉత్తరం రాయలే దుకదా? " ఆరాగా అడిగింది సింధూర.

"అక్కయ్యలు కాదే సింధూ. మీ అన్నయ్య విషయమే నాకేమీ పాలుపోవటం లేదు"

"ఏం అన్నయ్య కాని సన్యాసుల్లో కలిసిపో తానంటున్నాడా? " తమాషాగా అడిగింది.

"రామరామ సాయంకాలపుపూట నీ నోటి నుంచీ అదేమాట రావాలా? సంధ్యవేళ పైన తథాస్తు దేవతలుంటారు"

ఆవిడ కళ్లలో నీళ్లు తిరిగాయి.

సింధూర తెల్లబోయింది, తల్లి అంతగా బాధపడటం చూసి.

"ఛ, నేనేదో తమాషాకి అన్నాను. మరి ఇందాకట్నుంచి సస్పెన్సుతో చంపకపోతే అసలు విషయం చెప్పచ్చుగా"

"మీ అన్నయ్య గదిలో దేముని పటం ముందు కాషాయవస్త్రం కనిపించిందని చెప్పానా? అది మరి మనమెవ్వరం పెట్టింది కాకపోయే. ఏదో మహిమ కాక పోతే మరెక్కడ్నుంచి వస్తుందని వాడి ఉద్దేశం. అసలే ఏ అవకాశం దొరుకు తుందా ఈ ఇల్లు బంధాలనుంచి బయటకు పోయేందుకు అని చూస్తున్నాడాయె వాడు" ఆమె కంఠం వణికింది.

హఠాత్తుగా ఏదో గుర్తుకు వచ్చినట్ల యింది సింధూరకు.

"అమ్మా! పొద్దున నువ్వేదో అడుగుతుంటే నా హడావుడిలో నేనేదో అనుకుని ఏదో చెప్పాను. అసలేదీ ఆ పొట్లం. ఓసారి చూసి వస్తానుండు" అంటూ కాఫీగ్లాసు అక్కడే పెట్టేసి సంజయ్ గదిలోకి పరుగె త్తింది.

రామకృష్ణుని ఫొటోముందు ఇంటిలో ఇంత అలజడికి కారణమైన ఆ కాషాయపు పొట్లం అమాయకంగా వుంచినచోటే వుంది. గబుక్కున దాన్నందుకుని పొట్లం విప్పి చూసింది. అదో లైనింగ్‌క్లాత్.

"అమ్మా!" అంటూ కేక వేసింది సంతో షంతో సింధూర. అసలే పిచ్చి పిచ్చి ఆలో చనలతో మనసు పాడయివున్న అరుంధతికి ఆ కేకకి దడపుట్టింది.

ఇప్పుడు కూతురికేమయిందోనని హడలి పోతూ పరుగున అటు వచ్చింది.

అక్కడ గదిలో సింధూర "అమ్మా... ఇది... ఇది..." అంటూ పడీపడీ నవ్వసా గింది.

అరుంధతికి గందరగోళంగా అనిపిం చింది.

"ఏమిటి చెప్పయినా నవ్వు. నవ్వయినా చెప్పు" అన్నది.

"ఇది... హాహా... మా ఫ్రెండ్ శైలజ జాకెట్ కోసం కొనుక్కున్న లైనింగ్ క్లాత్. మొన్న సాయంత్రం మనింటికి వచ్చినప్పుడు నాతో మరో అమ్మాయి వచ్చింది చూడు. ఆ




అమ్మాయిది. ఆరోజు మన ఇల్లంతా చూపిస్తూ ఈ గదిలోకి తీసుకొచ్చాను. శైలజకూ పుస్తకాల పిచ్చివుంది. ఇదిగో ఈ పుస్తకాలు చూస్తూ ఈ పేకెట్‌ను ఇక్కడ పెట్టినట్లుంది. ఇద్దరం మర్చిపోయి గది లోంచి వచ్చేశాం మాటల్లో. రేపు నేను తీసు కెళ్ళి ఇచ్చేస్తాలే"

"హమ్మయ్య! అయితే, ఇది నీ స్నేహితు రాలిదంటావు" ఆవిడ గుండెలమీదనుంచి పెద్ద బరువు దించినట్లయి తేలిగ్గా నిట్టూ ర్చింది.

"అన్నయ్య రాగానే విషయం చెప్పు. ప్రస్తుతానికి తన సన్యాసపు ప్రపోజల్‌ను పోస్ట్‌పోన్ చేసుకొమ్మని"

సింధూర నవ్వుతూ ఆ పొట్లంతో తన గదిలోకి వెళ్ళిపోయింది.

★ ★ ★

ఆనందంతో ముఖం వెలిగిపోతుండగా ఆ రాత్రి భోజనం దగ్గర సంజయ్‌తో చెప్పింది ఆ విషయం అరుంధతి.

ముందు సంజయ్ నమ్మలేదు. తానెక్కడ సన్యాసుల్లో కలిసిపోతాడేమోనన్న భయంతో తల్లే కావాలని చెల్లెలిచేత అబద్ధ మెందుకు చెప్పించకూడదూ అనిపించింది.

"నిజమేనా అమ్మా ఇది. దైవానికి సంబం ధించిన విషయం. నిజమే చెప్పండి" అడి గాడు.

తనే చెప్పినా కూడా అపనమ్మకంగా అంటున్న కొడుకువంక బాధగా చూసింది అరుంధతి.

"ఇన్నేళ్ళొచ్చాక అబద్ధాలు చెప్పాల్సిన అవ సరమేమిట్రా, అదీ కన్నబిడ్డతో? "

"కొడుకుని వదులుకోవడంకన్నా సత్యాన్ని వదులుకోవడం సులభం అని నువ్వనుకోవ చ్చుకదమ్మా? "

"చాల్లే మాటలు నేర్చావు. నీకంతంగా అనుమానంగా వుంటే సింధునే పిల్చి ఇలా యక్షప్రశ్నలడుగు" ఆవిడ సంజయ్ వైఖరికి విసిగిపోయి అన్నది.

సింధూరను అడిగాడు సంజయ్.

"నువ్వు నమ్మకపోతే శైలజనే పిలిపించి చెప్పించేదా? పోనీ ఇది జాకెట్ లైనింగ్ క్లాత్ అన్నాగా, ఆ బ్లవుజ్‌పీస్. దానికి మేచ యిన చీర కూడా తెచ్చి చూపించమనేదా? తెల్లచీరకు కాషాయపు బోర్డరుట. అసల ప్పుడే అడిగాను తనను. నీకీ కాషాయపు బోర్డరు తప్ప ఇంకేమీ నచ్చలేదా అని. ఏదో న్యూలుక్‌గా వుంటుందని కొనుక్కున్నాన న్నది కూడా"

సింధు అంత వివరంగా చెప్పిన తర్వాత ఇక నమ్మక తప్పలేదు సంజయ్‌కి.

ఆఖరుకిలా ఆ కాషాయపు క్లాత్‌వలన తను ఇంట్లో హేళనకు, ఆందోళనకు గురి అవ్వాల్సివచ్చిందని బాధపడినా, మామూ లుగా తన గదిలోకి వెళ్ళి తలుపేసుకు న్నాడు సంజయ్ కామ్‌గా.

★ ★ ★

కారుమబ్బులతో కుంభవృష్టిగా కురుస్తుం దనుకున్న ఆకాశం నీలాంబరమై నిర్మలంగా నిలిచినట్లు ఆ ఇంట్లోని ఉద్రిక్త వాతావరణం హఠాత్తుగా తొలిగిపోయి తేలికయిపో యింది. అయితే అంతా మామూలుగా వున్నా యధావిధి దినచర్యలో పడిపోయినా అరుంధతి మాత్రం ఈ సంఘటనతో మాన సికంగా బెంబేలు పడిందనే చెప్పాలి.

హఠాత్తుగా ఎప్పుడైనా తన ఒక్కగానొక్క కొడుకు ఏ స్వామీజీ ఆదేశించాడనో, ఏ గురువుగారో కలలో కనబడి చెప్పాడనో ఇంట్లోంచి ఉడాయించి కాషాయధారుల్లో కలిసిపోతాడేమోనని. అయితే ఏం చేస్తే కొడుకు మామూలు లౌకిక ధోరణిలో పడ తాడో మాత్రం ఆమెకు అంతుపట్టలేదు.

ఆలోచించగా ఆలోచించగా ఓ ఉపాయం తోచిందామెకు. ఎంతవారలైనా కాంత

దాసులే అని మహానుభావులు చెప్పే వున్నారు. కొడుక్కి పెళ్ళిచేసి చూస్తే సరి అనిపించింది.

తన ఆలోచనను భర్త చెవిలో పడేసింది.

అయితే ఆనందరావు ఎగతాళి చేశాడు.

"తాదూర కంతలేదు మెడకో డోలు అన్నట్లు వీడికే స్వయంగా సంపాదన లేదు. నేను చూస్తే రిటైరవబోతున్నాను. అలాం టిది నువ్విప్పుడు వీడికి పెళ్ళిచేసి అదనంగా ఓ పిల్లను ఇంట్లో చేర్చు. ఆ పిల్ల మరికొం తమంది పిల్లల్ని కంటుంది. వాళ్ళందరికీ వండివార్చలేక నువ్వు, సంపాదించి పొయ్య లేక నేనూ చచ్చి చెడి విసిగి, ఆఖరుకు మని ద్దరం కలిసిపోతాం సన్యాసుల్లో జైసద్గురు మహారాజ్‌కి అంటూ..."

చిన్నపుచ్చుకుంది అరుంధతి ఆ మాట లకి.

"మీరేదీ సవ్యంగా ఆలోచించరు!"

"సవ్యంగా ఆలోచించేందుకు వీడేమన్నా సవ్యంగా వుంటేగా. అయినా నీ పిచ్చి కానీ వాడిప్పుడు మనం చేస్తానంటే మాత్రం పెళ్ళి చేసుకోవద్దూ?"

"పోనీ అడిగి చూసేదా?" అరుంధతిలో ఆశలు.

"నువ్వు చేస్తానన్నా, వాడు చేసుకుంటా నన్నా, అనుకున్న వెంటనే మంచి సంబంధం దొరుకుతుందా. ఇప్పటికే మన వాడి పేరు ప్రఖ్యాతులు అందరికీ తెలు సాయె. ఏక్షణాన బైరాగిమఠంలో చేరిపో తాడో అని అనుకుంటూంటే తెలిసిన వాడె వ్వడూ పిల్లనివ్వడు. అథవా యిచ్చినా ఏ తలమాసినవాడో, లేదూ వీడికి తోడు మరే సన్యాసాసక్తుడో యివ్వాల్సిందే కానీ"

భర్త అలా తేల్చి చెప్పేయటంతో అరుం ధతి ఉత్సాహం నీరుగారిపోయింది.

"ఈయన చెప్పిందీ నిజమే. భగవం తుడా! ఒక్కగానొక్క కొడుకుని, బంగారం లాంటి బిడ్డను ప్రసాదించావు. మళ్ళీ అంతలో వాడిలో యీ వయసుకు మించిన ఆధ్యాత్మిక చింతనేమిటి?" అని కనిపించని దేముడ్ని తలచుకుని ఆక్రోశించింది ఆమె మనసు.

★ ★ ★

తాము మామూలుగా కూర్చునే పొదచా టున కూర్చున్నారు అరవింద్, సింధూర.

"ఏమైంది రెండు రోజులుగా, దేవిగారి దర్శనాలే లేవు?" కినుకగా అడిగాడు అర వింద్.

"మా యింట్లో ఓ చిన్న గొడవైందిలే మాస్టార్జీ. ఆ హడావుడిలో రాలేకపో యాను" నవ్వుతూ అన్నది సింధు.

"ఏమిటి గొడవ? కొంపదీసి నీ పెళ్ళిచూ పులు కార్యక్రమం కాదుకదా?"

"ప్చ్ నీకెప్పుడదే ఆలోచన. ఇదేదో పెద్ద పద్మావతీ, శ్రీనివాసుల కళ్యాణంలా మన పెళ్ళి తప్ప యీ లోకంలో వేరే ఘటనాఘ టనలుండవన్నట్లు మాట్లాడతావేం?"

"వాయించేయకు తల్లీ, యింతకూ విషయ మేమిటి?"

కాషాయపు గందరగోళం గురించి చెప్పింది సింధూర.

నవ్వేడు అరవింద్ "మంచివార్తే. అయితే మా బామ్మరిది నుంచి నాకే భయమూ లేదన్నమాట"

"అదేమిటి?"

"అదంతే. మనం ప్రేమించిన అమ్మాయికి గుండాల్లాంటి, వస్తాదుల్లాంటి అన్నయ్యలు వుండకూడదని మా గురువు శ్రీశ్రీ ప్రేమా నందస్వామి గట్టిగా నొక్కి వక్కాణించా రులే!"

"అంతగా నొక్కి వక్కాణించారంటే స్వానుభవమే అయివుంటుంది. ఏం పాపం

ఆయన ప్రేమించిన అమ్మాయి సోదరుల చేతిలో బాగా దెబ్బలు తిన్నారటనా? "

"ఛ... ఛ... ఆయనెవర్నీ ప్రేమించలేదు. ప్రేమను తప్ప!"

"సరేసర్లే... ఆయనెవరో చెప్పిన ప్రేమ సూత్రాలనే పాటిస్తూ మా అన్నయ్యని చూసి మరీ ప్రమాదం లేదనుకోవద్దు. మన విషయం తెలిసిందనుకో, మీ పని యిక అంతే!" బెదిరించింది సింధూర.

"అదేంటోయ్. నువ్వేగా చెప్పావు. మీ అన్నయ్య ఓ కాబోయే స్వామీజీ అని. అలాంటి వాళ్ళు ఫైట్స్ చేయరు, చేయించరు తెలుసా? " తేలిగ్గా అన్నాడు అరవింద్.

"నిజమేకానీ, జ్ఞానబోధ చేస్తార్లే!" అల్లరిగా అన్నది.

"అదేమిటి మధ్యలో? "

"మొన్నామధ్య నాకో ప్రేమలేఖ వచ్చిందిలే. ఆ లెటర్ తీసుకెళ్ళి నేరుగా మా అన్నయ్యకిచ్చేశాను. అంతే ఆ లెటర్ యిచ్చినవాడిని మా అన్నయ్య ఏ కాలో చెయ్యో విరిచేయలేదు కాని మనసే విరిచేసాడు!"

"అర్థమయ్యేట్లు చెప్పు!" భయం నటిస్తూ అడిగాడు.

"అదేస్వామీ, నాలుగు రోజులు అతగాడ్ని విడవకుండా తన వెంటేసుకు తిరిగి ఏదేదో చెప్పాడు. ఏవో పుస్తకాలిచ్చి చదివించాడు. ఎక్కడెక్కడికో తీసుకెళ్ళాడు. దెబ్బతో గురుడి పని గోవిందా గోవింద. మా అన్నయ్య యింకా తటపటాయిస్తున్నాడు కానీ అతనెప్పుడో సాధుమహారాజ్ అయిపోయాడు. తమిళనాడులో ఏదో అరవస్వాముల ఆశ్రమంలో చేరిపోయాడుట. తర్వాత ఆశ్రమాధికారి కూడా అతనేనని చెప్పుకుంటున్నారు"

"అయ్యబాబోయ్. అయితే గురుడు ఆ రకంగా నరుక్కొస్తాడన్నమాట వ్యవహారం. ఇంకా నయం ముందే చెప్పావు. పాపం మా నాన్నమ్మ నామీద ఎన్నో ఆశలు పెట్టుకునివుంది. ఉన్నదొకే వంశోద్ధారకుడ్నని!"

"పాపం మీ ప్రేమానందస్వామీ యిలాంటి విషయాల్లో ఏమీ సలహాలివ్వలేదా? " పకపకా నవ్వింది సింధూర.

"ఊహు, మీ అన్నయ్యలాంటి శాల్తీలని ఆయన వూహించి వుండడు. అయినా మీ అన్నయ్యకిదేం బుద్ధి. హాయిగా యీ వయసులో ఎవరినయినా ఓ చక్కని అమ్మాయిని చూసి ప్రేమిస్తూ జాలీగా గడపక? రియల్లీ అయ్ పిటీ హిమ్"

"మీరేం అంత లావున జాలి పడక్కరలేదులెండి. ఓ అరగంట మా అన్నయ్యతో మాట్లాడితే, ఆ తర్వాత మీమీద మీరే జాలి పడతారు. సర్లే యిక యీ విషయం వదిలేయి. అవునూ రెండు రోజులుగా చూస్తున్నాను. మీ నాన్నమ్మగారు బయట కనిపించటం లేదేం!"

"ఒంట్లో బాగులేదుట. రెండు నెలలకోసారి యిలా నేనావిడ మాట వినడంలేదని నామీద అలిగి పడకేసి బెదిరించటం అలవాటే"

"ఎందుకూ అలగడం? అయినా ఈ వయసులో ఆవిడ్ని అలా బాధపెడతారేం? ఆమేం చెప్పినా మీ మంచికోరేగా చెప్పిన మాట వింటేనేం? " ఆరిందాలా బుద్ధి చెప్పింది.

"వినమంటావా మరి. మీ వూరికి రెండూర్ల అవతల వున్న గ్రామంలో ఓ కన్య కామణిని నాకోసం సెలక్టు చేసి పెట్టింది. చెప్పినట్లు విని బుద్ధిగా వెళ్ళి తాళి కట్టేయమంటావా? " అల్లరిగా అడిగాడు అరవింద్.

"ఆ!!"

"ఆ! అయినా నువ్వేం ప్రేయసివో నాకర్థం కావటంలేదు. మామూలుగా ప్రేమి

కుల్లో అమ్మాయిలు పెళ్ళెప్పుడు, పెళ్ళెప్పుడు అని అడుగుతూంటే అబ్బాయిలే వాయిదాలే స్తుంటారుట. మనదంతా రివర్సు. నేను పెళ్ళెప్పుడు అంటే నువ్వు యిప్పుడిప్పుడే వద్దంటూన్నావు. అవతల మా నాన్న మ్మేమో నాపైన యుద్ధాలు ప్రకటించే స్తుంది. ఆవిడ దగ్గరేమో నాకిప్పుడే పెళ్ళి వద్దు అని ఫోజులు కొట్టటం, ఇక్కడేమో నీ చుట్టూ తిరగడం, ప్చ్" డల్‌గా అన్నాడు అరవింద్.

"అబ్బ, మరీ అన్యాయంగా మాట్లాడకు. అప్పటికి నాకే కలలు, కోరికలు లేనట్లు, ఎందుకో నాకు మన పెళ్ళికి పెద్దవాళ్ళు అంత తేలిగ్గా ఒప్పుకుంటారా అన్న భయం. ముందే చెప్పేస్తే వాళ్ళు వద్దన్నారనుకో. అప్పుడిక ఒకే ఆంక్షలు ఆరళ్ళు. ఇప్పుడిలా ఫ్యూచర్‌మీద హోప్స్‌తోనన్నా రెండు రోజుల కోసారి కలుసుకుని కబుర్లు చెప్పుకుం టున్నాం. తర్వాత అదీ వుండకపోతే ఎలా?" బేలగా అన్నది సింధూర.

"పిచ్చిదానిలా మాట్లాడుతున్నావు సింధూ, వాళ్ళు వద్దంటారేమోనన్న భయంతో చెప్ప కుండా ఎంతకాలం వుండగలం?"

"నా ఉద్దేశ్యం చెప్పకుండా అని కాదుకదా. మనంతట మనమే ఎందుకు కదపటం అని?"

"ఏమో సింధూ, నేను మాత్రం నువ్వు ఆగమన్నట్లు యీ ఆరు నెలలు ఆగుతా నంతే. నీ పరీక్షలవటం మా నానమ్మని ఒప్పించి మీ ఇంటికొచ్చేస్తాను. మీ వాళ్ళు ఒప్పుకున్నా, ఒప్పుకోకున్నా నువ్వు నా చేయి పట్టుకుని వచ్చేయాలి. తెలిసిందా?" అడి గాడు.

"అలాగే, అలాగే, ముందిది చెప్పండి. పిండి వంటల్లో మీకేది యిష్టం?" టాపిక్ మారుస్తూ అడిగింది సింధూర.

"అదేంటి, ఇష్టమైన పువ్వు పేరో, పిట్ట పేరో చెపితే భవిష్యత్తు చెప్తారే అలా పిండి వంటకం చెపితే నువ్వు నా భవిష్యత్ చెప్తావా ఏమిటి?"

"అబ్బా, మీకన్నీ వేళాకోళాలే. మీరు చెప్పిన అయిటమ్ రేపు మీకోసం చేసుకొ స్తాను మీ యింటికి"

"మా ఇంటికే!" ఆశ్చర్యంగా అడిగాడు అర వింద్.

"ఆహా... అక్షరాలా మీ ఇంటికే. ముందేదిష్టం సెలవివ్వండి"

"గులాబ్‌జామ్"

"సరే యిక లేవండి. వెళదాము రేపు మీ ఇంట్లోనే గులాబ్‌జామ్‌తోసహా తీయగా కలుసుకుందాం"

సింధూర లేచింది ఇంటికి వెళ్ళేందుకు.

కూర్చునే చేయి అందించాడు అరవింద్. అతను లేస్తున్నాడేమోననుకుని ఆ చేయం దుకుంది సింధూర. కానీ అతను ఆమె చేయి పట్టుకుని తనవైపు లాగాడు. ఆమె పూలచెండులాగ వచ్చి అతని గుండెలపై పడిపోయింది.

వెంటనే పక్కకు జరుగుతూ చిరుకోపంతో చూసింది.

నవ్వేడు అరవింద్.

"నన్ను లేపుతావనుకుంటే నువ్వే పడిపో యావేమిటి?"

"ఇదో రోజురోజుకీ అబ్బాయిగారు శ్రుతి మించిపోతున్నారు. ఇలా అయితే యిప్పుడు రెండురోజులకోసారి కలుసుకునేది వారాని కోసారిగా మార్చేందుకు మన ప్రేమసభలో బిల్లు ప్రవేశపెడతాను!" బెదిరిస్తున్నట్లుగా అన్నది.

"నేను వీటో చేస్తాను!"

"గొప్పే! వీటో చేసుకుంటూ కూచోండి. నేను వెళతాను!"

ఆమె విసురుగా లేచి రెండడుగులు





వేసింది.

"ఆగాగు, నేనూ వస్తున్నా!" అరవింద్ కూడా లేచి ఆమె పక్కనే నడుస్తూ సన్నగా కూనిరాగం తీశాడు.

"ప్రేమ ఎంత మధురం! ప్రియురాలు అంత కఠినం!"

కిలకిలా నవ్వింది సింధూర.

★ ★ ★

ఆ మరునాడు సింధూర పుట్టినరోజు. ఆరోజు ఆదివారం కావడంతో కాలేజికి వెళ్ళే పనిలేదు. పొద్దున్నే తీరిగ్గా తలంటుకుని కొత్త చీర కట్టుకుని తనే స్వయంగా గులాబ్‌జామ్ చేసి, దాంతోపాటే అరుంధతి చేసిన గారెలు కూడా ఓ స్టీలు గిన్నెలో సర్ది.

"అమ్మా, ఎదురింట్లో వుండేది మా లెక్చరరేకదా, ఆ బామ్మగారు కూడా మంచిదిలానే వుంది. వాళ్ళకు యిచ్చివచ్చేదా?" అని అడిగి ఎదురింటికి వచ్చింది.

కాలింగ్ బెల్ శబ్దానికి తలుపుతీసిన అరవింద్ గుమ్మంలో నిలుచుని వున్న సింధూరను ఆనందంగానూ, ఒకింత ఆశ్చర్యంగానూ చూశాడు.

"ఇంటికి వస్తున్నానంటే" ఏదో తమాషాకి అందేమో అనుకున్నాడు కానీ నిజంగానే అనుకోలేదు.

ఎర్రంచులేత చందనం కలర్ జరీటిష్యూ చీర, అదే జాకెట్. మెడలో స్టెప్ చెయిన్, చెవులకు జుంకీలు, నుదుట మెరుస్తున్న స్టిక్కర్ బొట్టుతో కళకళలాడుతోంది.

ఇంకా తడి ఆరని కురులను వదులువదులుగా జడల్లుకుని నిండుగా కనకాంబరాలు పెట్టుకుని బాపూబొమ్మలా వుంది.

"కలా? నిజమా!" అడిగాడు అరవింద్.

"కలకాదు మహానుభావా. నిజమే. ఇంతకీ నన్ను లోపలికి రానిస్తావా లేదా?"

అలికిడికి లోపలి గదిలో పడుకుని వున్న వజ్రమ్మ "ఎవరా వచ్చింది?" అని అడుగుతోంది.

"ఎదురింటి అమ్మాయి నానమ్మా" సింధూరను గురించి ఏమీ తెలియనట్లు అమాయకంగా చెప్పాడు అరవింద్.

"ఇలా రమ్మను" ఆవిడ చెప్పింది.

అప్పటికే అక్కడికి చేరుకున్న సింధూర "నమస్కారమండి. ఇవాళ నా పుట్టినరోజు. అమ్మ మీకు యీ స్వీట్స్ యిచ్చిరమ్మంది" అంది.

"అలాగామ్మా కళ్యాణమస్తు. రా యిలా వచ్చి కూర్చో నాకు రెండు రోజులనుంచి ఒంట్లో బావుండటంలేదు. అందుకే నిన్నే యిక్కడకు రమ్మనాల్సివచ్చింది. ఏమనుకోకేం"

ఆవిడ ఆప్యాయంగా తన ఎదుటనున్న కుర్చీ చూపెట్టింది.

ఒద్దికగా కూర్చుంది సింధూర.

"నీ పేరేదో చెప్పావ్. ఏమిటమ్మా" అడిగింది సింధూరనే ముచ్చటగా చూస్తూ.

"సింధూర"

"ఆ, సింధూర కదూ బాగుంది. మావాడి కాలేజిలోనే చదువు కుంటున్నావుట కదూ. అన్నట్లు మావాడు పాఠాలవీ బాగా చెప్తాడా?" కుతూహలంగా అడిగింది.

"చాలా బాగా చెప్తారండి" బుద్ధిగా చెప్పింది సింధూర. మరికొద్దిసేపు సింధూర అక్కయ్యలు, అన్నయ్య గురించి అడిగింది. ఆవిడ ప్రశ్నలన్నింటికీ ఓపిగ్గా జవాబిచ్చింది సింధూర.

"అమ్మాయ్. ఏమనుకోకపోతే ఫ్రిజ్‌లో తమలపాకులు బత్తాయిలు వున్నాయి. పైనే డబ్బాలో వక్కపొడి వుంది. ఓ తాంబూలం పెట్టి యిస్తావా? లేవలేక యింటికి వచ్చిన దానివి నీకే పని చెప్తున్నాను" అన్నదామె.

"అలాగే"నంటూ వెళ్ళి అక్కడే పక్కన

నిలబడివున్న అరవింద్ వంక తలెత్తి కూడా చూడకుండా ఫ్రిజ్ తీసి ఆకులు, పండు, వక్కపొడి పెట్టి ఆవిడకు యిచ్చింది.

వజ్రమ్మ దిండుకిందనుంచి ఓ వంద కాగితం తీసి ఆ తాంబూలంలో పెట్టి సింధూర చేతిలో పెట్టింది.

"అరెరె, ఇది నా కోసమేనా ఎందుకండీ యిప్పుడిదంతా? " మొహమాటపడింది సింధూర.

"తీసుకోమ్మా. పుట్టిన రోజునాడు యింటి కొచ్చిన అమ్మాయిని ఒట్టిచేతులతో ఎలా పంపేది? "

ఇక తీసుకోక తప్పలేదు సింధూరకు.

"నాకు బాగుంటే ఓ కప్పు కాఫీ అన్నా కలిపి యిచ్చి వుండేదాన్ని. బొత్తిగా లేవలేకున్నానీ పూట మరీను. మా అరవిందుడ్ని కాఫీ కలపమంటే జ్వరం కదా అని కాఫీకి బదులు కషాయమిస్తున్నట్లున్నాడు. ప్చ్ కమ్మని కాఫీకోసం నాలుక కొట్టుకుంటోంది "

"అరె, పోనీ మీకోసం నేనే కాఫీ కలపనా? " అడిగింది సింధూర.

"అయ్యో, నీకెందుకమ్మా శ్రమ!" ఆవిడ వారించబోయింది.

"ఇందులో శ్రమేముందండి. కాఫీ కలపటమెంతసేపు. పాలు, పంచదార అవన్నీ చూపిస్తే క్షణాల్లో చేసేస్తాను" అంటూంటే ఆవిడ అరవింద్‌కి పురమాయించింది.

"విందూ, అమ్మాయికి పాలు, కాఫీపొడి చూపెట్టు నాన్నా"

అరవింద్ దారితీస్తూండగా వంటింట్లోకి నడిచిన సింధూర తను తెచ్చిన గిన్నెలోంచి గులాబ్‌జామ్ తీసి అతనినోట్లో వేసింది.

అతను సింధుని దగ్గరకు తీసుకున్నాడు.

"నిన్న నాతో చెప్పనే లేదేం ఇవాళ నీ పుట్టినరోజని!"

"చెపితే ఏం చేసేవారేం? "

"నీకో మంచి బహుమతి రెడీగా వుంచేవాడిని. ఇప్పటికైనా మించిపోయిందేం లేదు. రెడీమేడ్ బహుమతి యిచ్చేస్తాను"

సింధూర వూహించి వారించేలోపల ఎర్రగా వూరిస్తున్నట్లున్న ఆమె పెదవులపై తన పెదవులతో ముద్రవేసేసాడు.

ఆమె కోపంగా చూసింది.

"ఎలా వుంది? " కొంటెగా అడిగాడు.

"గులాబ్‌జామ్ లావుంది!"

"యూ నాటీ!" తలమీద చిన్నగా మొట్టాడు.

"ప్చ్ మీరుండండి. మొట్టమొదటిసారిగా యీ వంటింటి ప్రవేశం చేశాను. పాలు పొంగిస్తే శుభంగా వుంటుంది. పాలేవి? " అడిగింది.

పక్కనే వున్న పాలగిన్నె అందించాడు.

"ప్చ్... ముందే కాచినవా? ఇవి మరుగుతాయికానీ పొంగవు. ఫ్రిజ్‌లో పేకెట్ చూశాను. అవి తీసుకురండి" పురమాయించింది.

"బాబోయ్ పెళ్లికిముందే ఇంత అథారిటీ చూపిస్తున్నావు. ఇక పెళ్ళయితే..."

మధ్యలోనే అతనిమాట అందుకుని పూరించింది.

"ఇక మీపని అరవిందా కాదు గోవిందా అన్నమాట" అతను నవ్వుకుంటూ వెళ్ళి పాల పేకెట్ తెచ్చి ఇచ్చాడు. ముందుగా స్టవ్ వెలిగించి పాలు పొంగించి తర్వాత చక్కని స్ట్రాంగ్ కాఫీ మూడు కప్పులు కలిపి అరవింద్ చేతిలో ఓ కప్పుంచి రెండు కప్పులతో వజ్రమ్మ దగ్గరకెళ్ళింది.

"అనవసరంగా నీకు శ్రమిచ్చానమ్మాయ్" అంటూ లేచి కూర్చుని కాఫీ రెండు గుటకలు వేసి తృప్తిగా నిట్టూర్చింది ఆవిడ.




"అబ్బ, ప్రాణం లేచొస్తోంది ఈ కాఫీ తాగుతుంటే. నేను కూడా ఇంత బాగా చేయను. చాలా బాగా కలిపావు. వంటలవీ కూడా బాగా చేసేటట్లున్నావు"

"ఫరవాలేదండి, ఏదో చేయగలను"

"భేష్, మంచి పనిమంతురాలివన్న మాట. మీ అమ్మగార్ని మెచ్చుకోవాలి. ఈ రోజుల్లో చాలామంది ఆడపిల్లలు అత్తగారింటికి వెళ్లిన తర్వాత స్టవ్ వెలిగించటం నేర్చుకుంటున్నారు" ఆవిడ సింధూరను మెచ్చుకుంది.

ఆవిడ కప్పు కింద పెట్టేదానికి వంగిన అదను చూసి సింధూర తల వెనక్కి తిప్పి అక్కడ నిలబడి వున్న అరవింద్‌ను చూసి కళ్లెగరేసింది. 'చూశావా? ' అన్నట్లు నవ్వుతూ. ఆవిడే అన్నది మళ్ళీ

"ప్చ్ అసలు మావాడికే ఈపాటికి పెళ్ళయివుంటే ఇల్లెంత కళకళలాడుతూ వుండేది. ఇప్పుడు చూడు నేను మూలపడితే కనీసం కాఫీ కలిపిచ్చే దిక్కు లేదు ఇంట్లో. అంతా నా తలరాత అనుకోవాలి. నేను పోతేకానీ వాడికా కళ్యాణగీత వచ్చేట్లు లేదు. ఎప్పుడడిగినా ఇప్పుడే పెళ్లి వద్దంటాడు"

"మరో ఆరునెలలాగండి. మీ కోరిక తీరుతుంది." పెద్ద ఆరిందాలా అభయమిచ్చింది సింధూర.

"ఇక, మావాడూ అదేమాట అంటున్నాడు. నువ్వూ అలాగే చెపుతున్నావే? " ఆవిడ కళ్ళింత చేసుకు చూసింది. గతుక్కుమన్నది సింధూర. "చచ్చాంరా దేముడా. పెద్దావిడతో మాట్లాడేటపుడు చాలా జాగ్రత్తగా వుండాలన్నమాట" అనుకుంటూ, నవ్వు తెచ్చి పెట్టుకుంటూ, "మాట వరసకి అలా అన్నానండి" అన్నది.

ఆ తర్వాత మరో అయిదు నిముషాలు ఆవిడేదో చెబుతూంటే విని. "వెళతానండి. వచ్చి చాలా సేపయింది. అమ్మ ఎదురు చూస్తుంటుంది"అంటూ లేచింది.

"అప్పుడపుడు వస్తూండమ్మాయ్" అన్నదావిడ.

"అలాగే"నంటూ అరవింద్ కోసం చూసింది. అతను వరండాలో నిలబడివున్నాడు.

"సాయంత్రం బయట కొస్తావా? " మెల్లగా అడిగాడు.

"ఊహు"

"మరి ప్రజంటేషన్? "

"ఇపుడిచ్చిందేచాలు" నవ్వుతూ వెళ్ళిపోయింది సింధూర.

★ ★ ★

ఆనందరావుగారు ఉద్యోగ విరమణచేసే రోజు రానే వచ్చింది.

"నెలనెలా అంత జీతం తెచ్చి పోస్తుంటే దర్జాగా చేసుకొచ్చాను సంసారం ఇన్నాళ్ళూ. అడిగినవాళ్ళకి లేదనకుండా పెడుతూ వచ్చాను. ప్చ్ ఇకపై ఎలానో ఏమో. భగవంతుడా నీదే భారం" దిగులు కలిగింది అరుంధతిలో.

ఆరోజు సాయంత్రం ఆఫీసులో తోటి ఉద్యోగస్థులు చేసిన ఫేర్‌వెల్ పార్టీలో పాల్గొని మెడలో పూలమాలలతో, పెద్ద ప్రజంటేషన్ పేకెట్‌తో ఆటో దిగిన ఆనందరావులో మాత్రం ఆ విచారచ్ఛాయలేమీ లేవు.

ఆయన మామూలుగా, ఇంకా చెప్పాలంటే మరి కాస్త ఆనందంగా కూడా వున్నట్లనిపిస్తుంది చూసేవారికి.

తండ్రి తెచ్చిన పూలమాలల్ని గుమ్మాలకు అందంగా తోరణాలుగా కట్టసాగింది సింధూర.

ఆనందరావు డ్రాయింగ్ రూమ్‌లో టీపాయ్ మీద తనకిచ్చిన ప్రజంటేషన్

పేకెట్ విప్పసాగాడు.

అరుంధతి, సింధూర కుతూహలంగా చూశారు.

అదో పెద్ద నటరాజ విగ్రహం. ఇత్తడితో చేసింది. చాలా కళాత్మకంగా ఉంది.

"బాగుంది నాన్నా, ఈ బొమ్మతో మన డ్రాయింగ్ రూమ్‌కే కళ వచ్చింది" సంతోషం వ్యక్తం చేసింది సింధూర. అరుంధతికి మాత్రం పెద్దగా ఏం నచ్చలేదు. భార్యనుంచి ఏం రెస్పాన్స్ లేకపోవడంతో ఆవిడనడిగాడు. "ఏమోయ్, ఎలా వుంది? నువ్వేం చెప్పవేం? "

"వూ... బాగానే... వుంది" అనేసి ఆమె లోపలకెళ్ళబోయింది.

ఆవిడకంత నచ్చలేదని అతనికి తెలిసిపోయింది.

"ఏమిటా దీర్ఘం? ఏంకొందాం జ్ఞాపికగా అనడిగితే నేనే చెప్పాను ఇది కావాలని. కళాస్వరూపం. నీకెందుకు బావుండలేదు." కినుకగా అడిగాడు.

"కళాస్వరూపాలెందుకటా ఇప్పుడు మనకి? మీరడగడం, వాళ్ళివ్వడం బాగానే వుంది" వంటింట్లో కొచ్చేసింది.

"కళ గురించి నీకేం తెలుసులే? " ఆవిడతో ఇక ఏం చెప్పీ లాభం లేదనుకుని, విగ్రహాన్ని ఏ యాంగిల్‌లో ఎటు వుంచితే బాగుంటుందా అని చూసుకోసాగారు.

"అయినా ఈ గవర్నమెంటుననాలి. వయసువస్తే మాత్రమేం. బాగా పిడి రాయి లాగ వున్నవాళ్ళని, ఇంకో పదేళ్ళయినా కష్టించి పనిచేసేవారిని ఇక చాలసి రిటైర్‌మెంటిచ్చి ఇళ్ళకి పంపేయటం ఏం న్యాయం? " మెల్లగా గొణుక్కుంటూ రాత్రికి వంటపని చూసుకోసాగింది అరుంధతి.

"నాన్న రిటైరయిపోయారు. ఇక ఆ పి.యఫ్ మనీ అదీ వచ్చిందంటే అమ్మ సంబంధాలకై పోరుపెడుతుంది. అరవింద్ సంగతి ఎలా చెప్పాలి? " సింధూరకు ఓ వంక భయంగానూ, సంతోషంగానూ అనిపించసాగింది. తన ప్రేమ విషయం ఇక ఇంట్లో తెలియపర్చాల్సిన సమయం వచ్చేస్తోందని అనుకోగానే

"నాన్న రిటైరయిపోయారు. ఇక సమయమంతా కాళీనే. ఇకనైనా మనసును కాస్త సత్కాలక్షేపాలవైపు మళ్ళిస్తే బాగుండును. చూద్దాం నాన్న ఇకపై కాలం ఎలా గడుపుతారో. రోజూ అలా రామకృష్ణా మఠంవైపు వెళ్ళొస్తే మనసు ప్రశాంతంగానూ, నిర్మలంగానూ వుంటుందని చెప్పాలి" అనుకున్నాడు సంజయ్.

'హమ్మయ్య, ఇన్నిరోజులకి ఆఫీసు బెడద తీరింది. పొద్దున లేవడం ఉరుకులు పరుగులతో ఆఫీసుకి పరుగెత్తడం మళ్ళీ సాయంత్రం ఆ రద్దీ బస్సుల్లోపడి హూనమై రావడం తప్పింది. ఇకనైనా నేను అనుకున్నది సాధించి తీరాలి'.

అలా ఆనందరావు ఆలోచనలు సాగిపోతూన్నాయి. ఆరాత్రి ఆ ఇంట్లో వున్న నలుగురూ నాలుగు రకాలుగా ఆలోచిస్తూ పడుకున్నారు.

★ ★ ★

మరుసటి వారమే దిగారు విజయవాడ నుంచి కూతుళ్ళిద్దరూ. ఆనందరావు రిటైర్‌మెంట్ వార్త ఉత్తరాల్లో చూడగానే పి.యఫ్ డబ్బు వచ్చాక... అప్లికేషన్లు మొదలయ్యాయి.

పక్కన ఎవరూ లేకుండా చూసి, "అమ్మా, మా అత్తగారు..." అంటూ ఏదో చెప్పబోయి సందేహంగా ఆగిపోయిన పెద్ద కూతురు అంజలిని చూస్తుంటే జాలి, కోపమూ రెండూ కలిగాయి అరుంధతిలో.

"ఊ, ఏం అడిగి రమ్మందో చెప్పు" ఆవిడ కంఠంలో ఒలికిన పదునుకి తడబడింది అంజలి.




"ఏంలేదు. మళ్ళీ చెపుతాలే" మెల్లగా అన్నది.

"మళ్ళీ ఎందుకూ ఇప్పుడే చెప్పు. అదేదో ఇవ్వగలిగిందా కాదా అన్నది ఆలోచించుకు నేందుకు వ్యవధి అన్నా వుంటుంది"

"నాన్నకి డబ్బు వచ్చాక ఓ వాషింగ్ మెషిన్, వాక్యూమ్ క్లీనరూ కొనివ్వమను మీ నాన్నని. ఇక ఇదే ఆఖరుగా. ఇకపై వాళ్లేం ఇస్తారు? నువ్వేం తీసుకుంటావు అన్నా రమ్మా అత్తయ్యా..."

"అంటే ఆఖరి రక్తపు బొట్టు వరకు పీల్చ దల్చుకున్నారన్నమాట" మనసులోనే అను కుంది అరుంధతి.

"సరేనమ్మా, నాదేముంది. మీ నాన్నతో చెప్పి చూస్తాను. అయినా ఇంకా మేము మరో ఆడపిల్లకు పెళ్లిచేయాలి అని తెలి యదూ మీ అత్తగారికి? కానివ్వు. ఆవిడే అన్నట్లు ఇకపై మేమిచ్చేందుకు మాత్రం మా దగ్గరేముంటుంది? " నిర్లిప్తంగా అన్నది.

అంతవరకూ పక్కగదిలోంచి వాళ్ళిద్దరి మాటలూ వింటున్న మంజుల చటుక్కున రంగప్రవేశం చేసింది.

"అమ్మా, నువ్వే చెప్తున్నావు. ఇకపై ఏమి వ్వగలం అని. అందుకే నన్నూ మర్చిపో వద్దు. ఆ డబ్బు రాగానే పాపకో పదివేలు దాని పేరుపైన బేంక్‌లో యఫ్.డిలో వేయండి. దాని పెళ్ళికి వాళ్ళ అమ్మమ్మ, తాతయ్య ఇచ్చినట్లుగా ఉపయోగపడు తుంది" ముసిముసిగా నవ్వుతూ చెపుతున్న రెండోకూతురి వంక నవ్వాలో, ఏడవాలో తెలియనట్లు చూసింది అరుంధతి.

"రెండేళ్ళు కూడా రాని తన కూతురి పెళ్లి గురించి ఇప్పట్నించే జాగ్రత్త పడుతున్న మంజు ఇరవయ్యేళ్ళ చెల్లెలి పెళ్లి గురించీ, దానికేమిచ్చి చేస్తారూ? పెళ్లి సంబంధాలే మన్నా చూస్తున్నారా అని కూడాఅడగటం లేదు. ఎంతసేపూ వాళ్ళ సంసారాలు, వాళ్ళ కోరికలు తప్ప మరే ఆలోచనా రాదా? "

"అలాగేనమ్మా. మా శక్తి వున్నంతవరకు పిల్లలకి పెట్టాలనే అనుకుంటాంకానీ దాచి పెట్టి నెత్తిన కట్టుకుపోవాలని కాదుకదా? ఆ డబ్బు వచ్చేందుకు ఇంకా రెండుమూడు నెలలన్నా పడుతుందికదా. అప్పుడు చూద్దాంలే. అవునూ, సింధూకి మీవేపు ఎవ రన్నా మంచి కుర్రాడుంటే చూడకూడదూ, ఆ డబ్బు చేతికందగానే దాని పెళ్ళీ చేసేస్తే ఏదో మా బాధ్యత సగం తీరినట్లవుతుంది"

అరుంధతి మాటలకి అంజలికానీ, మంజు లకానీ పెద్దగా ఏం ఇంట్రస్టు చూపలేదు.

"అలాగే, చూస్తాము" అనేశారిద్దరూ.

★ ★ ★

కాలేజీలో ఒంటరిగా అశోక చెట్లు పక్కగా నడిచి వస్తున్న సింధూర ఎదురుగా వస్తున్న అరవింద్‌ను చూసి నడక వేగం పెంచింది.

"తానిలా ఒంటరిగా చిక్కిందంటే చప్పున పిలిపి ఓ అయిదు పది నిముషాలన్నా మాటలు పెట్టుక్కూచుంటారు. అది తన స్నేహితురాళ్ళలో ఎవరైనా చూశారంటే ఇక తన పని గోవిందా. తామిద్దరి విషయం చూచాయగా తెలుసు అందరికీ" అలా అను కుని వడివడిగా వెళ్ళిపోతున్న సింధూరను తనూ నడక వేగం పెంచి అందుకుని 'హాయ్' అన్నాడు నవ్వుతూ.

"చచ్చాంరా బాబూ" అనుకుంటూ 'ఏమిటీ? ' అడిగింది అటూ ఇటూ ఎవరన్నా గమనిస్తున్నారేమోనని చూస్తూ.

"సాయంత్రం పార్కుకు రా"

"ఏమిటంత అర్జంటు విషయం? "

"వెరీ అర్జంటు మాటర్. సాయంత్రమే చెప్తాను" అంటూనే చకచకా వెళ్ళిపోయాడు అరవింద్. సింధూర రానని చెప్పే అవకా శమే ఇవ్వకుండా.

★ ★ ★



"ఏమిటంతటర్జంటు విషయం?" ఆ సాయంత్రం పార్కులో కలుసుకున్నాక అడిగింది సింధూర.

"ఊ, మార్కెట్లోకి కొత్త డిటర్జెంట్ సోప్ వచ్చింది. మా ఇంట్లో వాడితే బట్టలన్నీ తళతళలాడే తెలుపుతో మెరిసిపోతున్నాయి. మీ ఇంట్లో కూడా వాడతారేమో చెపుతామని" సీరియస్‌గా చెపుతున్న అరవింద్‌ని చూసి ఫక్కున నవ్వేసింది సింధూర.

"ఇది చెప్పడానికే పిలిచారా?"

"కాదు, ఒకటిచ్చేందుకే పిలిచాను?"

అదిరిపడింది సింధూర. "ఏ... ఏమివ్వాలనుకుంటున్నారు?" కాస్త దూరం జరుగుతూ అడిగింది.

ఆమె బెదురు చూసి హాయిగా నవ్వేసాడు అరవింద్.

"ఏమిస్తాననుకున్నావు? అంతలా ఉలిక్కి పడుతున్నావు?" కొంటెగా అడిగాడు.

"ఇదిగో?" చూపుడువేలు చూపిస్తూ 'నేవెళతానిక' లేవబోయింది.

"ఆగవోయ్. మనకిది మామూలేగా. అయినా సెన్సారు మెంబరుగా వుండాల్సిన దానివి. నేనేం మాట్లాడినా వేరే ఏదో ఆలోచిస్తావెందుకు?"

"మాట్లాడే విధానంలో వుంటుందది. ఇంతకీ విషయం చెప్తావా లేదా?"

"నువ్వు చెప్పనిస్తున్నావా? మొన్న నీ పుట్టినరోజునాడు నువ్వు ముందుగా నాకు చెప్పనేలేదు. అందుకని నేను నీకేమీ ఇవ్వలేకపోయాను. ఇవాళ నా పుట్టినరోజు. ఈనాటి బర్త్‌డే, ఈ సంతోషం ఎప్పటికీ గుర్తుండిపోయేలా... ఇదిగో ఇది తీసుకువచ్చాను" అంటూ పాంట్ జేబులోంచి ఓ చిన్న బాక్సు తీసాడు. దానిలో ముద్దులొలుకుతున్న బంగారపు ఉంగరం మెరుస్తోంది. హృదయాకారంలో తెల్లరాళ్ళు పొదిగి వున్నాయి.

సింధూరకేం అర్థంకాలేదు.

"ఈ డిజైన్ ఏరి కోరి మరీ చేయించాను, బాగుందా?" ఉంగరాన్ని అపురూపంగా చూస్తూ అడిగాడు అరవింద్.

"బావుంది, కానీ బర్త్‌డే మీదయితే మీకు నేనేదైనా బహుమతి ఇవ్వాలికానీ మీరే తీసుకురావడం ఏమిటి?" అడిగింది.

"ఈ ఉంగరం నీ చేత్తో నాకు తొడగటమే నువ్వు నాకిచ్చే అమూల్యమైన బహుమతి సింధూ" అతను చేతిని ఆమెవైపు చాపాడు.

అతని కళ్ళలోని ఆరాధనా భావాన్ని చూస్తూ కాదనలేకపోయింది సింధూర. ఆ చేతినందుకుని ఉంగరాన్ని అతని వేలికి తొడిగింది. ఆ ఉంగరంతో కొత్త అందాన్ని సంతరించుకున్న అతని దృఢమైన పచ్చని చేతిని అప్రయత్నంగానే పరవశంగా కళ్ళకద్దుకుంది.

నవ్వేడు అరవింద్, "బుద్ధూ. కళ్ళక్కాదు అద్దుకోవాల్సింది' అంటూ ఆమె ఏం జరుగుతుందో గ్రహించే లోపునే జేబులోంచి మరో ఉంగరం తీసి ఆమె కుడిచేతి వేలికి తొడిగి ఆ చేతినలానే పెదవులకానించుకున్నాడు.

అంతా రెప్పపాటులో జరిగిపోయింది. వెచ్చని అతని అధరాల స్పర్శతో శరీరమంతా వింతగా పులకరించినట్లయింది సింధూరకు. అది కొన్ని క్షణాలే. వెంటనే తననుతాను నిగ్రహించుకుంటూ తన చేతిని అతన్నుంచి వెనక్కి లాక్కుంది.

"ఏమిటి... మీరు చేసినపని?" తన వేలికి మెరుస్తున్న ఉంగరాన్ని చూసుకుంటూ అడిగింది.

"నేనేదీ బదులుంచుకోనమ్మాయ్. నువ్వు నా వేలికి ఉంగరం తొడిగావు. నేనూ అదే పని చేయాలిగా. చేశాను. సో, మన ఎంగేజిమెంట్ అయిపోయినట్లే. అంటే సగం

పెళ్లయి పోయినట్లన్నమాట"

"సంబరమేకానీ యింత చక్కగా వేలికి యింత విలువైన ఉంగరం తీసుకుని ఇంటికి వెళితే మా ఇంట్లోవాళ్ళు చూసి ఎక్కడిదని అడిగితే నేనేం చెప్పాలి? " ఇంకా వేలికున్న ఉంగరాన్నే చూసుకుంటూ అడిగింది. అదీ అచ్చం అరవింద్ ఉంగరంలాంటిదే. హృద యాకారంలో తెల్లరాళ్ళు పొదగబడి వున్నాయి. ఒకే డిజైన్‌లో రెండు చేయించి నట్లున్నాయి.

"కాబోయే శ్రీవారి బహుమతి అని చెప్ప వోయ్" చాలా తేలిగ్గా చెప్పాడు అరవింద్.

కోపంగా చూసింది సింధూర. "నేను సీరి యస్‌గా అడుగుతుంటే నీకంతా నవ్వులా టగా వుందా? "

"మరేం చేస్తానంటావ్? "

"నీకు... నీకు కోపం రాకపోతే యీ రింగ్ తీసి దాచేస్తాను. మన పెళ్ళి అయిన తర్వాత పెట్టుకుంటాను"

ఆమె చెప్పటం పూర్తికాకముందే అర వింద్ విసురుగా ఆమె చేయందుకుని వేలి కున్న ఉంగరాన్ని తనే లాగేసి ఆమె చేతిలో పెట్టి ముఖమటు తిప్పుకున్నాడు.

హతాశురాలయింది సింధూర.

కానీ వెంటనే తెప్పరిల్లీ అతనిక్కాస్త దగ్గ రగా జరిగి అతని భుజంపై చుబుకం ఆనిస్తూ చిన్నగా అడిగింది.

"అంత కోపమైతే ఎలా? నేనన్నదాంట్లో తప్పేముంది? "

"నీ తప్పేమీ లేదు. నిన్ను ప్రేమించటం నాదీ తప్పు"

"విందూ!" సింధూర కళ్ళలో నీళ్ళు వచ్చే శాయి. ఆమె కళ్ళలో తిరిగిన నీళ్ళు చెక్కి ళ్లపై జారకముందే చప్పున కరిగిపో యాడు అరవింద్.

"లేకపోతే ఏమిటి సింధూ. నువ్వే చెప్పు. నేనెంత ప్రేమగా, ముచ్చటపడి తెచ్చానో తెలుసా? అలాంటిది నువ్వు తీసేస్తానంటే నాకెలావుంటుంది చెప్పు"

ఆమె ముఖాన్ని తన చేతుల్లోకి తీసు కుంటూ అడిగాడు.

"నిజమే కానీ నువ్వూ నా పరిస్థితి అర్థం చేసుకోవాలి. నేనేమన్నా లక్షాధికార్ల అమ్మా యినా? ఈ రింగ్ నాకు నచ్చింది. సర దాగా కొనుక్కున్నాను అని తేలిగ్గా చెప్పేయ డానికి. మామూలు మధ్యతరగతి కుటుం బాల్లో యిలాంటివి ఎంత అలజడి సృష్టి స్తాయో తెలుసా నీకు"

"అబ్బబ్బ, అన్నింటికీ ముందే వూహించే సుకుని భయపడుతుంటావు. అసలెందుకీ ముసుగులో గుద్దులాట. మా నానమ్మతో చెప్పి పెళ్ళి మాటలకు మీ యింటికి పంపిం చమంటావా చెప్పు" అడిగాడు.

"మీనానమ్మ అంత తేలిగ్గా చెప్పగానే ఒప్పేసుకుంటుందంటావా? "

"సినిమాలు, నవలలు చదివి యిలా మాట్లాడుతున్నావు. ఎప్పుడూ ఓ అమ్మాయి అబ్బాయి ప్రేమించుకుంటే ఖచ్చితంగా వాళ్ళ యిళ్లల్లో వాళ్ళు ఒప్పుకోరనే ఎందుక నుకుంటున్నావు? " చిరాగ్గా అన్నాడు.

"ఎందుకా రిస్కంతా. ఒక్క ఆరు నెలలే కదా ఆగమంటున్నాను. అయినా ఈ విషయం వూరికే మాట్లాడవద్దన్నానా, మనమెప్పుడు కలుసుకున్నా యిదే టాపిక్ రావాలా? "

"అంటే మన గొడవ తప్ప వేరే ఏదన్నా మాట్లాడమంటావు"

"అవును"

"సరే, ఏం మాట్లాడుకుందాం! రాబోయే ఎన్నికల్లో ఏ పార్టీ పవర్‌లో కొస్తుందో చర్చి ద్దామా? రాజకీయాలొద్దంటే రాజన్‌పిళ్లై మరణమో, నయనాసాహ్నిహత్యో, ఇవీ



వద్దంటే ఎకనామిక్స్ కొద్దాం బాంబే స్టాక్ ఎక్స్‌చేంజ్‌కి ఏమయింది. ఒక్కసారిగా యీ మధ్య షేర్స్ ధరలన్నీ డౌన్ ఎందుక య్యాయనో, అదీ వద్దంటే అయిశ్వర్యా రాయ్, ప్రభుదేవాతో నటించేందుకొచ్చిన ఆఫర్ ఒప్పుకుంటుందా లేదాని, లేదు, ప్రణయ్‌రాయ్, ఇమ్రాన్‌ఖాన్, మాధురీదీక్షిత్, హుసేన్, యంగస్ట్ డాక్టర్ బాలమురళీ కృష్ణ? ఎవరిగురించి మాట్లాడుకుందాం? "

గడగడా చెప్పుకుంటూ వస్తున్న అతన్ని చూసి నవ్వేసింది సింధూర.

"నీతో మాట్లాడటం కష్టం!"

"ఇష్టంలేనపుడే కష్టం కలుగుతుంది"

"అదేమోకానీ యిలాగే మాట్లాడుతూ కూచుని యింటికి వెళ్ళడం లేటయితే కారణం చెప్పడం కష్టం" అన్నది లేస్తూ. అంతవరకూ తన గుప్పెట్లో వున్న ఉంగరాన్ని హేండ్‌బేగ్‌లోపల దాచేస్తూ.

"హతవిధీ! దానికీ నాకూ యింకెప్పుడో కదా విముక్తి!" కాస్త డీలాగా అంటున్న అరవింద్‌ని చూసి ప్రేమగా నవ్వింది సింధూర.

చేయిచేయి పట్టుకు నడుస్తూ కొద్ది దూరం వచ్చాక ఎందుకో యధాలాపంగా పక్కకు చూసిన సింధూర అక్కడ కూచుని వున్న జంటను చూసి షాక్ తిన్నట్లు కొయ్యబారిపోయి అలా నిల్చుండిపోయింది.

వాళ్ళిద్దరూ ఆనందరావు, ప్రమద్వర!

సింధూర చూసిన వంకే తానూ చూస్తూ మెల్లగా అడిగాడు అరవింద్.

"సింధూ, మీ నాన్నగారు కదూ? !"

"అ... అవును!" తడబడుతూ చెప్పింది సింధూర.

"ఆ పక్కనున్నావిడ? "

"ప్రమద్వరట. నటి అని ఓసారి మా ఇంటికి తీసుకొచ్చి పరిచయం చేశారు మానాన్న" వాళ్ళ కంటపడకుండా చెట్లపక్క నుంచి వడివడిగా నడుస్తూ చెప్పింది.

"పేరు తమాషాగా వుంది. అయినా ఈ వయసులో మా మామగారు ప్రేమలో పడ్డారులా వుంది? "

నవ్వుతూ అంటున్న అతనివంక కోపంగా చూసింది సింధూర.

"ఓ ఆడామగా కలిసి మాట్లాడుకుంటూంటే యిక ఆ రకంగా అనుకోవలసిందేనా? " తీక్షణంగా అడిగింది.

నవ్వేడు అరవింద్. "మనద్దరినీ యిప్పుడు మనకి తెలిసిన వారెవరైనా చూస్తే ఏమనుకుంటారు? మనం ప్రేమికులం కాక స్నేహితులమే అయితే అదిగో పార్క్‌లో అందరిలో అక్కడ కూర్చోక ఈ మూలమూలలకి వెతుక్కుంటూ రావడం ఎందుకు"

"నిజమేకదా. నాన్న మామూలుగా ఏదో ఆవిడతో మాట్లాడేందుకే అయితే ఈ మూల కూర్చోవటం ఏమిటి? " జవాబు చెప్పలేనట్లు కామ్‌గా వుండిపోయింది సింధూర.

ఆమె బాధ పడుతూందని గ్రహించి తానూ కామ్‌గా నడవసాగాడు అరవింద్. లోలోపల అతనికీ ఆనందరావు ధోరణి మాత్రం ఆశ్చర్యంగా తోచసాగింది.

అయితే ఆనందరావు, ప్రమద్వరలను చూసి వీళ్ళు షాక్ తిన్నట్లే మరో వ్యక్తి అటు వాళ్ళను, యిటు వీళ్ళిద్దరినీ కూడా చూసి నిర్ఘాంతపోయాడని వీళ్ళకు తెలియదు.

అతను సంజయ్.

★ ★ ★

ఆరోజు సంజయ్ ప్రశాంతత కోసమనీ, చల్లగాలికి బాగుంటుందనీ పార్కుకొచ్చాడు. అతను ఎప్పుడూ వెళ్ళి కూచునే మందిరంలో ఏదో పండుగ సందర్భంగా వుత్స

వాలు జరుగుతూండటంతో జనం ఎక్కువై ప్రశాంతత లోపించి యిలా వచ్చాడు. జనం మధ్యలో కాక జనానికి, సందడికి కాస్త దూరంలో అయితే నిశబ్దంగా వుంటుందని కొంచెం లోపలగా నడిచి అనువైన ప్రదేశాన్ని వెదుక్కుంటున్న అతను ముందుగా సింధూర, అరవింద్‌లను చూశాడు. చెల్లెలు అలా తమ ఎదురింటి లెక్చరర్ కుర్రాడితో కలిసి యిలా పార్కుల వెంట తిరగటం అతనికి ఎంతైనా కోపం తెప్పించింది. కానీ సహజంగా ఆవేశపరుడు కాకపోవటంవలన తర్వాత ఈ విషయం తల్లీ తండ్రితో చెబితే వాళ్ళే దీనికో పరిష్కారం చూస్తారు అన్న ఆలోచనతో ముందుకి నడిచాడు అన్యమనస్కంగానే. అయితే అక్కడ ప్రమద్వరతో సన్నిహితంగా కూచుని ఆనందంగా కబుర్లు చెపుతున్న ఆనందరావుని చూసి నోట మాట రానట్లు నిలుచుండి పోయాడోక్షణం.

ముందు తాను చూస్తున్నది తన తండ్రినేనా అన్న సందేహంతో తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. చెల్లెలి విషయం తండ్రితో చెప్పాలనుకున్నాడు కానీ యిపుడు తండ్రి విషయం ఎవరితో చెప్పాలో అర్థంకాలేదు. తల్లికీ విషయం తెలిస్తే... ఆ ఆలోచనే నచ్చలేదతనికి. "పొద్దున లేస్తే తన పిల్లలు, భర్త, సంసారం అన్న తాపత్రయం తప్ప మరో లోకం ఎరుగని తన తల్లి యిపుడీ వయసులో తన భర్త పరాయిస్త్రీ వెంట తిరుగుతున్నాడంటే విని తట్టుకోగలదా! అయినా ఏమిటి తండ్రి వ్యవహారం? పెళ్ళయిన కూతుళ్ళు, మనవలు, మనవరాలు వున్నారు. ఇదేం బుద్ధి?

ఛఛ! తాననవసరంగా తండ్రినపార్థంచేసుకుంటున్నాడేమో ఏదో ఓ చోట కూచుని కాస్త సన్నిహితంగా ఓ స్త్రీతో మాట్లాడుతున్నంత మాత్రాన యిలా అనుమానించాల్సిందేనా? కానీ... కానీ ఎందుకో ఏదో అసహజత్వం వుంది. ప్చ్ ఏమిటీ మనుషులు, ఏమిటీ మోహాలు, వ్యవహారాలు? ఇది తప్ప మానవజీవితానికి మరో యావే లేదా? "

చెల్లెనీ, తండ్రినీ చూసి ముందు ఆగ్రహం, ఆవేశం కలిగాయి కానీ, కొద్దిసేపటికే ఆ భావాలన్నీ పోయి క్రమంగా అతనిలో గాఢమైన ఓ నిర్లిప్తత చోటుచేసుకుంది.

"ఇంతే. మనుషులందరూ యింతే. విలువైన మానవజీవితాన్ని యీ రాగద్వేషాలకే అంకితం చేసుకుంటారు. వాటితోనే అంతం చేసుకుంటారు వ్యర్థంగా. తనూ యీ మనుషుల మధ్యే వుంటే వీరి ప్రభావమే తనపైనా పడుతుందేమో? ఎటైనా వెళ్ళిపోవాలి దూరంగా..."

ఆ నిర్ణయంలోనే ఆవేళ యిల్లు చేరాడు సంజయ్. రావటం రావటం తన గదిలోకి వెళ్ళి ఎప్పుడూ భుజాన వుంచుకునే చేతిసంచిలో ఓ జత బట్టలు, మరేవో పుస్తకాలు సర్దుకుని తల్లిదగ్గరకు వచ్చి నిలుచున్నాడు.

"ఏరా నాన్నా, అన్నం పెట్టేదా? " పొద్దున్న టిఫిన్‌కి పిండి కలుపుతున్న అరుంధతి కొడుకుని చూసి అడిగింది.

"వద్దమ్మా. ఆకలిగా లేదు. నేను... నేను వూరికి వెడుతున్నానమ్మా" మెల్లగా అన్నాడు.

అప్పుడుగానీ అతని భుజాన సంచిని చూడలేదు ఆవిడ.

"అదేమిట్రా, ఏవూరు? " హఠాత్తుగా యిదేమిటనుకుంటూ తెల్లబోతూ అడిగింది.

"ఏమో, ముందు తిరువణ్ణామలై వెడదామనుకుంటున్నాను. అటు తర్వాత... యిప్పుడే చెప్పలేను" అరుంధతి కొడుకు మాటలకిప్పుడు పూర్తిగా అయోమయం అయింది. "ఏమిట్రా సంజూ, ఏమిటి నువ్వు చెప్పేది? " ఒక్కసారిగా కళ తప్పిన ముఖంతో అడుగుతున్న తల్లిని చూస్తే

సంజయ్‌కెంతైనా జాలి కలిగింది.

"ఎంత పిచ్చి అమ్మ! ఆ దేముడు తల్లుల మనసుల్లో యింత మమత నెందుకు పెట్టాడు? "

మరుక్షణం ప్రమద్వరతో నవ్వుతూ మాట్లాడుతూ యీ లోకాన్నే మరిచినట్లున్న తండ్రి ముఖం గుర్తొచ్చింది.

"అమ్మా!" ఎందుకోగానీ కళ్లలో నీళ్ళు తిరిగాయి. ఆ కన్నీళ్ళు కనిపించకుండా చప్పున ముందుకు వంగి అరుంధతి పాదాలకు నమస్కరించి, లేచి "నేను వెళ్ళొస్తానమ్మా" అన్నాడు.

ఆవిడకిదంతా ఏదో కలలా వున్నట్లుంది. ఆ కలలోనే తెప్పరిల్లుతూ "మళ్ళీ ఎప్పుడొస్తావురా" అడిగింది.

"వస్తాను, నిన్ను చూడాలనిపించగానే" అంటూ వడివడిగా అడుగులు వేస్తూ వెడుతున్న కొడుకు వెనుకే వచ్చి చెయిపట్టి ఆపుతూ అన్నది.

"అన్నం వద్దంటున్నావు. పోనీ పాలైనా తెస్తానాగు" అంటూనే వెళ్ళి గిన్నెలోంచి పెద్దగ్లాసుడు పాలు వంపి చక్కెర కలిపి తీసుకొచ్చింది.

అప్పుడతనికి తాగాలని లేకపోయినా వద్దనలేకపోయాడు. కామ్‌గా గ్లాసందుకుని గడగడా తాగేశాడు.

"త్వరగానే వచ్చేస్తావు కదూ... ఆ, ఆగు, మరి డబ్బులవీ తీసుకోలేదేం? " అని వెళ్ళి బీరువా తెరిచి అప్పటికి యింటి ఖర్చులకని వుంచిన మొత్తాన్ని తెచ్చి చేతిలో పెట్టింది. ఆమెకు బాగా తెలుసు. సంజయ్ ఏదన్నా అన్నాడంటే యిక అంతే! చిన్నప్పట్నుంచీ కూడా ఏ విషయంలో అయినా తనేం చేయదలుచుకున్నాడో అదే చేస్తాడు కానీ ఎవరి మాట విని మనసు మార్చుకోడు.

ఇంకా అక్కడే వుంటే తల్లి ముఖం తననెక్కడ కట్టిపడేస్తుందో అన్నట్లు మరిక వెనుదిరిగి చూడకుండా వడివడిగా నడుస్తూ వెళ్ళిపోయాడు సంజయ్.

అరుంధతి కొడుకు కనిపించినంత దూరం చూస్తూ అలాగే వుండిపోయింది. అదంతా కల అనుకునేందుకు వీలు లేకుండా చేతిలోని ఖాళీ పాలగ్లాసు అంతా వాస్తవమేనంటూ సాక్ష్యమిస్తోంది.

ఆమెకెందుకో గుండెదడగా అనిపించింది. మెల్లగా అడుగులు వేసుకుంటూ వచ్చి హాల్లో సోఫాలో వాలిపోయింది నిస్సత్తువగా.

మరో పదినిముషాలకి యిల్లు చేరిన సింధూర తల్లినలా చూడగానే కంగారుగా దగ్గరకొచ్చింది.

"అమ్మా... అమ్మా" ఆదుర్దాగా పిలిచింది.

"ఆ!" నీరసంగా కళ్ళు తెరిచింది అరుంధతి.

"ఏమిటమ్మా ఏమయింది? ఒంట్లో బాగు లేదా? " పక్కన కూచుంటూ అడిగింది.

"ఏం లేదు కాస్త దడగా వుంటే వచ్చి పడుకున్నా అంతే. కొంచెం మంచినీళ్ళివ్వు"

పరుగున వెళ్ళి ఫ్రిజ్‌లోంచి చల్లని నీళ్ళు తెచ్చిచ్చింది సింధూర. ఆ నీళ్ళు తాగి అలాగే వెనక్కి వాలి పడుకుంది అరుంధతి సింధూ చేయిపట్టుకునే.

"ఏమయింది అమ్మకి? కొంపదీసి నాన్న విషయం తెలిసిపోయిందా? " అప్పటికి తన విషయం మరిచిపోయింది సింధూర.

"అమ్మా" మెల్లగా పిలిచింది. "డాక్టర్ దగ్గరకు వెళదామా? " అడిగింది.

అలాగే కళ్ళు మూసుకునే చెప్పింది అరుంధతి "ఏం లేదు. వూరికే కంగారుపడకు. ఇందాక మీ అన్నయ్య వచ్చి హఠాత్తుగా వూరికి వెడుతున్నా అన్నాడు. ఏ వూరు? మళ్ళీ ఎప్పుడు వస్తావు? అనడిగితే

ఏమో అన్నాడు. ఏమిటో మళ్ళీ వాడిని ఎప్పుడు చూస్తానో అని ఎందుకో బెంగగా అనిపించి యిలా వచ్చి పడుకున్నా అంతే. మరేం లేదు"

"అన్నయ్యా... ఎక్కడికో వెళ్ళి పోయిన ట్లేనా? "

సింధూరకు మనసంతా భారంగా తోచింది. ఇందాక తండ్రి ప్రవర్తన, యిప్పుడిలా అన్నయ్య వూరు వెళ్ళడం, తల్లి విచారం అంతా ఏమిటో వెలితిగా తానొంటరిగా అయినట్లు తోచింది సింధూరకు.

ఆ రాత్రి బాగా పొద్దుపోయాకగాని యిల్లు చేరలేదు ఆనందరావు.

చదువుకుంటూ కూర్చుని వున్న సింధూరే వెళ్ళి తలుపు తీసింది.

"అమ్మకి ఒంట్లో బాగులేదుట. పడుకుంది. అన్నం వడ్డించనా? " అడిగింది.

"వద్దు. నేను భోంచేసాను. నువ్వు చదువుకో!" అనేసి తను పడుకునేందుకు వెళ్ళిపోయాడు.

తల్లికి బాగులేదు అని చెప్పినా కనీసం ఏం బాగాలేదు అని కూడా తండ్రి అడగక పోవటం బాధనిపించింది సింధూరకు. అంతేకాదు అతనెక్కడ భోంచేసివుంటాడో వూహించటంతో కోపమూ వచ్చింది. ఆపై యిక చదువుపై మనసు నిలవకపోవటంతో లైటు తీసేసి తనూ వెళ్ళి పడుకుంది.



అరుంధతి స్వగ్రామంనుంచి తెలిసినవాళ్లు వస్తుంటే ఆమె అన్నగారు ఊరగాయలకని నిమ్మకాయలు పంపించారు. అందులోంచి కాసిన్ని తీసి ఓ ప్లాస్టిక్ బుట్టలో వేసుకుని వజ్రమ్మగారికిద్దామని ఎదురింటికి తనే స్వయంగా వచ్చింది అరుంధతి.

ఈమధ్యకాలంలో రెండిళ్ల మధ్యా బాగా స్నేహమయింది.

"ఏం చేస్తున్నారు పిన్నిగారూ? " అంటూ అరుంధతి రావటం చూసి, "రామ్మా, రా, ఆ ఏముంది ఏవో జమాలెక్కలు"

వజ్రమ్మ ఆప్యాయంగా ఆహ్వానించిరది.

"ఇదో మా వూరినుంచి నిమ్మకాయలు తెచ్చారు. మీరూ పచ్చడి పెట్టుకుంటారుక దాని తెచ్చాను. మావైపు నిమ్మకాయలకు ప్రసిద్ధిలెండి". నిమ్మకాయలు అందించింది అరుంధతి.

"నిమ్మకాయలా! భలేదానివే. మాకూ బోలెడు తోటలున్నాయికదా. ఇంతకీ మావైపు నిమ్మకాయల తోటలున్నాయంటు న్నావు. ఏవూరు మీది? ఎప్పుడూ మీ స్వగ్రామం గురించి అడుగుదామనుకుం టూనే వుంటాను. ఇంకేవో మాటలొస్తాయి"

"గూడూరు పక్కనలెండి. నెల్లూరు జిల్లా"

ఆవైపు ఆవిడకి సరిగా తెలిసుండకపోవచ్చని అన్నది అరుంధతి.

"గూడూరా? మా వూరు అక్కడేగా" ఆవిడ కంఠంలో సంతోషం తొంగిచూసింది.

అరుంధతి తమ గ్రామం పేరు చెప్పింది.

"ఆ వూరి పక్కకే మా వూరూ..." పేరు చెప్పబోతూ ఏదో గుర్తొచ్చి ఆగిపోయింది వజ్రమ్మ.

"నీ పేరు అరుంధతికదా అన్నావు. మీ నాన్నగారి పేరు? " తన తండ్రి ఆమెకూ తెలిసుండవచ్చన్న వూహతోనూ, ఎప్పుడూ తండ్రి పేరు తలుచుకోగానే కలిగే గౌరవభావంతోనూ ఆమె మాటలు పూర్తికాకుండానే చప్పున చెప్పింది అరుంధతి.

"మా నాన్నగారి పేరు సంజీవయ్యగారు. ఆయన పేరే మా అబ్బాయికి పెట్టుకున్నాం. మా నాన్నగారు గొప్ప జ్యోతిష్కులు. ఆ చుట్టుపక్కలన్ని గ్రామాల్లోనే కాదు, రాష్ట్రమంతా కూడా ఆయన పేరు

వినేవుంటారు..."

అరుంధతి ఉత్సాహంగా ఇంకా ఏదో చెపుతూనే వుంది.

"ఆపు" అంటూ గట్టిగా అరిచింది వజ్రమ్మ.

నివ్వెరపోయింది అరుంధతి.

"తెలుసు. అందరికీ ఏమోకానీ సంజీవయ్య గురించి నాకు బాగా తెలుసు. సంజీవయ్య కూతురివా నువ్వు? ముందు నువ్వు బయటికి వెళ్లు. ఇంకెప్పుడూ మీరెవ్వరూ మా ఇంటికి రావద్దు"

చేతిలోని నిమ్మకాయల బుట్టను గుమ్మంలోంచి విసిరేస్తూ కఠినంగా అన్నది వజ్రమ్మ.

బిత్తరపోయింది శాంతస్వభావం కల అరుంధతి. పుట్టిబుద్ధెరిగాక ఇన్నేళ్ళ వయసులోనూ ఎప్పుడూ ఎవరినుంచీ అలాంటి అవమానాన్ని పొందలేదామె. అసలెవరైనా అంత కోపంగా తనను ఇంట్లోంచి వెళ్లమని అనగలరని వూహించనుకూడా లేదు. అదీ తండ్రి పేరు విన్న తర్వాత. ముందు తాను వింటున్నదీ, చూస్తున్నదీ కలో, నిజమో కూడా ఓ క్షణం అర్థం కాలేదు.

అంతా వాస్తవమేనన్నట్లు కళ్లముందే తను తెచ్చిన నిమ్మకాయల బుట్ట వీధిలోకి విసిరివేయబడి వుంది. వాకిట్లోంచి రోడ్డు దాకా కాయలు చెల్లాచెదురుగా పడివున్నాయి. ఇంకా అపనమ్మకంగా కళ్ళింత చేసుకుని వజ్రమ్మవైపు చూసింది.

"ఊ, ఇంకా కదలవేం?" అన్నట్లు రౌద్రంగా చూస్తోందామె.

"ఏమిటిది? ఇంత మంచిగా వున్నయీమె. సడన్‌గా..." బాధ, అవమానంతో కళ్లలో గిర్రున నీళ్లు తిరుగుతుండగా రివ్వున ఎదురుగా వున్న తమ ఇంట్లోకి వచ్చి చేరింది అరుంధతి.

అప్పుడే కాలేజినుంచి ఇళ్లకు వస్తున్న సింధూర, అరవింద్ ఇద్దరూ అలాగే ఎవరి గుమ్మాల దగ్గర వారు (బ్రమ్మపడిపోయినట్లు నిలుచుండిపోయారు ఓ క్షణం.

"అమ్మా, అమ్మా ఏమయింది?" ఆందోళనగా అడుగుతూ తల్లి వెనుకే వడివడిగా వచ్చింది సింధూర.

అరుంధతి సంజీవయ్యగారి గురించి చెపుతున్నప్పుడే గేటు తీసుకుని లోపలకి వస్తున్నాడు అరవింద్.

ఆ తర్వాత జరిగినదంతా కళ్ళారా చూశాడు.

అసలు నాయనమ్మకి హఠాత్తుగా అంత కోపం రావటమేమిటో అతనికి అంతుపట్టలేదు. అతనికి వూహ తెలిసీ అంత కోపంగా వజ్రమ్మనెప్పుడూ చూడలేదు. అంతగా అరవటం, ఇంటికి వచ్చిన పెద్దమనిషిని అలా అవమానించటమూ తెలియదు. అతనికిదంతా తల దిమ్మెక్కిపోయినట్లయింది.

తేరుకుని అరుంధతివైపు అడుగులు వేయబోయేంతలో ఆమె అతన్ని దాటుకుని విసురుగా వెళ్ళిపోయింది.

ఆమె అలా వెళ్ళటంతో కోపంగానూ, ఆవేశంగానూ వజ్రమ్మ దగ్గరకెళ్లి అడిగాడు అరవింద్.

"నానమ్మా ఏమిటిది? నీకేమన్నా పిచ్చి పట్టిందా? ఎందుకలా అరిచావు. ఆమె ఏమనుకుంటారు?"

"ఏమిటి అనుకునేది? నా కడుపులో చిచ్చుపెట్టి నా ఇంటి దీపాన్ని ఆరిపోతుందని చెప్పారే! అప్పుడు నేనేమనుకున్నాను. ఇదో వింటూ, నీకీ విషయాలేవీ తెలియవు. నువ్విందులో తలదూర్చకు"

ఆవిడ శాసించినట్లే అని తన గదిలోకి వెళ్లి తలుపు వేసేసుకుంది.

అరవింద్ నిస్త్రాణగా అక్కడ వున్న సోఫాలో కూర్చుండిపోయాడు.




"ఏమిటి? నానమ్మకేమయింది. ఇంటి దీపమేమిటి? ఇదంతా ఏమిటి, ఎక్కడకు పోతుందీ గొడవ? "

అలా ఎంతసేపు కూర్చున్నాడో అతనికే తెలియదు. హఠాత్తుగా ఏదో ఆలోచన వచ్చినట్లయి లేచి గబగబా ఎదురింట్లోకి నడిచాడు.

అరుంధతి హాల్లోనే ఎప్పుడూ ఆనందరావు కూర్చునే వాలుకుర్చీలో కూర్చుని వుంది. ముఖాన మోచేయి అడ్డుపెట్టుకుని కళ్లు మూసుకుని వున్నామె వాకిట్లో చెప్పుల అలికిడికి చేయి తొలగించి చూసింది.

"నేను... నేను మా నాన్నమ్మ తరపున క్షమాపణ అడిగేందుకొచ్చాను. హఠాత్తుగా ఆమెకేమయిందో తెలియదు. ఏమయినా, ఆమె మిమ్మల్నిలా అని వుండాల్సింది కాదు"

అతని మాటలు ఇంకా కొనసాగుతుండగానే చప్పున చేతులు జోడించింది అరుంధతి.

"అయిందేదో అయిపోయింది. మర్యాద అనేది ఇచ్చిపుచ్చుకోవాల్సిందని విద్యావంతుడివి నీకు చెప్పక్కరలేదు. ఇక ఈ రెండు ఇళ్ళమధ్య మాటలు, మన్ననలు ఏమీ అక్కరలేదు" నిష్కర్షగా అనేసి లేచి లోపలి గదిలోకెళ్ళిపోయింది.

అక్కడే వున్న సింధూర దిగులు కళ్ళతో అరవింద్ వంక చూసింది. తలవంచుకుని కామ్‌గా తమ ఇంటికి వచ్చేశాడు అరవింద్.

★ ★ ★

ఆ రాత్రి అరవింద్ భోజనం చేయలేదు. మామూలుగానే వజ్రమ్మ రాత్రిపూట భోజనం చేయదు. ఓ గ్లాసు మజ్జిగ తాగుతుంది. ఆమెది ఒంటిపూట భోజనమే. రాత్రికి అరవింద్‌కి మాత్రం వంటచేసి అన్నీ డైనింగ్ టేబుల్‌పై సర్దేసి వెళ్ళి పడుకుంటుంది. పుస్తకాలు చదువుకుంటూనో, టీవీ చూస్తూనో ఏ పదింటికో తనే వడ్డించుకుని తిని పడుకుంటాడు అరవింద్.

మరునాటి ఉదయం టేబుల్‌పై రాత్రి ఎలా పెట్టిన గిన్నెలు అలానే వుండటం చూసి బాధపడింది వజ్రమ్మ. ఆరోజు ఆదివారమే అయినా త్వరత్వరగా టిఫినదీ సిద్ధం చేసి మనవడ్ని పిలిచింది తినేందుకు.

అరవింద్ టిఫిన్ కాదుకదా కాఫీ కూడా తాగలేదు. నాలుగైదుసార్లు పిలిచినా రాకపోయేసరికి "రాత్రి కూడా అన్నం తినలేదు. ఆకలి వేయటంలేదూ. ముసలిదాన్ని నాకు ఆకలివేస్తోంది. రా యిద్దరం తిందాం" పిలిచింది.

"నువ్వు తిను. నాకక్కరలేదు" అన్నాడు ముభావంగా.

పది, పదకొండు, పన్నెండు దాటి మధ్యాహ్నం భోజనాలవేళ కూడా అయింది. అప్పుడు పిలిచినా అదే సమాధానం రావటంతో కోప్పడింది వజ్రమ్మ.

"ఎందుకురా నన్నిలా సాధిస్తున్నావు? ఇప్పుడేమయిందని ఇలా నిరాహారదీక్షలు చేస్తున్నావు? చిన్నపిల్లాడిలా అన్నం వద్దంటూ ఏమిటిది? "

"ఏమిటా? ముందిది చెప్పు. నిన్న ఆవిడనలా ఎందుకు అవమానించి వెళ్ళగొట్టావు? " అడిగాడు.

"కారణం వుంది కనుక" ఆ విషయం గుర్తొచ్చి మళ్ళీ కఠినంగా అన్నది వజ్రమ్మ.

"నాకా కారణం తెలియాలి" మొండిగా అన్నాడు అరవింద్. మనవడి తత్వం తెలిసిన వజ్రమ్మ మరేం చెప్పి లాభం లేదన్నట్లు నిస్సహాయంగా చూసింది.

"సరే చెప్తాను. ముందు భోంచేద్దాంరా" అనక తప్పలేదు.

అరవింద్ లేచాడు వజ్రమ్మ మాటంటే మాటేనని తెలిసినవాడు కనుక.

ఏవో నాలుగు మెతుకులు తిన్నానంట

తిన్నాననిపించుకుని,

"ఇప్పుడు చెప్పు" అన్నాడు అరవింద్.

ఆవిడ కూడా మొక్కుబడిగానే భోంచేసి వచ్చి తన గదిలో పడక్కుర్చీలో పడుకుంది.

"విషయం చెప్పమంటే ఇలా వచ్చేశావే మిటి?" వెనుకనే వచ్చిన అరవింద్ అడిగాడు.

"అది ఒక్క మాటలో చెప్పేదికాదు

"సరే, సావకాశంగానే చెప్పు. నేనిప్పుడెక్కడికీ వెళ్ళాల్సిన పనిలేదు" బుద్ధిమంతుడిలా నానమ్మ కాళ్ళ దగ్గర కూచుంటూ అడిగాడు.

"అరుంధతి తండ్రి పేరు చెప్పగానే నాకెందుకంత కోపం వచ్చిందో చెప్పాలంటే ముందు నీకు నా గురించీ పూర్తిగా చెప్పాలి"

ఆవిడ వెనక్కి వాలి కళ్లు మూసుకుని కొద్దిసేపు మౌనంగా వుండిపోయింది.

ఆమె ఏ జ్ఞాపకాల తెరలు దాటి వెళుతోందోనని డిస్టర్బ్ చేయకుండా అలాగే వెయిట్ చేయసాగాడు అరవింద్.

నెమ్మదిగా చెప్పడం మొదలుపెట్టింది వజ్రమ్మ.



"నాకు నా పధ్నాలుగోఏటే వివాహం జరిగింది. పదహారోఏట మీ నాన్న పుట్టాడు. మీ నాన్నకి ఏడాది కూడా నిండలేదు. మీ తాతయ్య చనిపోయారు. ఆయనకి తోబుట్టువులెవరూ లేరు. వారి తల్లితండ్రులకి వృద్ధాప్యంలో కలిగిన ఏకైక సంతానమట ఆయన. మా మామగారు ఆయన చిన్నప్పుడే చనిపోయారుట. పదిహేడేళ్లకే నా నెత్తిన మోయలేని బరువు బాధ్యతలు పడ్డాయి. చేతిలో నెలల పసివాడు, ఇంట్లో రోగిష్టిముసలి అత్తగారు, బంగారం పండే పొలాల్ని, వ్యవసాయాన్ని ఏలాగోలా తమ చేత చిక్కించుకోవాలని చూసే బంధుజనం అందరితో ఎలా నెట్టుకొచ్చానో, ఆస్తినీ, ఇంటి పరువునీ ఎలా కాపాడుకుంటూ వచ్చానో ఆ భగవంతుడికే తెలుసు.

కానీ మొత్తానికి అందరిలో వజ్రమ్మ అంటేనే గయ్యాళిగంప అనీ మొగరాయుడనీ అనుకునే పేర్లూ నాతోనే పెరుగుతూ వచ్చాయి. మీ నాన్నకి పెళ్లీడు వచ్చింది. వ్యవసాయపు పనులు మెల్లగా మీ నాన్నే చూసుకోసాగాడు. సంసారపు జంజాటంలోంచి కాస్త కాస్త విముక్తి దొరకబోతోందని ఎంతో సంతోషపడ్డాను.

మీ నాన్నకి మంచి సంబంధం చూసి పెళ్లి చేస్తే దీపంలాంటి పిల్ల ఇంటికి కోడలుగా వచ్చి ఇల్లు మనవళ్లు, మనవరాళ్లతో కళకళలాడుతూంటే చూసి కళ్లు మూద్దామని ఆశపడ్డాను. మంచి సంబంధాలకై అందరితో చెప్పడం మొదలెట్టాను. చెప్పిన వారంతా చాలా సంబంధాలు తెచ్చారు. అందరిలోకి నాకు నచ్చిన సంబంధం సంజీవయ్య కూతురు అరుంధతి"

ఆపై చెప్పడం ఇష్టం లేనట్లు ఆగిపోయింది వజ్రమ్మ. అరవింద్‌కు చెప్పరానంత ఆశ్చర్యం కలిగింది. సింధూర తల్లి అరుంధతమ్మను తన తండ్రికివ్వాలనుకున్నారా? మరెందుకు జరగలేదా పెళ్ళి?"

తర్వాతేమైందో వినాలని ఆపుకోలేనంత కుతూహలంగా వున్నా శాంతంగా నానమ్మనే చూస్తుండిపోయాడు.

కొద్దిసేపు అలాగే కళ్లలో తొణికిసలాడే నీళ్లతో మౌనంగా వుండిపోయిన వజ్రమ్మ మళ్ళీ గొంతు విప్పింది.

"మధ్యవర్తి చేత కబురు పంపాను. ముందు మనస్థాయికి తగ్గట్లు కట్నకాను కలు, బంగారమూ ఇవ్వలేమని భయప డ్డారు. మంచి కుటుంబం, అందమూ, అణు కువ గల అమ్మాయి కోడలు కావాలనుకు న్నానే కానీ కట్నకానుకలు మా కక్కరలేదనీ, పెళ్లిచూపులకి మంచిరోజు చూసుకుని రాబో తున్నామనీ చెప్పి పంపాను. అలాగే కాని వ్వమనీ కానీ ముందుగా ఓసారి అబ్బాయి జాతకం చూడాలన్నాడు సంజీవయ్య.

సంజీవయ్య గొప్ప జ్యోతిష్ శాస్త్రపండి తుడు. ఆయన చెప్పే జ్యోతిష్యం కోసం ఎక్కడెక్కడినుంచో జనం వస్తారని విన్నాను. ఆయన ఎవరి జాతకమైనా సరే చూసి ఓ మాట చెప్పాడంటే ఆరునూరైనా అది జరిగి తీరుతుందంటారు. గొప్ప దేవీ ఉపాసకుడు కూడానట. ఆయన పాండిత్యం విన్నందువలనే మధ్యవర్తిచేత మీ నాన్న జాతకం పంపాను. నిజానికి అప్పటివరకూ మన ఇంట్లో జాతకాలు చూపించటమనే అలవాటు లేదు. పుట్టిన తేది, నక్షత్రం వ్రాసి పంపించానంతే. దాని ప్రకారం సంజీ వయ్యగారినే జాతకం వ్రాయమన్నాను.

మీ నాన్న జాతకం చూసిన సంజీవయ్య ఈ సంబంధం తనకిష్టం లేదనీ మా అమ్మా యిని చూసుకోనురానవసరంలేదనీ కబురు పంపించారు.

నేను ముందు నివ్వెరపోయాను. లక్షల ఆస్తికి ఒక్కగానొక్క వారసుడు. అందగాడు, బుద్ధిమంతుడు అయిన నా కొడుక్కి ఏం తక్కువని ఆయన పిల్లనివ్వనన్నాడు? నేను సరేననాలే కానీ నా కొడుక్కి అమ్మాయిని స్తామని వచ్చేవాళ్లు బోలెడుమంది వున్నారు. ఎందరో లక్షాధికార్ల సంబంధాలు కాదని వాళ్ళ అమ్మాయిని అడిగితే తానే మా సంబంధం వద్దంటాడా? ఏం చూసు కుని అంత గర్వం? ఆగ్రహావేశాలతో మండిపడ్డాను. నాకు పంతమూ కలిగింది. కారణం చెప్పమని నేనే స్వయంగా బండిక ట్టించుకుని వారింటికి వెళ్ళి అడిగాను. అప్పుడు ఆయన చెప్పిన మాటకు నేను కుప్పకూలిపోయాను.

నా కొడుకు అల్పాయుష్కుడట. నీటిగం డంతో ముప్ఫయిఏళ్లు కూడా రాకముందే చనిపోతాడని చెప్పాడు. వంశానికి మిగిలిన ఒక్కగానొక్కడు. వాడిమీదే ఆశలన్నీ పెట్టు కుని బతుకుతున్న నేను ఆ మాట విని తట్టుకోలేకపోయాను.

"పొరపాటుగా చూసివుంటారు. మరో సారి నిదానంగా చూడండని" కన్నీళ్లతో అడి గిన నాకు, "ఈ సంజీవయ్య అన్నాడంటే అది బ్రహ్మవాక్కే. నేనే కాదు ఇంకెందరు మళ్ళీ మళ్ళీ చూసినా, ఎన్ని ప్రయత్నాలు చేసినా లేని ఆయుష్షును ఎవరూ పోయ లేరు!" అని తిరస్కారంగా అన్నాడు"

వజ్రమ్మ కంఠం దుఃఖంతో వణుకు తోంది. "నాకింకా తలచుకుంటుంటే ఆ సంభాషణంతా ఇప్పుడే జరిగినట్లుగా వుంది. నిజమే నా బిడ్డ అల్పాయుష్కుడే కావచ్చు కానీ ఓ కన్నతల్లిగా నేనడిగితే అత నావిధంగా, అహంకారంగా బదులివ్వ వచ్చా? అంతేనా, అతనివలనే ఆ మాట ప్రచారమై నీ తండ్రికి పిల్లనిస్తామని వచ్చిన వారంతా ముఖాలు చాటు చేసుకున్నారు.

కొండంత దుఃఖాన్ని కడుపులోనే దిగ మింగుకుని వాడికి పెళ్ళయి ఓ బిడ్డ అన్నా పుడితే వంశం నిలుస్తుందని ఆశపడి ప్రయత్నించాను. చూస్తూ చూస్తూ ఓ ఆడ పిల్లకు అన్యాయం చేస్తున్నానేమోననీ, నా జీవితమే తిరిగి నాకాబోయే కోడలికి పునరా వృత్తమవుతుందనీ తెలిసీ స్వార్థంతోనూ, ఓ రకంగా సంజీవయ్యమీద కసితోనూ నా



కొడుక్కి ఎలా అయినా త్వరలో పెళ్ళి చేయాలనుకున్నాను.

కానీ సంబంధాలు రావటమే కష్టమ యింది. సంజీవయ్య ఓపక్క తన కూతురికి మరో వరుడ్ని చూసి పెళ్ళి చేసేశాడు. అది నాకో సవాల్‌లా అనిపించింది.

చుట్టుపక్కల వూర్లలో అయితే విషయం తెలిసిపోయి ఎవ్వరూ పిల్లనివ్వ సాహసిం చటం లేదని జిల్లాలు దాటైనాసరే ప్రయ త్నించమని పెళ్ళిళ్ళ పేరయ్యతో చెప్పాను. మంచి సంబంధం కుదిరిస్తే నేను ఇస్తానని చెప్పిన డబ్బుకి ఆశపడి పెళ్ళిళ్ళ పేరయ్య ఎలాగో ఓ సంబంధం తెచ్చాడు. అమ్మాయి ఛామనచాయే అయినా కళకళలాడుతూ చక్కగా వుంది. చదువుకున్నదీ, తెలివి తేటలు కలది. అంతగా ధనవంతులు కాక పోయినా మంచి సాంప్రదాయంకల కుటుంబం.

నేను పెళ్ళి రహస్యంగానే చేయదల్చాను. ఓర్వలేని వారెవరైనా ఈ జాతకం సంగతి అమ్మాయి తరుపువాళ్లతో చెప్పి పెళ్లి చెడగొ డతారన్న భయంతో వివాహం తిరుపతిలో అతి నిరాడంబరంగా జరిపించాను.

కోడల్ని కాపురానికి తీసుకొచ్చిన తర్వాత మాత్రం వూరంతా పిలిచి వైభవంగా దంప తుల చేత సత్యనారాయణ వ్రతం చేయిం చాను. వ్రతానికి కార్డు వేయించి సంజీవ య్యకీ పంపించాను కావాలనే.

కార్డు చూసి ఆయన బిగ్గరగా నవ్వాడని పిలుపులకి వెళ్ళిన వాళ్ళు వచ్చి చెపితే తన కూతుర్ని ఇవ్వకపోయినా నా కొడుక్కి సల క్షణమైన పిల్లతో పెళ్ళి జరిగిందన్న కుళ్లుతో దాన్ని చాటుకోలేక, అలా హేళన చేసివుం టాడని అనుకున్నానే కానీ మీ అమ్మ నిన్ను కని పురిటి మంచంలోనే చనిపోయినరోజు తెలుసుకున్నాను ఆ నవ్వు కర్థమేమిటో.

"అర్థాయుష్కుడికి, అల్పాయుష్కురాలైన భార్య! జోడీ బాగానే కుదిరింది" అని నవ్వి వుండవచ్చుతడు.

కోడలి మరణంతో నాకు బ్రతుకంటేనే భయం పట్టుకుంది. ఎందుకీ తాపత్రయం? అంత విషం మింగి చస్తే ఏ దిగులు వుండ దుకదా అన్న విరక్తి కలిగేది, కానీ పొత్తి ళ్ళలో వున్న నిన్నేం చేసేది? నీ ఆలనా పాలనా ఎవరు చూస్తారు?

కోడలికి త్వరగా కడుపు పండితే నేనూ నా కొడుకు వున్నా లేకున్నా నా కోడలు నా యింటినీ, ఈ వంశాంకురాన్నీ కాపాడుకుం టుందనీ సంతోషించాను ముందు. కానీ నేను అనుకున్నదేమిటి? జరిగిందేమిటి? మా ఇద్దరికన్నా నేను కలలో కూడా వూహించనివిధంగా కోడలే అలా వెళ్ళిపోవ టంతో కృంగిపోయాను.

ఈ స్థితిలోనే మీ నాన్నకి ముప్పయ్యేళ్ళు పూర్తయ్యాయి. ఇన్నేళ్ళూ రాత్రిళ్ళు తెల్లవార బోతున్నాయంటేనే వణికిపోయేదాన్ని ఏ రోజు ఏవార్త వినాల్సి వస్తుందోనని. మీ నాన్నని నీటి ఛాయలకే వెళ్లనిచ్చేదాన్ని కాదు. భార్య పోయిందన్న దిగులుతోపాటూ ఓ మాదిరిగా తన లోకంలో తాను పరధ్యానంగానే వుండే వాడు. అలాంటి స్థితిలో ముప్పయ్యేళ్ళూ గడిచిపోయేసరికి బ్రహ్మానందపడ్డాను. ఊరందరికీ సంతర్పణ చేశాక, మరి కొంత కాలం గడిచాక పొలాలకి ఎరువులు కావా ల్సివచ్చి పట్నం వెళ్ళి వస్తున్నాడు మీ నాన్న. బస్సు బ్రిడ్జిమీద వస్తూ ప్రమాదవ శాత్తూ ఏటిలో పడిపోయింది. వర్షానికి ఏరు పొంగి ప్రవహిస్తూంది. ఆ ప్రమా దంలో నీటిలోపడి మరణించినవారిలో నీ తండ్రి వున్నాడు. ఆవిధంగా సంజీవయ్య వాక్కు ఆలస్యంగానైనా బ్రహ్మవాక్కే అయింది. అతనన్నట్లే మీ నాన్న నీటిలో పడే నాకు దూరమయ్యాడు. మీ నాన్న చని పోయిన ఆరోజునుంచే నేను రాయిలా

మారిపోయాను. నీకోసం, కేవలం నిన్ను పెంచి పెద్దచేయటం కోసమే నా జీవిత ముందని నన్ను నేను సమాధాన పరుచుకున్నాను. ఇన్నేళ్ళూ అలానే పెంచుకొచ్చాను.

ఏదో ఆ దేవుని దయవలన నీ పెళ్ళి మాత్రం నా కళ్ళారా చూడగలిగితే చాలు జీవితంతో యిన్నేళ్ళ నా ఒంటరి పోరాటానికి ముగింపు. ఇక ఎలా వచ్చినాసరే నాకేమయినా దిగులులేదు"

పది హేడేళ్ళ వయసులోనే వైధవ్యం ప్రాప్తిస్తే దాదాపు ఈ యాభై ఏళ్లుగా ఒంటరితనం, దుఃఖం మాత్రమే మిగిలినా జీవితంలో పోరాడుతూ వచ్చిన తన నాయనమ్మ కథంతా మొదటిసారిగా తెలుసుకున్న అరవింద్‌కు ఆ క్షణంలో ఆమె అంటే అంతులేని ప్రేమ, జాలి, ఆశ్చర్యం, గౌరవ భావం అన్నీ ముప్పిరి గొనగా గబుక్కున ఆమె చేతులు అందుకుని కళ్ళకద్దుకున్నాడు.

"చాలా కష్టపడ్డావు నానమ్మా" అన్నాడు. కన్నీళ్లు తుడుచుకుంటూ మనవడి వంక ఆపేక్షగా చూసింది వజ్రమ్మ.

"పిచ్చి సన్నాసి. ఇదేం కష్టం? ఎవరి కోసం పడ్డాను. భర్త పోయిననాడు కొడుకు కోసం, కొడుకూ, కోడలు పోయిననాడు నీకోసం. ఇక మాత్రం నాలో శక్తిలేదు నాయనా. నువ్వెందుకో ఆరు నెలలాగమన్నావు. అన్నట్లు ఆరు నెలలు మాత్రమే ఆగుతాను. ఆ తర్వాత పెళ్ళే చేసుకుంటావో బ్రహ్మచారిగానే వుంటావో నీ యిష్టం. డెబ్బ య్యేళ్ళు రాబోతున్నాయి. ఇవాళో రేపో అనే ఈ వయసులోనైనా మోహాలు, బంధాలు వదులుకుని కృష్ణారామా అనుకోకపోతే ఆ దేవుడు ఈ మానవజన్మ ఇచ్చింది ఎందుకూ?"

పెళ్ళి అనగానే అరవింద్‌కు సింధూర గుర్తుకొచ్చింది. సింధు గుర్తుకు రాగానే అరుంధతమ్మకు జరిగిన అవమానమూ గుర్తొచ్చింది.

"సంజీవయ్య జాతకంలో వున్నదే చెప్పాడుకానీ ఆయనేమీ తన తండ్రిని హత్య చేయలేదుకదా. నానమ్మకెందుకంత కోపం ఆయనంటే. ఆయనపై కోపాన్ని ఆయన కూతురైన అరుంధతి మీద చూపటం మరీ అన్యాయంకదా!" అని అడిగాడు వజ్రమ్మను.

కోపంగా చూసింది వజ్రమ్మ.

"మళ్ళీ సంజీవయ్య అన్న పేరే ఎత్తకు నా దగ్గర. ఆయన జోస్యమే చెప్పకుండా వుంటే నా కొడుకు అల్పాయుష్కుడన్న ప్రచారం జరిగి వుండేదికాదు. అంతదూరం వెళ్ళి మరో అల్పాయుష్కురాలైన పిల్లను కోడలుగా తెచ్చుకునే అవసరమూ నాకు కలిగేదికాదు. నీకు తండ్రి లేకపోయినా తల్లి అయినా వుంటే నేను... నేను నాకొడుకు పోయినాడన్న రోజునే చనిపోయి వుండేదాన్ని. అంతటి శోకాన్ని గుండెల్లో బడబానలంలాగ దాచుకుని ఇంత మొండిబతుకు బతకాల్సి వుండేదికాదు. నిజమే నా కొడుకు అర్థాయుష్కుడే కావచ్చు తన కూతుర్నివ్వక పోతే మానె జాతకం చూసినవాడు ఆ కారణంకాక వేరే కారణం చెప్పి వుండొచ్చుకదా. కళ్ళముందు నిక్షేపంగా తిరుగుతున్న కొడుకు త్వరలో చనిపోతాడని తెలిస్తే ఆ కన్నతల్లి హృదయం పడే క్షోభ ఏమిటో అనుభవించినవారికే తెలుస్తుంది. తానే పెద్ద జ్యోతిష పండితుడినన్న గర్వం. తాను ఒకటి చెప్పి అది నిజంగా జరిగిననాడు, అందరితో చూసారా నేనానాడే చెప్పాను కదా అని గొప్పగా చెప్పుకునే మనిషి గురించి నాతో మాట్లాడకు దయచేసి"

ఏం చెప్పగలడు అరవింద్, నిశ్శబ్దంగా ఆమె దగ్గర్నుంచి వచ్చేశాడు.

ఆ మరునాడు, ఆ తర్వాత రోజు కూడా సింధూర కాలేజీకి రాలేదు. ఇంటిదగ్గరా ఎంతసేపు చూసినా అసలు బయటే కనిపిం

చకపోయేసరికి పిచ్చి పట్టినట్లయింది అర విందకు.

మూడోరోజు చూశాడు- సింధూర కాలేజికి వచ్చే సూచనలేవీ కనిపించలేదు. కాలేజికి వెళ్ళినవాడు అక్కడ వుండబుద్ధికాక ఇంటికి బయలుదేరాడు. సరిగా అతను వీధి మలుపులో వుండగా సింధూర వాళ్ళ ఇంటి ముందు కూరల బండి దగ్గర నిలబడి కూరగాయలు కొంటూ కనిపించింది.

స్కూటర్ స్పీడు పెంచాడు. సింధూర అతన్ని చూడలేదు. సరిగ్గా ఆమె దగ్గరికి చేరేసరికి కూరగాయలతనికి డబ్బులిచ్చేసి తలవంచుకునే బుట్టతో ఇంట్లోకి నడవబోతూంది. తన పక్కనే రాసుకూంటూ ఆగిన స్కూటర్ శబ్దానికి కంగారుగా చూస్తూ వెనక్కి అడుగువేసింది.

"తర్వాత పార్కు దగ్గరకు రా, వెయిట్ చేస్తుంటాను" అన్నాడు.

"నేను..." అంటూ ఏదో చెప్పబోతున్న ఆమెని మధ్యలోనే ఆపేశాడు.

"నువ్వు వస్తున్నావు అంతే!" అనేసి రయ్యిన తమ ఇంటివైపు వెళ్లిపోయాడు.

ఓ నిముషం అతనెళ్ళినవంకే నిస్సహాయంగా చూసినా ఏదో నిర్ణయించుకున్నట్టుగా సింధూర తమ ఇంటిలోకి నడిచింది.

★ ★ ★

మామూలుగా తాము కూర్చునే చోట ఎదురు చూస్తున్న అరవింద్ దగ్గరకు వచ్చింది సింధూర.

"కాలేజీకి రావటం లేదేం?" అడిగాడు అరవింద్.

"అమ్మకు ఒంట్లో బావుండలేదు"

"సింధూ" ఆమె చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ చెప్పాడు. "అయామ్‌సారీ. మీ అమ్మగారి మనసు చాలా బాధపడి వుంటుంది"

రోషంగా తన చేతులు వెనక్కి లాక్కుంటూ అన్నది సింధూర.

"మా అమ్మను అలా అవమానించేందుకు మీ నానమ్మకేం హక్కుంది. ఇన్నేళ్ళలోనూ నాకు వూహ తెలిసి మా నాన్న కూడా మా అమ్మని అంతగా కోప్పడలేదు. ఆ తర్వాత నుంచీ అమ్మకు అదే ఆలోచనయి పోయినట్లుంది. అసలే అమ్మకి బ్లడ్ ప్రెషర్ కూడా వుంది"

సింధూర కంఠం వణికింది.

"జరిగిందానికి నేనూ ఎంతో బాధపడుతున్నాను సింధూ. అసలు మనం ఒకటను కుంటే దేముడు మరొకటి చేసినట్లయింది. మన కుటుంబాలు ఎదురెదురుగా వుండి సన్నిహితమైతే మన పెళ్ళికి అడ్డంకులేమీ వుండవు అనుకున్నాం. కానీ అంతా తలకిందులయింది. ఎప్పటెప్పటివో పాత కథలన్నీ తోడిపెట్టింది నానమ్మ?" నిట్టూర్చాడు.

"పాతకథలా? పాత కథలేమిటి?" విస్మయంగా అడిగింది సింధూర. అరవింద్‌తను నానమ్మ ద్వారా విన్నదంతా వివరంగా చెప్పాడు. ఎంతో ఆశ్చర్యంగా ఓపికగా విన్నది సింధూర.

"మీ తాతయ్యమీది కోపాన్నే మీ అమ్మ మీద చూపెట్టింది మా నానమ్మ"

అరవింద్ తండ్రికి తన తల్లినివ్వాలనుకున్నారా? ఆ విషయాన్నే ఆలోచిస్తున్న సింధూర మళ్ళీ కోపంగా చూసింది.

"మా తాతయ్య మీద కోపాన్ని మా అమ్మమీద చూపెట్టటం ఏమిటి? అయినా మా తాతయ్య మాత్రం ఏం చేశాడు?

మీనాన్నగారి నేమన్నా హత్య చేశాడా? జాతకం చెప్పారు. తను నిజమనుకున్నదే చెప్పారు. అదేనా ఆయన చేసిన నేరం?"

"అది నేరం కాకపోవచ్చుకానీ, జరగబోయేది మంచయితే దాన్ని వెల్లడి చేయవచ్చు కానీ చెడయితే, అదీ అనివార్యమయినపుడు

అలా చెప్పటం వలన ముందే తెలిసిన ఓ తల్లిగా ఆమె ఎంత బాధపడివుంటుందో నువ్వాలోచించు"

సింధూరకు నచ్చచెప్పేందుకు అతనూ వజ్రమ్మలాగే ఆలోచిస్తూన్నట్లు అన్నాడు.

"ఇంతకీ ఇప్పుడేమంటావు? మన రెండు కుటుంబాల మధ్య సఖ్యత లేదు కాబట్టి మన పెళ్ళి ఇక జరగదు అనబోతున్నావా? "

"సింధూ, నువ్వేనా ఈమాట అడుగుతున్నది? నా గురించి తెలిసీ? " అతను బాధగా చూశాడు.

సింధూరకూ కళ్ళలో నీళ్ళు తిరిగాయి. "అవును అరవింద్, నాకు తెలుసు. ఇక మనపెళ్ళి ఎలాగూ జరగదు. నా భయమే నిజమైంది చూశావా. మొదట్లో ప్రేమ అన్న పదమంటేనే భయంగా వుండేది. ఎంత మంది ప్రేమికులు పెళ్ళిచేసుకుని వుంటారు? నూటికి యాభైమంది ఒకర్ని ప్రేమించి ఏవో కారణాల వలన మరొకర్ని పెళ్ళాడేవారే. పాతిక శాతం ఆత్మహత్యలు చేసుకునో, భగ్నప్రేమికులుగానో మిగిలిపోతారు. మిగిలిన పాతికశాతమే ప్రేమించిన వారినే పెళ్ళాడేది. నేను... నేనిప్పుడేం చేయను. నాకు చచ్చిపోవడమొక్కటే మిగిలిన మార్గంలాగుంది"

రెండురోజులుగా అణిచిపెట్టివున్న దుఃఖం ఒక్కసారిగా బయటకొచ్చేసినట్లయి చివరి మాటలంటూ చేతుల్లో ముఖం దాచుకుంది సింధూర.

"సింధూ"

చప్పున ఆమెని దగ్గరకు తీసుకున్నాడు అరవింద్. అతని గుండెలపై వాలి రెండు నిముషాలలానే వుండిపోయింది సింధూర.

"పిచ్చిదానిలా మాట్లాడుతున్నావు" ఆమె కళ్ళు తుడుస్తూ అన్నాడు.

"పిచ్చితనంకాదు అరవింద్. ఉన్నమాటే. ఇలా జరిగాక కూడా మా అమ్మ నేను మీ ఇంటి కోడల్ని కావటానికి ఒప్పుకుంటుందనుకుంటున్నావా? ఇక మీ నానమ్మ మాత్రం ఈ పెళ్ళి జరగనిస్తుందా? "

"పెళ్ళాడబోయేది మనం. గొడవలొచ్చింది మనిద్దరికీ కాదుగా"

"అంటే పెద్దవాళ్ళ ప్రమేయం లేకుండానే మన పెళ్ళవుతుందంటావా? "

"అలా ఎందుకనుకోవాలి. మనం పెద్దవాళ్ళని ఒప్పించేందుకే ప్రయత్నిద్దాం"

తల అడ్డంగా ఊపింది సింధూర.

"నాకేమాత్రం నమ్మకం లేదు"

"పోనీ నా మీదయినా నమ్మకముందా? " కోపంగా అడిగాడు అరవింద్.

చిన్నగా నవ్వింది సింధూర. "నా ఎదుట నువ్వు కోప్పడటం ఇదే మొదటిసారి. సీరియస్‌గా"

చెమ్మగిల్లివున్న కళ్ళతోనే ఆమె అలా నవ్వటం ఎండా వానలు కలగలసినట్లు, ఎంతో మనోహరంగా అనిపించింది అరవింద్‌కు.

"అదీ, ఇలా నవ్వుతూంటే నువ్విప్పుడెంత బాగున్నావో తెలుసా? "

"తెలుసు, తెలుసు. ఇదో మీకళ్ళలో కనిపిస్తూనే వుంది" మరీ దగ్గరగా జరగబోతున్న అతనికి దూరంగా జరుగుతూ అన్నది.

"నేను దగ్గరకు రాబోవటం, నువ్వు దూరంగా నెట్టేయటం ఇదంతా మనకు అలవాటయిపోయింది. అసలు రేపు పెళ్ళయి నేను నిన్ను చేతుల్లోకి తీసుకోగానే నువ్వు ఇలా నెట్టేయకుండా సరేనన్నావనుకో. నాకు నా సింధునేనా నేను దగ్గరకు తీసుకున్నది అని సందేహం వస్తుందనుకుంటా"

అతనన్న తీరుకి "ఏయ్" అంటూ బుంగమూతి పెట్టింది సింధూర.




అరవింద్ పకాపకా నవ్వేడు.

ఈసారి సింధూరే అతనికి దగ్గరికి జరిగి భుజంపై తలవాల్చి అన్నది. "మళ్ళీ మనిద్దరం ఇలా కూర్చుని హాయిగా మాట్లాడుకుంటామని నేను అనుకోలేదు"

ఆమె విశాలమైన కనురెప్పలపై సున్నితంగా ముద్దుపెట్టాడు అరవింద్. "ఇది మూడోరోజు నువు కనిపించి, నాకు పిచ్చిపట్టి నట్లయింది తెలుసా నిన్ను చూడకుండా? "

"అసలిదంతా ఎందుకు జరగాలి? నాకు భయంగా వుంది "మళ్ళీ బేలగా అన్నది సింధూర.

"పిచ్చీ, ఇదంతా ఇప్పుడా జరిగింది. మనం పుట్టకముందే జరిగిన గొడవలివి. అయినా జరిగిపోయిన వాటి గురించి మనకెందుకు ఆలోచన. జరగబోయేదాని గురించి ఆలోచిద్దాం అన్నింటికీ కాలమనేది ఒకటుందికదా. ప్రతి సమస్యకూ పరిష్కారాలు వుండనే వుంటాయి. కానీ ఏదో ఓ చిన్న సమస్యరాగానే బెంబేలు పడిపోయి ఆ సమస్యనే కళ్ళముందు పెట్టుకుని చూస్తే గులకరాయిలాంటిదే కొండలా కనపడి భయపెడుతుంది."

నవ్వింది సింధూర. "ప్రయత్నిస్తే కథలు రాయొచ్చునువ్వు. కానీ ఇప్పటికి చాలిద్దాం సమావేశం. స్నేహితురాలింటికెళ్ళి నోట్స్ తీసుకొచ్చుకుంటానని చెప్పి వచ్చానింట్లో"

రేపటి కొండంత ఆశతో ఇద్దరూ ఇళ్లకి నడిచారు.

ఆ సంఘటన తర్వాత ఆ రెండు కుటుంబాలు ఎడముఖం పెడముఖంగానే మారిపోయాయనవచ్చు వజ్రమ్మ, అరుంధతి ఇద్దరూ గేటుదగ్గరగానీ, రోడ్డుమీదగానీ పొరపాటున కూడా ఎదుట పడాల్సివస్తే ఒకరి ముఖం మరొకరు చూసుకోవటం యిష్టంలేనట్లు గిరుక్కున వెనుదిరిగి ఇంట్లోకి వెళ్ళిపోతున్నారు. ఎదురింటి తలుపులు మూసివుంటేనేగానీ పనివున్నాసరే బయటకు రావటంలేదు.

ఇదంతా ఆనందరావుకేమీ తెలియదు. అరుంధతి ఏమీ చెప్పలేదు. ఆయనసలు ఈమధ్య ఇంటిపట్టున వుండటమే తక్కువగా వుంది. పొద్దున లేవడం స్నానం, టిఫిను కావడమే బయటకు వెళ్ళిపోవడం, మళ్ళీ రాత్రి పొద్దుపోయాక వచ్చి పడుకోవడం. ఒక్కోరోజు భోంచేస్తాడు. ఒక్కోరోజు భోజనం కూడా బయటే చేశానని చెప్పేయడంగా వుంది.

అరుంధతికి భర్త ధోరణి ఏమీ అంతుపట్టడంలేదు.

"మీకొక ఇల్లు, యిల్లాలు, పిల్లలు వున్నారన్న సంగతే మర్చిపోయినట్లు ఏమిటంత రాచకార్యాలు? క్షణం తీరిక లేదు దమ్మిడీ ఆదాయం లేదన్నట్లుంది మీ వరస? "

పండగపూట కూడా ఇంటిపట్టునుండని భర్తని చూసి ఓరోజు నిష్ఠూరమాడింది.

నవ్వేడు ఆనందరావు. "అంటే, ఆదాయం వుంటే క్షణం తీరిక లేకుండా, యిల్లు వాకిలి పట్టకుండా తిరిగినా ఫరవాలేదనా నీ ఉద్దేశం? "

"ఉద్దేశాలు బాగానే అర్థం చేసుకుంటారు. అలా అని ఏ పెళ్ళామూ అనదు"

"కానీ నువ్వంటావు!"

అయితే ఆ మాట పైకనలేదు ఆయన. భార్య వైపోసారి దీర్ఘంగా చూసి ఆ టాపిక్ నంతటితో తుంచేసి కామ్‌గా వెళ్ళిపోయాడు.

ఏదైనా మాట్లాడేవాళ్ళతో మాట్లాడొచ్చు పోట్లాడొచ్చు కానీ మౌనంగా వుండే వారితో ఏం సంభాషించకలరెవరైనా.

తండ్రి ధోరణి సింధూరకూ ఎంతో బాధగానే వుంది. తను పార్కులో చూసిన దృశ్యాన్ని తల్లికి చెప్పేస్తేనో అనిపించింది.

కానీ మొదలే ఈమధ్య ఆమెకు ఆరోగ్యం సరిగా వుండటం లేదు. బి.పి. ఎక్కువైపో యింది. ప్రతి విషయానికీ కోపమూ చిరాకు లేదా ఒంటరిగా కూచుని తన ఆలోచనల్లో తానుండి పోవటంగా వుంది.

ఈ వైనంలో తండ్రి పవర్తన గురించి చెప్పడం భావ్యంగా అనిపించలేదు సింధూ రకి. అయినా అందులో పెద్దగా పట్టించుకో వాల్సినదుందా అనుకోసాగిందొక్కోసారి.

తల్లీ, తండ్రి ఎవరి లోకంలో వారున్నట్లు ఉండటం, సంజయ్ యింట్లో లేకపోవటం, అక్కలిద్దరూ తమకేదైనా అవసరమైతే తప్ప పుట్టింటికి ఉత్తరమైనా రాయకపోవటం, సింధూరకు తన యింట్లోనే తను పరాయి అయినట్లు తన గురించి ఆలోచించే వారె వరూ లేనట్లు ఒంటరితనంగా అనిపించసా గింది. మనసు విప్పి మాట్లాడుకునేది అర వింద్‌తో కూచునే కాసేపే. అందుకే సింధూరకు అరవింద్ ఒక్కడే జీవన సర్వ స్వంలా తోచసాగింది.

అయితే తల్లికీ, వజ్రమ్మకీ అయిన గొడవ వలన యిద్దరికీ పెళ్ళి జరుగుతుందాన్న సం దేహం ఆమెలో రెపరెపలాడసాగింది.

★ ★ ★

అంతవరకూ ఒక్క ఉత్తరమన్నా రాయని సంజయ్ ఓరోజు ఉదయాన్నే పూర్నుంచి వచ్చేశాడు. అరుంధతికి దేముడే దిగివచ్చిన ట్లయింది.

కొద్దిరోజుల్లోనే తల్లిలా దగ్గరైన ఎదురింటి వజ్రమ్మ ప్రవర్తన, అనారోగ్యం, రోజురోజుకీ మానసికంగా దూరమవుతున్న భర్త ధోరణి అన్నీ కలిసి అరుంధతిని లోలోన కృంగదీ స్తున్నాయేమో కొడుకుని చూడగానే దుఃఖం పొంగుకొచ్చి ఒక్కసారిగా ఏడ్చేసింది.

"అమ్మా, ఏమిటిది? " సంజయ్‌కేమీ అర్థం కాలేదు.

"తను యిన్ని రోజులూ కనిపించకుండా వున్నందుకేనా? లేక యింకేదైనా కార ణమా? ఏమయింది? "

సింధూరకు తల్లి బాధ అర్థమై ఆమెని ఆపే ప్రయత్నం చేయక అలాగే తల్లినీ అన్ననీ చూస్తుండిపోయింది.

"సింధూ ఏమయింది అమ్మకి? నువ్వ యినా చెప్పరాదూ. అమ్మా, ఊరుకో ఏమి టిది? "

కంగారుపడిపోతూ ఓదార్చుతున్న కొడు కుని చూసి కళ్ళు తుడుచుకుని బలవంతాన నవ్వు తెచ్చుకుంటూ అన్నది అరుంధతి.

"ఏం లేదులే నాన్నా, ఇన్నాళ్ళూ నువ్వేమ యిపోయావోనన్న దిగులుతో వున్నానా, హఠాత్తుగా నువ్వొచ్చేసరికి దుఃఖం ఆగలే దంతే"

"ఏమయిపోతానమ్మా నేనేం చిన్నపిల్లా డినా? "

హమ్మయ్య దీనికేనా అనుకుంటూ తేలిగ్గా అన్నాడు సంజయ్.

ఏమైనా సంజయ్ రాక సింధూరకూ బలం వచ్చినట్లయింది. సమయం చూసు కుని తన ప్రేమ విషయం ముందు మెల్లగా సంజయ్‌తోనే చెప్పటం మంచిదనుకుంది.

★ ★ ★

రామకృష్ణ మఠంలో వేదాంత ఉపన్యా సాలు జరుగుతున్నాయి. మనవడిద్వారా విని వజ్రమ్మ ప్రసంగాలు వినాలని వచ్చింది. ఆరోజు స్వామి విజయానందగారి ఉపన్యాసం. భగవద్గీత వైశిష్ట్యాన్నీ రోజూ పారాయణ చేయటాన్ని గురించి అనర్గ ళంగా ఆయన ఉపన్యాసం సాగింది. ఉప న్యాసానంతరం మెల్లగా లేచి యింటికి బయలుదేరింది.

రిక్షా కానీ, ఆటో కానీ దొరుకుతుందేమో నని చూస్తూ అడుగులు వేస్తూంది. రోడ్డుక టువైపునుందో కాళీ ఆటో. రోడ్డు చాలా

రద్దీగా వుంది. తను ఆలస్యం చేస్తే ఆ ఆటో మరెవరైనా మాట్లాడుకోవచ్చన్న తొందరలో గబగబా అటు అడుగులు వేయబోయింది ఆమె. వజ్రమ్మకి నగరవాతావరణమే కొత్త. పల్లెలో వున్న వ్యవసాయమంతా ఈమధ్య ఎటూ కౌలుకిచ్చే వుండటంవలనా, మనవడి గట్టి పట్టుదలవలనా ఆమె పట్నం వచ్చింది. ఆమెకు రోడ్డుపై ఈ ట్రాఫిక్ రూల్స్, ఒన్ వేలు యివన్నీ ఏమీ తెలియవు. తెలియక పోయినా మనుషుల్ని, వాహనాల్ని చూసి బెదిరిపోయే మనస్తత్వమూ కాదు కాబట్టే ఎక్కడికైనా ధైర్యంగా ఒంటరిగా పోయివ స్తూంది.

ఒకవైపునుంచి వస్తున్న వాహనాల్ని చూసుకుంటూ రోడ్డుదాటబోయింది ఆమె. ఇటువైపునుంచి వస్తున్న స్కూటర్ని చూడ లేదు. బాగా దగ్గరకు వచ్చేసిన తర్వాత అప్పుడు చూసుకుని వెనక్కి తగ్గబోయింది. ఎంతో స్పీడుగా వస్తున్న స్కూటర్ అతను అప్పటికీ కాస్త నేర్పుగా పక్కకు తిప్పాడు అయినా ఆమెకు తగలక తప్పిందికాదు.

పెద్దగా అరుస్తూ పడిపోయింది వజ్రమ్మ.

స్కూటరతని తప్పేమీ లేదని అక్కడున్న వారందరూ చూస్తూనే వున్నారు. నిజానికి స్కూటర్ తగిలి పడేదానికన్నా షాక్‌తో వెనక్కి విరుచుకు పడటంవలన ఎక్కువ దెబ్బలు తగిలాయి ఆమెకు. భారీ శరీరం, కాలు మెలిక పడింది. మోకాలికీ, తలకీ గాయమై రక్తం స్రవించసాగింది.

చుట్టూ జనం పోగయ్యారు. అదీ నడుస్తు న్నవారు మాత్రమే. వాహనాలలో పోతున్న వారు మాత్రం యిలాంటి ఏక్సిడెంట్లన్నీ చాలా మామూలే అన్నట్లు కాస్త స్లో చేసు కుని యధాలాపంగా చూసి తమదారిన వెళ్ళిపోతున్నారు.

చుట్టూ చేరిన జనమంతా చోద్యం చూస్తూ అందరూ తలకొక రకంగా మాట్లా డుతున్నారే కానీ ఎవరూ ఆమెని లేవదీసి హాస్పిటల్‌కు తీసుకెళ్ళే ప్రయత్నం చేయటం లేదు.

స్వామి విజయానందగారి ఉపన్యాస సారాంశాన్ని గురించే ఆలోచించుకుంటూ అన్యమనస్కంగా అడుగులు వేసుకుంటూ మెల్లగా వెళుతున్న సంజయ్ గుంపు గుమి కూడటంచూసి ఈ లోకంలోకి వచ్చాడు. ఏక్సిడెంట్ అనగానే అప్రయత్నంగానే అటు వైపు అడుగులువేసి గుంపులోంచి తొంగిచూ శాడు. రక్తం కారుతూ, స్పృహ కోల్పోయి పడిపోయి వున్న ముసలావిడ, చోద్యం చూస్తున్న జనాలమధ్య స్కూటర్‌వాలా తన తప్పేమి లేదనీ తన కవతల అర్జంటు పని వుందని వెళ్ళిపోయేందుకు చూస్తున్నాడు. ఎవరైనా కల్పించుకుని ఆ వృద్ధురాల్ని డాక్టర్ దగ్గరకు తీసుకెళతారేమోనని రెండు నిముషాలు చూశాడు సంజయ్.

"అసలే ముసలామె. అలాగే పడివుంటే ప్రాణాలకే ప్రమాదం" అని అంటున్నారే కానీ ఎవరూ పట్టించుకునేందుకే ముందుకి రావటంలేదు. ఇక చూస్తూ వుండలేక సంజయ్ జనాన్ని తోసుకుని ముందుకు వచ్చాడు.

ఓ ఆటోని మాట్లాడాడు. అతను ముందుకు వచ్చాక మాత్రం అందరిలో చైతన్యం వచ్చింది. ఆమెని ఆటోలో పడుకో బెట్టేందుకు సహాయం చేశారు. ఆటోడ్రైవర్‌కి తన ఫ్రెండు అన్నగారి నర్సింగ్‌హోమ్ అడ్రసు చెప్పాడు.

ఆటోలో వస్తుండగా ఆమె ముఖం చూసిన అతనికి గుర్తొచ్చింది ఆమెను తమ ఎదురింట్లోనే ఒకటి రెండుసార్లు చూసి నట్లు.

హాస్పిటల్లో అర్జంటు కేసు అనగానే డాక్టర్ గబగబా వీరిదగ్గరకి వచ్చాడు. "ఓ సంజయ్ కదూ. ఏమవుతారు యీమె మీకు?" అడిగాడు డాక్టర్ వజ్రమ్మను

చూస్తూనే.

సంజయ్ జరిగింది చెప్పాడు.

"అరె... అలాగా, ముందు ఈమె ఇంట్లో వాళ్ళకి తెలియచేయడం మంచిది కదా. వర్రీ అవాల్సినదేమీ లేదనుకోండి"

సలహా ఇచ్చాడు, నర్సుకి సూచనలిస్తూనే.

ఆటోలో ఆమెని ఎక్కిస్తుండగా ఎవరో ఒకావిడ "ఈ పెద్దావిడదే అయి వుంటుందని" యిచ్చిన ఓ ప్లాస్టిక్ బేగ్ చేతిలోకి తీసుకున్నాడు.

ఆ పెద్దావిడ తమ ఎదురింటావిడగా తనకు తెలియబట్టి సరిపోయింది. లేకపోతే పోలీసులకి యిన్‌ఫామ్ చేయాల్సిందేగా అనుకున్నాడు. నిజానికి సంజయ్‌కి తమ ఎదురింట్లో, పక్కింట్లో ఎవరొచ్చారో తెలుసుకోవాలనే ఆసక్తి వుండదుకనుక ఇరుగు పొరుగు వారు అతనికి పెద్దగా తెలియదు. అసలతను ఇంట్లో వుండే సమయమే తక్కువ. ఉన్నా తన గదిలో పుస్తకం చదువుకుంటూనో, ధ్యానం చేసుకుంటూనో వుంటాడు. అందుకే అతనికి తమ ఎదురింట్లోనే వుండే వజ్రమ్మ కొద్దిసేపు పరీక్షగా చూశాకగానీ గుర్తుకి రాలేదు.

ఆమెకు స్పృహవస్తే చూసుకొమ్మని నర్సుని అడిగి అతను ఇంటికి బయలుదేరాడు. ఆవిడ గురించి ముందు వాళ్లింట్లో తెలియపరిస్తే చాలు అంతటితో తన బాధ్యత తీరుతుంది అనుకున్నాడు.

అందుకే ముందు ఎదురింట్లోకి వెళ్ళాడు.

★ ★ ★

అరవింద్ అప్పుడే బయటనుంచి వచ్చివున్నాడు. మామూలుగా అరవింద్ సాయంకాలాలు ఇంటికి వచ్చేసరికి వజ్రమ్మ ఏ గుడికో, ఏ పురాణానికో అని వెళ్ళటం అలవాటే. ఇద్దరి దగ్గర ఇంటి తాళాలు వుంచుకుంటారు కాబట్టి ఇబ్బందేమీ వుండదు.

ఆరోజు నానమ్మ ఏ గుడికో వెళ్ళి వుంటుందిలే అనుకున్నాడు ముందు. తర్వాత తనే ఉపన్యాసం గురించి చెప్పాడు కదా బహుశా అక్కడికే వెళ్ళి వుంటుంది అనుకుని ఫ్లాస్కులోని కాఫీ తాగి తాపీగా పేపరు చదువుకుంటూ కూర్చుని వున్నాడు అరవింద్.

కాలింగ్ బెల్ శబ్దానికి వజ్రమ్మ అయి వుంటుందని గుమ్మం దగ్గరకి వచ్చిన అరవింద్ వాకిట్లో సంజయ్‌ని చూసి ఆశ్చర్యపోయాడు.

అరవింద్ సంజయ్‌ని ఎన్నోసార్లు చూసి వున్నాడు. సంజయ్ మాత్రం అరవింద్‌ని ఒకటి రెండు సార్లే చూసివున్నాడు. అందులో ఒకసారి పార్కులో తన చెల్లెలితో.

"మీరా, రండి రండి. నేను మీకు తెలుసో తెలియదోకానీ మీరు నాకు బాగా తెలుసు. ఎదురింట్లో వుండే సంజయ్! అవునా?" గలగలా మాట్లాడుతూ లోపలికి ఆహ్వానించాడు అరవింద్.

"తన పేరు సింధు చెప్పివుంటుంది. ఇంక తెలియక పోవటానికేం?" మనసులో అనుకుంటూ ఇప్పుడు ఆ విషయాలన్నీ అడగటం భావ్యం కాదనిపించింది.

"ఇది మీ ఇంట్లో వాళ్ళదేకదూ!" తన చేతిలోని బేగ్ చూపిస్తూ అడిగాడు.

"అరె, అది మా నానమ్మది, మీ చేతిలోకెలా వచ్చింది. మా నానమ్మ ఏది? ఏమయింది?"

అంతవరకూ నవ్వుతూ మాట్లాడుతుండిన అరవింద్ ముఖం ఆందోళనగా మారిపోతుండగా అడిగాడు.

"కంగారుపడకండి. ఏం కాలేదు. ఆవిడకి చిన్న ఏక్సిడెంట్ అయింది. డాక్టర్ ప్రమాదమేమీ లేదని చెప్పారు" అంటూ జరిగినదంతా చెప్పి ప్రస్తుతం వజ్రమ్మ వున్న

నర్సింగ్‌హోమ్ అడ్రసిచ్చాడు. అరవింద్ గబుక్కున ముందుకి వచ్చి సంజయ్ చేతులు పట్టుకున్నాడు.

"థాంక్స్ సంజయ్‌గారూ, థాంక్యూ వెరీ మచ్. సమయానికి మీరే కనక హాస్పిటల్లో చేర్పించకపోతే ఆ రోడ్డుమీదే అనాథలా ఏ పోలీసులో వచ్చినదాకా అలానే పడివుండే దేమో నానమ్మ. ఆమెకేమన్నా అయితే నాకింక ఎవరున్నారు? మీరు నాకీరోజు ఎంత సహాయం చేశారో మీకు తెలియదు. నేనిప్పుడే నానమ్మ దగ్గరకు వెళుతున్నాను. వస్తాను. మిమ్మల్ని మళ్ళీ కలుసుకుంటాను

గబగబా మాట్లాడుతూనే తాళం చేతు ల్లోకి తీసుకుని బయటకు నడిచాడు అర వింద్.

అతను చెయ్యూపుతూ స్కూటర్‌మీద రివ్వున వెళుతుంటే అలానే కొద్దిసేపు చూసి తమ ఇంటివైపు నడిచాడు సంజయ్.

ఎందుకో అతనికి ఆ సంఘటన గురించి ఇంట్లో ఎవ్వరికీ చెప్పాలనిపించలేదు.

మౌనంగానే తల్లి పెట్టిన భోజనం తిని పక్కమీదకు చేరాడు. ఎప్పుడూ ఒంటిగంట, రెండింటిదాకా పుస్తకాలు చదువుతూంటే ఎప్పుడో పట్టే నిద్ర ఆరోజు అలిసి పోయినట్లుగా వెంటనే వచ్చేసింది. ప్రశాం తంగా నిద్రపోయాడు.

అర్ధరాత్రిదాకా మేల్కొనివుండే సంజయ్ అంత త్వరగా వెంటనే నిద్రపోవటం చూసి వింతగా అనిపించి ఒంట్లో ఏమన్నా బాగు లేదేమోనని అనుమానంవచ్చి దగ్గరకెళ్ళి నుదుటిపై చేయి వేసి చూసింది అరుంధతి.

"అనారోగ్యం కాదు. నిద్రే" అనుకున్నాక "పిచ్చితండ్రి కడుపునిండా తిండి తినడు, కంటినిండా నిద్రపోడు" అని నిట్టూర్చింది. కానీ ఆ వేళ సాయంత్రం జరిగిన ఆ సంఘ టన తన కొడుకు జీవితంలో ఓ మలుపు కాబోతుందని ఆ క్షణాన ఆమెకు తెలి యదు.

★ ★ ★

అరవింద్ హాస్పిటల్‌కి చేరుకునేసరికి వజ్రమ్మ నర్సుని ఏదో అడుగుతోంది. మోచే తికీ, తలకీ, కాలికీ బేండేజిలు వున్నాయి. బాగా నీరసంగా కనిపిస్తూన్నా, మెల్లగానైనా ఆమె మాట్లాడుతుండటం చూసి నిట్టూ ర్చాడు రిలీఫ్‌గా.

అప్పుడే పక్కరూమ్‌లోకి వెళుతూ ఎదు రైన డాక్టర్‌ని విష్‌చేసి తనను పరిచయంచే సుకుని ఆమె కండిషన్ గురించి అడిగాడు.

"పెద్దవయసుకదా. సడన్‌గా స్కూటర్ కొట్టుకునేసరికి కాస్త షాక్ అయ్యారు అంతే. వెంటనే తీసుకురావటంవలన కాలి గాయమూ త్వరగానే మానిపోతుంది. ఆలస్యం చేసి వుంటే మాత్రం యీ వయ సులో ఎముక అతుక్కోవటం కష్టమై వుండేది. ఇప్పుడు ఓ వారం కంప్లీట్ బెడ్‌పై వుండాల్సిందే. తర్వాత సెట్ అయి నదాకా చిన్నగా స్టిక్ సాయంతో నడవ వచ్చు ఆ, ఆవిడకి బి.పి. వుంది, కాస్త జాగ్రత్తగా చూసుకోవాలి"

"థాంక్‌గాడ్" సంజయ్‌కి మనసులోనే మరోమారు కృతజ్ఞతలు చెప్పుకున్నాడు అర వింద్.

అరవింద్ దగ్గరకు రాగానే వజ్రమ్మ భోరున ఏడ్చేసింది.

"నాయనా, విందూ!" అంటూ.

"వూరుకో నానమ్మా, ఎందుకు? డాక్టర్ని కలిసే వస్తున్నాను. చిన్న ఏక్సిడెంట్‌గా. ఏం ఫరవాలేదు అన్నారు. నాలుగురోజుల్లో ఇంటికెళ్ళి పోవచ్చు అన్నారు" ఓదార్చాడు.

"పిచ్చి తండ్రీ. నా కోసం ఏడుస్తున్నా న్రా. ఆ రోడ్డుమీదే దిక్కులేనిదానిలా నాకేదయినా అయివుంటే నీ పెళ్ళి కళ్ళారా

చూసే రాతలేదని చచ్చినా నా ఆత్మ కొట్టు కొంటూనే వుండేది. అయినా ఆ క్షణం పోయాననే అనుకున్నాలే"

"ఛ, అవేం మాటలు నానమ్మా. నీకేం కాదు. నా పెళ్ళికేం బ్రహ్మాండంగా నువ్వే పెత్తనం చెలాయిస్తూ పందిరంతా తిరుగుతూ మరీ చక్కగా చేయిస్తావు సరే. నువ్విప్పుడా ఆలోచనలేం పెట్టుకోక హాయిగా విశ్రాంతి తీసుకో"

మనవడి చేయి పట్టుకుని కళ్లు మూసుకుందామె. ఆమె అలాగే నిద్రలోకి జారుకున్నదాకా కదలకుండా అలానే కూర్చున్నాడు అరవింద్.



ఆ మరునాడు సంజయ్ హాస్పిటల్‌కి వచ్చాడు. ముసలమ్మకెలా వుందో చూసి వెళదామని.

మంచంపక్కనే వున్న కుర్చీలో కూర్చుని వజ్రమ్మ చెప్పేది ఏదో వింటున్న అరవింద్ సంజయ్‌ని చూడగానే లేచి సాదరంగా ఆహ్వానించాడు.

"హలో... రండి రండి" అంటూ.

ప్రశ్నార్థకంగా చూస్తున్న వజ్రమ్మతో చెప్పాడు.

"సమయానికి ఈయనే కనక కల్పించుకుని వెంటనే నిన్ను డాక్టర్ దగ్గరకు తీసుకు రాకపోయివుంటే రక్తమదీ ఎక్కువపోయి కాస్త ప్రమాదమయ్యేదేనట నానమ్మా"

"నువ్వేనా నాయనా ఆ పుణ్యం కట్టుకున్నది. రారా, కూర్చో బాబూ" వజ్రమ్మ ఆప్యాయంగా కుర్చీ చూపించింది.

అరవింద్ మంచంపైనే ఓ పక్కగా కూచున్నాడు.

అరుంధతికి ఓ కొడుకున్నాడని తెలుసు కానీ నేరుగా ఎప్పుడూ చూసింది లేదామె. అందుకే గుర్తుపట్టలేదు. అరవింద్ కూడా అది గ్రహించి చెప్పలేదు. చెపితే మళ్ళీ ఏం సీన్సు క్రియేటవుతాయోనని.

సంజయ్‌కి మొహమాటంగా అనిపించింది.

"మీరు మరీ ఎక్కువచేసి మాట్లాడుతున్నారు. నిజానికి నా బాధ్యత నేను చేశానే కానీ పెద్ద సహాయమేముందిందులో" అన్నాడు.

"అలా అనకు బాబూ, పక్కమనిషికి సాయం చేయడం బాధ్యత అని ఎవరనుకుంటున్నారీ రోజుల్లో. అప్పటికి అక్కడున్న సగంమంది జనం అప్పుడే స్వామిజీగారి ఉపన్యాసం విని బయటకొస్తున్నవారే. మానవసేవ, మాధవసేవ గురించి కూడా చెప్పాడుకదా ఆ మహానుభావుడు. నిస్సహాయస్థితిలో వున్న తోటి మానవుల్ని గమనించలేకపోయినవారు ఇక మాధవుడ్నేం చేరుకుంటారు? అంతమందిలో నువ్వొక్కడివే అది ఆలోచించగలిగావంటే చిన్నవాడివైనా అది నీ పెద్ద మనసు బాబూ.

ఇదంతా విని, ఈ ముసలమ్మకి ప్రాణాల మీద ఎంత తీపోకదా, ఆమె ప్రాణం కాపాడానని ఒకటే పొగుడుతోంది అనుకుంటున్నావా? అదేం లేదు నాయనా. మా అరవిందుడి పెళ్ళి అయినదాకా మాత్రం నాకీ




శరీరం సవ్యంగా వుండాలన్న ఆశ" అన్నది.

వెంటనే అరవింద్ ముఖంలోకి చూశాడు సంజయ్.

అంతవరకూ నవ్వు ముఖంతో నాయనమ్మ మాటలు వింటున్న అరవింద్ ముఖంలో పెళ్ళి ప్రస్తావన రాగానే గంభీరత రావటం గమనించాడు.

"ఇతను సింధుని పెళ్ళాడతాడా? లేక... అమ్మాయి వలలో పడిందికదాని సరదాగా తిరిగి చేతులు దులుపుకునే రకమా? తనీ విషయంలో ఎప్పుడు కల్పించుకోవాలి? ఇతనికన్నా ముందు సింధునే కదపాలి. ఏమంటుందో? "

సంజయ్‌లో ఆ రకమైన ఆలోచనలు వచ్చేసరికి ఇక ఎక్కువసేపు అక్కడ కూచోలేకపోయాడు.

పనుందని చెప్పి లేచి వచ్చేశాడు.

★ ★ ★

అరవింద్ కాలేజికి రెండురోజులు సెలవు పెట్టాడు. సింధుకు అయోమయంగా అనిపించసాగింది.

అతను కాలేజికి రావటం లేదు. ఇంటి దగ్గర చూద్దామంటే తాళం కనిపిస్తుంది. ఊరికి వెళ్ళారేమో అనుకుందామంటే రాత్రిళ్లు ఇంట్లో లైటు వెలుగుతుంది.

ఊర్లోనే ఉండి పగలంతా తాళం వేయటమేమిటి? వజ్రమ్మ కూడా కనిపించటం లేదు. ఎవరికన్నా సుస్తీ చేసిందా? ఎవరు చెప్తారు?

వెళ్ళి కనుక్కోవడానికి వీలులేదు. వారి మాటే ఎత్తడానికి వీల్లేదనేసింది తల్లి.

మరునాడు పొద్దున వాకిట్లోకి కూరల బండి వస్తే, తాను వంటింట్లో పనితో సతమతమవుతూ కూతుర్ని కూరలు తీసుకోమంది అరుంధతి. బుట్ట తీసుకుని వీధిలో కొచ్చింది సింధూర.

సరిగ్గా అప్పుడే తాళం తీసుకుని బయటకు బయలుదేరబోతూ గుమ్మంలో కొచ్చాడు అరవింద్.

ఓ క్షణం ఇద్దరి చూపులు కలుసుకున్నాయి.

గబుక్కున అరవింద్ మళ్ళీ ఇంట్లోపలికెళ్ళి తనూ ఓ బ్యాగ్‌తో కూరలబండి దగ్గర కొచ్చాడు.

"టమాటాలు మంచివి ఏరి ఒక కిలో ఇవ్వు" అని కూరలబండి అతనితో చెప్పేసి సింధువైపు తిరిగి లోగొంతుకతో చెప్పాడు.

"నానమ్మకి చిన్న ఏక్సిడెంట్ అయింది. ప్రశాంత్ నర్సింగ్ హోమ్‌లో వుంది. మీ అన్నయ్యే సమయానికి చూసి హాస్పిటల్లో చేర్చాడు. ఇప్పుడు బాగానే వుంది. అయినా వారంరోజులు హాస్పిటల్లోనే వుండాలిట"

వంకాయలు లేతవి ఏరుతున్నట్లు చూస్తూ అతని మాటలు విన్నది సింధూర.

"పార్కుకి రావటానికి కుదరదు. నువ్వు తర్వాత హాస్పిటల్‌కి ఫోన్ చేయి"

తలాడించింది సింధూర.

కూరలతనికి డబ్బులిచ్చి టమాటాలు తీసుకుంటూ "ప్చ్... వీటినేం చేసుకోను ఇప్పుడు" అంటూంటే...

"మిక్సీలో వేసి జూస్ చేసుకుతాగండి. ఒంటికి మంచిది" నవ్వుతూ అన్నది సింధూర.

ఆమెకిప్పుడు కాస్త దిగులు తీరినట్లయింది విషయం తెలియడంతో.

"అయినా ఈ అన్నయ్య ఏం మనిషి అనుకోవాలి. ఎదురింటివారేకదా. జరిగింది నోరు విప్పి ఇంట్లో చెప్పివుంటే ఏం? " అన్న గారిమీద కాస్త కోపమూ వచ్చింది సింధూరకు

★ ★ ★

రాత్రి ఆనందరావు భోంచేస్తుండగా డైనింగ్‌టేబుల్ దగ్గరకొచ్చి ఎదురుగా వున్న

కుర్చీలో కూర్చున్నాడు సంజయ్.

"నాన్నా..."

"ఊం, చెప్పు" అడిగాడు ఆనందరావు మనసులో "డబ్బులడిగేందుకు అయివుంటుంది. ఇంకేముంటుంది?" అనుకుంటూ.

"మీ స్నేహితులొకరి కంపెనీలో జాయిన వమన్నారు అప్పుడు. వేకెన్సీలున్నాయటనా, ఇప్పుడు చేరవచ్చా?" ఓ క్షణం ముందు తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు ఆనందరావు.

"ఏమిటీ... ఏమంటున్నావు" అపనమ్మకంగా అడిగాడు.

"అదే నాన్నా, మీ స్నేహితుని ఆఫీసులో అకవుంట్స్ డిపార్ట్‌మెంటులో చేరమన్నారుగా. వేరే జాబ్స్ క్కూడా ప్రయత్నిస్తున్నాను. అవి దొరికేదాకా ఖాళీగా వుండటమెందుకని"

భర్తకి మజ్జిగలోకి వూరగాయతెచ్చి వేయబోతున్న అరుంధతి ముందు తాను వింటున్నది నిజమేనా అన్నట్లు అలాగే నిలుచుండిపోయిందో క్షణం.

"అప్పుడు అడిగితే ఈరోజు ఇక్కడుంటాను, రేపెక్కడ వుంటానో ఇంకా నేనేం చేయాలో ఏం నిర్ణయించుకోలేదు. ఈ జాబ్‌లో చేరితే ఎలాగా అన్నావుగా" అడిగాడు ఆనందరావు.

"అబ్బా, మీరొకరు అప్పుడేదో అన్నాడు లెద్దూ. ఇప్పుడు వాడి భవిష్యత్తు నిర్ణయించుకునేగా అడుగుతున్నాడు. అవన్నీ కెలక్కుండా వాడు అడిగినదానికి చెప్పకూడదటండీ మీరు?" భర్త మాటలకి కొడుకు ఎక్కడ నొచ్చుకుంటాడో మళ్ళీ ఏ ముహూర్తాన ఏం మనసు మారిపోతుందోనని కంగారుగా అన్నది అరుంధతి.

"నువ్వుండు అన్నింటికీ అర్జంటేనా?" భార్యని కోప్పడి కొడుకువైపు చూస్తూ అడిగాడు. "ఎప్పుడూ ఎవర్నీ దేనికోసమూ అడగలేదు నేను. అలాంటిది ఈవేళ నీ కోసం అడుగుతాను. ఉద్యోగంలో చేరుతావు సరే. కానీ ఓ నెలో రెండు నెలలో చేసి అదిగో అక్కడెవరో గురువుగారు పిల్చారు అనో, ఆ స్వామీజీ దగ్గర దీక్షవుంది అనో మధ్యలో ఉద్యోగం వదిలెయ్యవుకదా. నాకు తర్వాత మాట వస్తుంది"

"లేదు నాన్నా. నేను బాగా నిర్ణయించుకునే అడుగుతున్నాను"

మెల్లగా తలవంచుకునే అయినా స్పష్టంగా చెపుతున్న కొడుకువంక ఆనందంగా చూశాడు ఆనందరావు.

"ఆ జాబ్ గురించి నీతో చెప్పి నాలుగు నెలలవుతుంది. అదింకా అలాగే వుంటుందని అనుకోను. అయినా నేను రేపు వెళ్ళి మాట్లాడతాను" ఆయన వాష్‌బేసిన్ దగ్గర చెయి కడుక్కుంటూ అన్నాడు.

అంతవరకూ ఆగిన అరుంధతి వచ్చి సంజయ్ పక్కనున్న కుర్చీలో కూర్చుంది.

"ఈరోజు కోసం నేనెన్ని దేముళ్లకు మొక్కుకుంటున్నానో తెలుసా? చేతికి అందిన కొడుకువి అందరిలా సలక్షణంగా ఉద్యోగం, సద్యోగం చేసుకుంటూ ఓ ఇంటివాడివయితే ఏడుకొండలవాడి సన్నిధికి నడిచివస్తానని మొక్కుకున్నాను. ఇన్నాళ్లకు ఆ స్వామి నా మొర విన్నాడు"

సజల నేత్రాలతో అంటున్న తల్లివంక ఆశ్చర్యంగానూ, కొంత బాధగానూ చూశాడు సంజయ్.

"ఏ డ్రగ్స్‌కో, మరే చెడు వ్యసనాలకో అలవాటు పడ్డ కొడుకు తన తప్పు తెలుసుకుని బాగుపడ్డట్లు సంతోషపడుతుందేమిటి అమ్మ. నేనేమీ చెడిపోతాననుకోలేదే. భగవంతుడికి దగ్గరవుదామనుకున్నాను. దానికి ఇంతగా కడుపులో బాధపడుతూండిందా"

కొడుకు మనసులోని భావాల్ని చదివినట్లే





కళ్లు తుడుచుకుని అన్నది అరుంధతి. "ఏ వయసుకా ముచ్చట అని వూరికే అనలే దురా పెద్దవాళ్లు. ఇరవైలో అరవై, అరవైలో ఇరవైరెండూ బాగుండవు. భగవద్భక్తి, వైరాగ్యము ఇవన్నీ ప్రతి మనిషికీ అవసరమే. కానీ అవన్నీ తన విధులు, బాధ్యతలు తీర్చుకున్నవారికే బాగుంటుంది. ముగ్గురు ఆడపిల్లల మధ్య ఒక్కగానొక్క కొడుకువి. నువ్వు పెళ్ళి చేసుకుని పిల్లా పాపలతో హాయిగా వుంటే నీ నీడలో మేము కడతేరి పోవాల్సినవాళ్లం. నువ్వు ఏ ముచ్చటా తీరకుండానే వైరాగ్యంలో పడిపోతానంటే మరి మాకు దిగులు కాదూ? ఇన్నాళ్లకు నా బాధ గుర్తించావు. ఇన్నాళ్లకు నీలో ఈ ఆలోచన కలిగించిన వాళ్ళ కాళ్లకు నమస్కరించాలి"

ఆనందంగా మాట్లాడుతున్నదల్లా గబుక్కున ఆగి సందేహంగా అడిగింది. "మీ నాన్నగారన్నట్లు మళ్ళీ నీ మనసు మారదు కదూ సంజూ!"

"లేదమ్మా బాగా ఆలోచించుకున్నాకే చెప్పాను. నేనెటువెళ్ళాలో, ఏం చెయ్యాలో తోచక కన్‌ఫ్యూజన్‌లో వున్న నాకు ఆ పెద్దావిడ యధాలాపంగా అన్న మాటలే దారి చూపాయి. నా కర్తవ్యాన్ని చెప్పాయి. తోటి మనుషులకి మనవలన చేతనైన సాయం చేయలేకపోయాక ఇక మాధవుడ్నేం చేరుకుంటాం' అన్నది. ఎంత నిజం! దేముడు ఎక్కడ లేడు? ఎప్పుడు లేడు? దానికోసం మనుషుల్నించి దూరంగా పోనవసరం లేదుగా. మనసు దేమునిమీద లగ్నం కావడానికి శరీరం అయిడిల్‌గా వుండాల్సిన అవసరమేమిటి? అందుకే అందరిలా, అందరిలోనే వుంటూ నెమ్మదిగా నా వంతు సేవ నేను చేస్తూనే గమ్యం చేరాలనుకుంటున్నాను"

అరుంధతికి ఏమీ అర్థం కాలేదు సంజయ్ చెపుతున్నదేమిటో. ఎవరో పెద్దావిడ చెప్పటంవలన కొడుకిప్పుడు ఉద్యోగం చేయాలనుకోవటం మాత్రం అర్థమైంది.

"ఎవరా పెద్దావిడ? " కుతూహలంగా అడిగింది. సంజయ్ జరిగినదంతా చెప్పాడు. అంతా చెప్పి ఆ ముసలమ్మ తమ ఎదురింటావిడే అనేసరికి అరుంధతికి ఆశ్చర్యం కలిగింది.

"ఏమిటి నువ్వు చెప్పేది నిజమా? ఎదురింటి వజ్రమ్మకేనా ఏక్సిడెంటయింది. నువ్వు హాస్పిటల్లో చేర్పిందీ? నువ్వు ఫలానా అని, అదే ఆవిడకు ఎదురింటి వారబ్బాయివి అని తెలిసిందా? " అడిగింది.

"ఏమో. నేనైతే చెప్పలేదు. ఆమె మనవడు అదే ఆ లెక్చరర్ అన్నారుకదూ మీరు. అతను చెప్పాడో లేదో? "

సంజయ్ లేచి తన గదిలో కెళ్ళిపోయాడు.

"అదా విషయం!" నిట్టూర్చింది అరుంధతి. కొద్దిసేపలాగే కూర్చుండిపోయి నెమ్మదిగా లేచి గిన్నెలు తీస్తూ వంటిల్లు సర్దుకుంటూ తనలో తనే అనుకుంది.

"పోన్లే, ఏవో పాతవైరాలని నన్నవమానించినా ఆ వజ్రమ్మ మాటలవల్లే కనక నిజంగా సంజయ్ మారివుంటే ఆమె రుణం తీర్చుకోలేనిదే"

అప్పటిదాకా ఆమెమీద వున్న కోపం అంతా తుడిచి పెట్టుకుపోయినట్లనిపించింది మనసులోంచి.

"పాపం, వజ్రమ్మ కాలు విరిగి ఎలా వుందో మంచంలో. ఓ క్షణం ఓచోట కూచోక ఏదో ఓ పని చేస్తూనేవుంటుంది. ఆవిడ ఒక్కగానొక్క కొడుకు చనిపోవటంతో నింద లేనిదే భొంది పోదని నెపం ఎవరి మీదో ఒకరిమీద వేస్తేగాని మనసుకి వూరట దొరక్క నాన్నని అనుకుంది. కానీ ఆమె తప్పేముందిలే" తల్లి మనసులో వజ్రమ్మ పట్ల యిలాంటి సదభిప్రాయం కలిగిందని తెలియని సింధూర భవిష్యత్తు

గురించి దిగులుతోనే పుస్తకాలు ముందేసుకుని కూర్చునివుంది.



వజ్రమ్మను హాస్పిటల్ నుంచి ఇంటికి తీసుకువచ్చేదాక అరవింద్‌కు వూపిరి తిప్పుకోలేనంత పనయింది.

ఆవిడ ఒక్కపూటే భోంచేసినా అది హోటల్ నుంచి తెస్తే తాకను కూడా తాకదు. అందుకే ఆమె కోసమని అన్నం, పప్పు మాత్రం ఎలాగోలాగ చేసి పెరుగు, పచ్చళ్లతో ఇంట్లోంచి కేరియర్ తెచ్చేవాడు. భోజనమే కాదు పాలు, కాఫీ, మజ్జిగయినా సరే ఇంట్లోంచి తీసుకురావాల్సిందే. తన భోజనం హోటల్‌లో తిన్నా వేళవేళకి అన్నీ సర్దుకుని హాస్పిటల్‌కు రావటం అంటే అక్కడికీ ఇక్కడికీ తిరుగుతూ బాగా ఇబ్బంది పడ్డాడు.

గ్రామంలో అయితే ఇలాంటి ఇబ్బందులేవయినా వుంటే వారం పదిరోజులకి వంట చేసేందుకు పిలిచినా మనుషులుంటారు. సిటీలలో అప్పటికప్పుడు టెంపరరీగా ఎవరు దొరుకుతారు. పర్మినెంటుగా వంటమనిషిని చూసుకుందామనంటే వజ్రమ్మ ససేమిరా ఒప్పుకోలేదు.

"ఎవరో ముక్కూముఖం తెలియని వాళ్ళ చేతివంట మనమెలా తింటాం? ఈ రోజుల్లో ఎవర్ని నమ్మగలం? " అంటూందెప్పుడూ.

ఇప్పుడు ఆవిడ్ని ఇంటికి తీసుకువచ్చాక కాస్త రిలీఫ్‌గా ఫీలయ్యాడు. స్టిక్ పట్టుకుని చిన్నగా నడుస్తూ తన పనులు తాను చేసుకోసాగింది వజ్రమ్మ.

ఆవేళ సాయంత్రం కాలేజీనుంచి వచ్చి మళ్ళీ ఫ్రెష్‌గా స్నానంచేసి తయారయి బైటకు వెళ్ళబోతున్న అరవింద్‌ను దగ్గరకు పిలిచింది వజ్రమ్మ.

"విందూ, ఊరికి ఉత్తరం వ్రాసి రామిరెడ్డిని ఓసారి రమ్మను"

"ఊరికే కూచుని ఉత్తరం వ్రాయటమేగా నానమ్మా, నువ్వే వ్రాద్దూ? "

"మొన్న జరిగిన ఏక్సిడెంట్‌లో కాలు మాత్రమే విరిగింది. ప్రాణాలే పోయివుంటే ఇక ఆ వ్యవహారాలన్నీ చూసుకోవాల్సింది నువ్వే కాదూ? ఇంకా ఎన్ని రోజులని పాకులాడేది? " విసుగ్గా అన్నదావిడ.

"అబ్బా, ఇప్పుడా మాటలు ఎందుకు నానమ్మా. నీకేం కాదు. నువ్వు నిండు నూరేళ్లు బతుకుతావు అని చెప్పానా? "

"నిండు నూరేళ్లు! ఎందుకు నాయనా కాకిలాగ. జీవితమంతా పోరాడుతూనే గడిపాను. ఇప్పటికయినా నువ్వు పెళ్ళీ పేరంటం చేసుకుంటే బాగుండును. నీవు పిల్లాపాపలతో వుంటే చూసి ఆనందంగా కాలం గడుపుదామంటే ఆ రాత నాకు లేనట్లే వుంది"

"ఓ మళ్ళీ మొదలెట్టేశావా పెళ్ళి గురించి"

"మొదలెట్టడం కాదురా. ఇవాళ అమీతుమీ తేల్చేసుకుందామనుకుంటున్నాను. ఒంటి కట్టెలాగా ఎన్నాళ్లుండదలుచుకున్నావు?

నేను నాలుగు రోజులు మూలపడేసరికి తెలిసొచ్చింది. ఇంటికీ హోటల్‌కి పరుగెడుతున్నావు. ఇల్లు చూశావా ఎలావుందో? ఎంత డబ్బిచ్చినా పనిమనుషులు శుభ్రంగా చేస్తారా? అదే నీకు పెళ్ళయివుంటే ఇల్లు ఎంత కళకళలాడుతుండేది. అప్పుడయితే నాకేమయినా దిగులుండదుకదా" ఆవిడ కళ్లల్లో సన్నగా నీళ్లు తిరిగాయి. అరవింద్‌కి తనమీద తనకే కోపం వచ్చిందో క్షణం. తర్వాతా కోపం సింధూర మీద తిరిగింది.

"నేను పెళ్ళి చేసుకోనని ఎక్కడ అన్నాను. చేసుకుంటాను. మరో రెండు మూడు నెలలాగు చాలు అంటున్నా"





విప్పారిన ముఖంతో చూసింది వజ్రమ్మ.

"రెండు మూడు నెలల్లో చేసుకుంటావు సరే. పిల్ల సిద్ధంగా వుండద్దూ. నేను రెండు సంబంధాలు చూసివుంచాను. వాటిలో ఏదో ఒకటి చేసుకుంటానని చెప్పు. నువ్వ న్నట్లు పెళ్ళి రెండు మూడు నెలలాగే పెట్టు కుందాం"

"అక్కర్లేదు నానమ్మా. అమ్మాయి సిద్ధం గానే వుంది" గబుక్కున అనేశాడు అర వింద్.

"ఆ!" అదాటుగా చూసింది వజ్రమ్మ.

"అమ్మాయి సిద్ధంగా వుందా? అంటే ఎవ ర్నయినా ప్రేమించావా? ఎవరా పిల్ల? మన కులంవాళ్ళేనా సినిమాలు కథల్లోలాగా ఏ అనాధాశ్రమం పిల్లో కాదుకదా. కులం, గుణం, వంశం చూసుకోకుండా ప్రేమించే శాను. పెళ్ళాడేస్తాను అంటే నేనొప్పుకోను" ఆందోళనగా అన్నది.

"అదేం కాదు. అన్నివిధాల నీకు నచ్చే అమ్మాయే" సింధూర సంగతి చెప్పేసేందుకే నిశ్చయించుకున్నాడు అరవింద్. ఇంకా చెప్పకపోతే ఆ మూడ్‌లో ఆమె వూరిలోని ఏదో ఓ సంబంధం సెటిల్ చేసినా చేసే స్తుందేమోనని.

"నాకు నచ్చే అమ్మాయా? ఎవరు?" మనవడి ముఖంలోకి చూస్తూ అడిగింది వజ్రమ్మ.

"సిందూర!"

"సింధూర? ఎవరు సింధూర?" ఎదు రింటి అమ్మాయి చప్పున ఆమెకు గుర్తుకురా లేదు.

"మన ఎదురింటి అమ్మాయి"

చల్లగా చెప్పేశాక హమ్మయ్య అనుకు న్నాడు. ఇన్నాళ్ళూ ఆ విషయం ఎలా చెప్పాలా అని మనసులో మధన పడేవాడు. చెప్పేశాక చాలా తేలిగ్గా అనిపించింది.

"విందూ!" ఆగ్రహంగా చూసింది వజ్రమ్మ.

"విషయమంతా తెలిసీ ఆ మాట అంటు న్నావా?"

ఆమె కంఠంలోని కోపానికి ఓ క్షణం భయపడ్డా సర్దుకుని అన్నాడు.

"ఏమిటి నానమ్మా, ఎప్పటిదో పాత విషయం పట్టుకుని వాళ్ళేదో మనకు పగవా ళ్లయినట్లు మాట్లాడకు"

"పా... త విషయమా? మీ నాన్న విషయం?"

వజ్రమ్మలో అంత ఆవేశాన్ని ఎప్పుడూ చూడలేదు అరవింద్.

"నానమ్మా, నేను ఇంతకుముందోసారి కూడా చెప్పాను నీకు. వాళ్ళేదో నాన్నని హత్య చేసినట్లు మాట్లాడటంఅన్యాయమని"

"అవును. నాది అన్యాయమే. గుడ్డొచ్చి పిల్లను వెక్కిరించిందని నువ్వు నాకు న్యాయాన్యాయాల గురించి చెప్పేటంత వాడివయినావు. నువ్వాపిల్లను పెళ్లాడాలి అనుకుంటున్నావు. దానికోసం ఎట్లయినా మాట్లాడుతావు. ఇంకా పెళ్ళే కాలేదు. అప్పుడే ఆ పిల్లా వాళ్ళవాళ్లు అంత ఎక్కువై పోయారా నీకు. కన్నతండ్రిపైనా మమ కారం లేదు. ఇన్నేళ్లు పెంచి పెద్ద చేశాక ఈ ముసలిదాని మీదా గౌరవం లేదు. అంతేనా, వెళ్లు. వెళ్లు. ఆ పిల్లనే పెళ్ళి చేసుకో."

ఆవిడ ఏడుస్తుంటే నిస్సహాయంగా చూశాడు అరవింద్.

"నువ్వు పెళ్ళి చేసుకోమన్నావు. సరే అన్నాను. ఆ అమ్మాయిని వద్దన్నావు. సరే ఆ మాటా వింటాను. నేనిక పెళ్ళే చేసు కోను. అయితే నా పెళ్ళంటూ జరిగితే మాత్రం సింధుతోనే అదీ నువ్విష్టపడితేనే"

గట్టిగా అనేసి విసురుగా బయటకు వెళ్ళి



పోయాడు అరవింద్. వజ్రమ్మ కూర్చున్న చోటే అలాగే కూర్చుండిపోయింది చాలా సేపు.

ఆవిడ కళ్లముందు సింధూర మెదిలింది. కాలేజికి వెళ్ళి చదువుకుంటున్నా ఈకా



లపు చాలామంది అమ్మాయిల్లా విచ్చలవిడి ఫేషన్లు, విరగబాటు నవ్వులు, మాటలు ఏవీ కనిపించవు ఆ అమ్మాయిలో. అపరంజి బొమ్మలా వుండే రూపం, వినయవిధేయతలతో మామ్మగారూ అంటూ కలుపుగోలుతనంతో ఎంతో అణకువగా వుంటుంది.

అరవింద్‌కి అన్నివిధాలా సరిజోడీనే. కానీ... కానీ ఆ అమ్మాయి సంజీవయ్య మనవరాలన్న మాట ఎలా మరిచిపోవటం? ఆవిడ మనసులో ఆ తలపు ముల్లులా గుచ్చుకుంటూ వుంది. నిజానికి ఆ ఇంట్లో వాళ్ళంతా ఆమెకు ఎంతో నచ్చారు. కానీ వాళ్ళ సంజీవయ్య తరఫు అన్నదే నచ్చటంలేదు.

హాస్పిటల్‌నుంచి ఇంటికి వచ్చిన రెండోరోజు, కాలక్షేపానికి రోడ్డుమీదకు చూస్తుంటే ఎదురింట్లోంచి అప్పుడే వీధిలో కొచ్చి బయటకు వెళుతున్న సంజయ్ కనిపించాడామెకు.

"విందూ, విందూ" అంటూ పక్కనే వున్న అరవింద్‌ను పిలిచి,

"ఆ కుర్రాడే కదూ, నన్ను డాక్టర్ దగ్గరకు చేర్చింది? " అడిగింది.

"అవును" అంటూ మామూలుగా చెపుతున్న మనవడి వంక ఆశ్చర్యంగా చూస్తూ

"నీకు ముందే తెలుసా? ఆ అబ్బాయి మన ఎదురింట్లో వాళ్ళ అబ్బాయని? "

"ఆ తెలుసు. అతను అరుంధతమ్మగారి కొడుకు. సంజయ్"

స్నేహంగా మాట్లాడేటప్పుడు అప్పుడప్పుడూ చెపుతుంటే అరుంధతి మాటలు గుర్తొచ్చాయి వజ్రమ్మకు.

"మా అబ్బాయి ఈ రోజుల్లో పుట్టవలసినవాడు కాదు పిన్నిగారూ, ఇప్పటి కుర్రకారు ఆలోచనలు, పోకడలు ఏవీ వుండవు వాడిలో. ఎప్పుడూ దైవచింతనే. ఎలా అలవడిందో ఏమో కానీ వాడా మార్గాన్నే ఎన్నుకున్నాడు. ఇంటిపట్టున వుండడమూ తక్కువే. ఇన్నాళ్ళయిందా మీరొచ్చి వాడ్ని మీరు చూసివుండరు. వాడూ మిమ్మల్ని చూసివుంటాడనుకోను. మన చుట్టుపక్కల ఎవరున్నారో, ఏం చేస్తున్నారో కూడా పట్టించుకోడు. తన లోకంలో తానుంటాడు. ఏమిటో ఒక్కగానొక్క పిల్లాడు నాకు వాడిదే దిగులు" అంటూండేది.

"అరుంధతి కొడుకా ఆ పిల్లాడు? రెండో రోజు హాస్పిటల్లో నన్ను చూడడానికొచ్చినప్పుడే నాతో చెప్పలేదేం? నీకు తెలిసే? " అడిగింది అరవింద్‌ను.

"ఎందుకు? నువ్వాతన్ని సంజీవయ్య మనవడివి అని మెడపట్టి గెంటేందుకా? "

కాస్త కోపంగా అంటున్న అరవింద్ వంక తెల్లబోతూ చూసింది.

"నాకా మాత్రం జ్ఞానం లేదనుకుంటున్నావా? లేక మంచీ చెడు తెలియదనుకుంటున్నావా? సహాయం చేసినవారిని అవమానించి పంపుతానా? నీకు మరీ రోజురోజుకీ పెద్దా చిన్నా లేకుండా పోతోంది" అంటూ ఆరోజు మనవడ్ని కేకలేసింది. అరవింద్‌తో అన్నదే కానీ వాళ్ల సంజీవయ్యకు సంబంధించిన వారు కాకపోయివుంటే ఆ సహాయానికి అప్పటికప్పుడు ఎదురింటికి ఎన్నో కానుకలు పంపి మర్యాదలు చేసివుండేదే?



వజ్రమ్మ మెల్లగా లేచి స్టిక్ అందుకుని నెమ్మదిగా నడుస్తూ వెళ్ళి దేముని పటాల ముందు నిలబడింది.

"ఏడు కొండలవాడా మా అరవిందుడికి పూర్ణాయుష్షుని ప్రసాదించు. ఈ వంశం పిల్లా పాపలతో కలకాలం వర్ధిల్లేలా దీవించు. నా కొడుకుని అల్పాయుష్కుడ్ని చేశావు.

ఎదురింటి అరుంధతి కోసం వెళ్ళినప్పుడే ఆ గొడవంతా మొదలై మనశ్శాంతి లేకుండా పోయింది. మళ్ళీ నా మనవడు ఆ ఇంటి అమ్మాయినే పెళ్లాడాలంటున్నాడు. చరిత్ర పునరావృతం చేయకు తండ్రీ" అని ప్రార్థించింది.

కొడుక్కి అలా అయ్యాక ఆమెకు జాతకాలంటేనే ఎడతెగని భయం పట్టుకుంది. మంచి అయితే ఫరవాలేదు. కానీ అదే ఏ చెడువార్తో అయితే తట్టుకునే గుండెనిబ్బరం ఇక తనకు లేదనుకుని అరవిందు జాతకం ఇంతవరకూ ఎవరికీ చూపించలేదు. అసలు రాయించనే లేదు. అరవిందు ప్రతి పుట్టిన రోజునాడు గుడికి వెళ్ళి అర్చన చేయించి పూర్ణాయుష్షుని ప్రసాదించమని వేడుకుని

వస్తుంది అంతే. అలాంటిది మళ్ళీ సంజీవయ్య తాలుకా అమ్మాయితో సంబంధం అనగానే ఆమె మనసు ఏదో కీడునే శంకించసాగింది.

★ ★ ★

నానమ్మతో గొడవపడిన అరవింద్ చిరాగ్గా వున్న మనసుతో స్కూటర్ తీసుకుని బయలుదేరాడు.

వీధిమలుపు తిరిగి బస్టాపువైపునుంచి వెడుతుంటే బస్సుకోసం నిలుచుని వున్న వారిలో సంజయ్ కనిపించాడు. చూసి పలకరింపుగా నవ్వి పక్కకొచ్చి స్కూటరాపాడు అరవింద్.

"బస్సుకోసమేనా చూస్తున్నారు. రండి నేను డ్రాప్ చేస్తాను"

"ఎందుకులెండి. మీరెక్కడికో పనిమీద వెడుతున్నట్లున్నారు" మొహమాటపడ్డాడు సంజయ్.

"పనేమీలేదు. ఏమీ తోచక వూరికే అలా బయలుదేరాను. అంతే. రండి"

అతను మరీ అడగటంతో సంజయ్ వచ్చి వెనుక కూర్చున్నాడు. స్కూటర్ని ముందుకు పోనిస్తూ అడిగాడు అరవింద్.

"ఎక్కడ డ్రాప్ చేయమంటారు? "

"నేనూ ఏమీ తోచకే ఇలా బయటకొచ్చాను. మీ ఇష్టం. మీరెటు వెళుతున్నారో అటే పోనివ్వండి" అన్నాడు సంజయ్.

"సరే అయితే, ట్యాంక్‌బండ్‌వైపు వెళదాం" అంటూ స్కూటర్ అటు తిప్పాడు అరవింద్.

ట్యాంక్‌బండ్‌పై పార్కింగ్‌ప్లేసు చూసుకుని స్కూటర్ పార్క్ చేసుకుని వచ్చి ఖాళీగా వున్న ఓ బెంచీపై కూర్చున్నారు.

"నేను చాలా రోజులనుంచీ మీతో ఓ విషయం మాట్లాడాలనుకుంటున్నాను. లక్కీగా, తీరిగ్గా దొరికారు మీరు" అన్నాడు.

అరవింద్ "మళ్ళీ మళ్ళీ ఇలాంటి అవకాశం దొరుకుతుందో లేదో. ఇతను ఒంటరిగా తీరిగ్గా దొరికాడు. తమ ప్రేమ విషయం వాళ్ళ ద్వారా వీళ్ళ ద్వారా తెలిసి వీళ్ళడగటం, జవాబు చెప్పాల్సి రావటం డెలికేట్‌గా వుంటుంది. ఎప్పుడూ స్ట్రెయిట్ ఫార్వర్డ్‌నెస్ మంచిది. సింధు ఏమైనా అనుకోనిగాక" అని మనసులో అనుకుంటూ ండగా-

"చెప్పండి" అన్నాడు సంజయ్.

"సింధు విషయమేనేమో. తానే అడగాలనుకుంటున్నాడు. అతనంతట అతనే చెప్పబోతున్నాడు. మరీ మంచిది. తానేమి తెలియనట్లు వింటేసరి" అనుకున్నాడు మనసులో.

"నాకు డొంకతిరుగుడుగా మాట్లాడటం రాదు. నేరుగా విషయానికొచ్చేస్తాను. దయచేసి మీరు మరోలా అనుకోవద్దు. ఈ విషయంలో పెద్దవాళ్ళకన్నా చిన్నవాళ్ళే ఒకరినొకరు సరిగా అర్థం చేసుకోగలరన్న ధైర్యంతో ముందీ విషయం మీతోనే చెపుతున్నాను" అంటూ ఓ నిముషం ఆగాడు అరవింద్.

"నేనూ మీ చెల్లాయి సింధూర ఒకర్నొకరం ఇష్టపడుతున్నాం. నాతో సింధు పెళ్ళికి మీరంగీకరిస్తారా? "

సంజయ్‌కి అతని ధైర్యానికి మెచ్చుకోవాలనిపించింది.

"ఎంత నిర్భయంగా, సిన్సియర్‌గా అడుగుతున్నాడు"

అతనేమీ మాట్లాడకపోవటం చూసి అరవిందే మళ్ళీ అన్నాడు.

"మా ప్రేమ సంగతి సింధు తనుగా ఎటూ మీ ఇంట్లో చెప్పదు. నాకు ఆమె భయాలు తెలుసు. ఇక నేను మా ఇంట్లో చెపితే మా నానమ్మ వచ్చి అడగటం సంప్రదాయంగానే వుంటుంది. కానీ ఆవిడ అడగదు. ఎందుకంటే ఆమెకీ పెళ్ళి ఇష్టం లేదు



కనక. ఇంక నేనే వచ్చి మీ అమ్మా నాన్నలతో మాట్లాడాలి. నాకు వాళ్ళకన్నా మీతోనే కాస్త అయినా పరిచయం వుంది. అదీగాక దగ్గర దగ్గర ఒకే ఏజ్ వాళ్ళం. మీకు నా ప్రపోజల్ ఇష్టం లేకపోయినా చెప్పే విధానం హర్ట్ చేసేదిగా వుండదు. అలాకాక మీకూ ఇష్టమే అయితే ఈ విషయం మీరే మీ అమ్మా నాన్నలతో మాట్లాడొచ్చు"

సంజయ్‌కి అతను పద్ధతిగా మాట్లాడే విధానం నచ్చింది.

"సింధు ఎన్నిక మెచ్చుకోదగ్గదే. తల్లీ తండ్రి వెదికి తెచ్చినా ఇంతకన్నా మంచి సంబంధం తేగలరా? అందం, ఆస్తి, చదువు, గుణం, మంచి ఉద్యోగం, మంచి కుటుంబం ఇన్నీ వున్న అరవింద్‌ను వాళ్లు మాత్రం ఎందుకు కాదంటారు? కానీ ఇతనేమిటి వాళ్ళ నానమ్మకు ఇష్టం లేదంటాడు. ఆవిడకిష్టం లేకుండా పెళ్ళి ఎలా జరుగుతుంది. అయినా ఆవిడకెందుకిష్టం లేదు. కాదనడానికి సింధుకి మాత్రమేంతక్కువ? "

అదే అడిగాడు అరవింద్‌ను.

"ముందిది చెప్పండి. మీ నాన్నమ్మగారికెందుకిష్టం లేదు? "

"అదో పెద్ద కథలెండి" అరవింద్ పక్కనే వున్న చిన్న గులకరాయిని వంగి తీసుకుని దూరంగా నీటిలోకి విసిరేశాడు.

ప్రశ్నార్థకంగా చూశాడు సంజయ్.

జరిగిందంతా సవివరంగా చెప్పాడు అరవింద్.

సంజయ్‌కీ చాలా ఆశ్చర్యంగా అనిపించింది. ఇంత గొడవుందా ఎదురెదురుగా వున్న తమ రెండు కుటుంబాల మధ్య?

"మరి ఇంత తెలిసీ మీరీ పెళ్ళి సవ్యంగా జరుగుతుందనే అనుకుంటున్నారా? " అడిగాడు అరవింద్‌ను.

"నిజమే, జరక్కపోవచ్చు. కానీ పెళ్ళంటూ జరిగితే సింధుతోనే అని నేనెప్పుడో నిశ్చయించుకున్నాను. ముందు మీ ఇంట్లోవాళ్ళకెవరికీ అభ్యంతరం లేదు అన్న సంగతి తెలిస్తే నేను మా నానమ్మకెలాగో నచ్చ చెప్పేందుకు ప్రయత్నిస్తాను"

"నేనూ మా అమ్మా నాన్నలతో మాట్లాడుతాను" అన్నాడు సంజయ్.

"థాంక్యూ వెరీమచ్"

తమ పెళ్ళికి యిష్టపడిన, అదే అభ్యంతరం లేనివారు అప్పటికి ఒక్కరైనా కనిపించినందుకు అరవింద్‌కు సంతోషంగా అనిపించింది.

"రండి, ఇక వెళదాము" లేచాడు సంజయ్.

"పదండి" స్కూటర్‌వైపు దారితీసాడు అరవింద్.



ఇంటిదగ్గర సంజయ్‌కి గుడ్‌నైట్ చెప్పి తమ ఇంటిలోకి వెళ్ళిపోయాడు అరవింద్.

సంజయ్ లోపలికి రావటంతోనే సింధూర ఆదుర్దాగా ఎదురొచ్చింది.

"అన్నయ్యా, త్వరగారా. ఇందాకట్నుంచి చూస్తున్నాను నీకోసం. ఎక్కడికెళ్లిపోయావు? అమ్మకి ఒంట్లో బాగులేదు" చెప్పింది.

"అమ్మకి ఒంట్లో బాగులేదా? ఏమయింది? "

అతనూ కంగారుగా లోపలి గదిలోకి నడిచాడు. అక్కడ అరుంధతి మంచంపై కళ్ళు మూసుకుని పడుకునివుంది. బాగా ఏడ్చినట్లు ముఖమంతా పీక్కుపోయివుంది.

దగ్గరకు పోబోతుంటే సింధూర 'ఉష్' అంటూ చేయిపట్టుకుని మళ్ళీ హాల్లోకి తీసుకొచ్చింది.

"ఇప్పుడే అమ్మకు నిద్రపట్టినట్లుందిలే...




లేపకు" అన్నది.

"అసలేమయింది? " సంజయ్‌కిదంతా గందరగోళంగా వుంది. చప్పుడు చేయకుండా నడుస్తూ వెళ్ళి సింధూర ఓ కాగితం తెచ్చి అతని చేతిలో పెట్టింది.

అదో ఉత్తరం. ఆనందరావు చేతి వ్రాతలో వుంది.

"అరుంధతీ,

ఈ ఉత్తరం చూసుకుని కంగారుపడకు. నిదానంగా చదువు. మన ఇన్నేళ్ళ కాపురంలోనూ నువ్వు నన్ను అర్థంచేసుకున్నదే తక్కువ. నీకు నీ పిల్లలతోడిదే లోకం. నేనున్నా, లేకున్నా నీకొకటే. అందుకే నేను వెళ్ళిపోవటం నిన్నంతగా బాధిస్తుందని నేను అనుకోను. చిన్నప్పట్నుంచీ కూడా నాకు నాటకాలంటే ఎంతో ఇష్టం. గొప్ప నటుడిగా, నాటక దర్శకుడిగా పేరు తెచ్చుకోవాలని కలలుకనే వాడిని. కానీ మా నాన్నకి నాటకాలంటేనే కోపం, అయిష్టత. మా నాన్నంటే నాకు చాలా భయముండేది. ఆయన చండశాసనుడు. ఆయన బ్రతికున్నంతకాలం నేను ధైర్యం చేయలేకపోయాను. నాటకాలన్నమాట కూడా ఎత్తలేదు.

సరే, ఆయన చనిపోయేనాటికి పిల్లల తండ్రిని అయిపోయాను. ఎదుగుతున్న ఆడపిల్లలు, వాళ్ళ పెళ్ళిళ్ళు, బాధ్యతలు, ఉద్యోగనిర్వహణలో ఉరుకులు, పరుగులు, అప్పుడూ నాకు అవకాశం లేకపోయింది. సరే ఉద్యోగంలోంచి రిటైరయిన తర్వాతయినా నా జీవితం నా ఇష్టంగా మలుచుకుందామనుకున్నాను. ఇక ఈ వయసులో నటుడిగా రాణించలేకపోయినా దర్శకత్వమన్నా చేయాలన్నది నా ఆశ.

కానీ నువ్వు రిటైరయితే మాత్రమేం ముసలితనం ఏమీ రాలేదుకదా. మరోచోటెక్కడైనా ప్రయత్నం చేసి ఇంకో ఉద్యోగమే దన్నా చూసుకోవచ్చన్నావు. నేను నీకూ, నీ పిల్లలకూ ఒక సంపాదనా యంత్రంగా మాత్రమే కనిపించడం నా దురదృష్టం. ఇన్నాళ్ళూ హఠాత్తుగా ఇలా నాదారి నేను చూసుకుంటే ఇంటి సంగతి ఏమిటనే ఆగాను. ఇప్పుడిక ఆ భయంలేదు. సంజుకి బాధ్యత వచ్చింది. వాడు మా ఫ్రెండు కంపెనీ ఉద్యోగంలో రేపు ఫస్టునుంచీ వెళ్ళి జాయినవ్వచ్చు. ఇక సింధు పెళ్ళి గురించీ నువ్వు కంగారుపడనవసరంలేదు. నాపేర బేంక్‌లో ఉన్న డబ్బంతా నీపేర మార్పించాను. పాస్‌బుక్ బీరువాలో వుంది చూసుకోవలసింది. నువ్వు సంజయ్, అల్లుళ్ళు కలిసి సింధుకి మంచి సంబంధం చూడగలరనే అనుకుంటున్నాను.

నేను ఇంటినుంచి వెళుతున్నా ఎప్పటికప్పుడు ఇంటి సంగతులు కనుక్కుంటూనే వుంటాను. సింధు పెళ్ళికి ఎక్కడున్నా ముహూర్తం రోజుకి వస్తాను. నేను ఎక్కడికి వెళుతున్నానోనని కంగారు పడవద్దు. ఇక నా జీవితం నాటక కళకే అంకితమిద్దామనుకుంటున్నాను. ఈ సినిమాల టెలివిజన్ల యుగంలో నాటక కళకి మళ్ళీ పూర్వపు వైభవం తేవటమే నా ఆశయం. నీకూ, పిల్లలకి ఆశీస్సులతో,

ఆనందరావు"

ఉత్తరం పూర్తిచేసిన సంజయ్ నిశ్చేష్టుడయ్యాడు.

"ఈ వయసులో తండ్రి ఇల్లు వదిలి వెళ్ళడమేమిటి? ఇది నలుగురికీ తెలిస్తే ఎంత అవమానం. ఇదేమిటి నాన్నిలా చేశాడేమిటి? "

ఉత్తరం చదవగానే తనలో చెలరేగుతున్న భావాలే అన్నగారిలోనూ కలుగుతున్నాయని అతని ముఖాన్ని చూస్తూనే అనుకుంది సింధూర.

తండ్రి ఎక్కడికి వెళ్ళి ఉంటాడో కూడా వూహించగలిగింది. తప్పక ప్రమద్వర వాళ్ళ

ట్రూపుతోనే వెళ్ళివుంటాడు.

అదే విషయం సంజయ్‌తో చెప్పింది.

"ప్రమద్వరా? ! ఆవిడెవరు? " వింతగా అడిగాడు. ఆవిడో నాటక కళాకారిణి అనీ ఒకరోజు తండ్రి ఆవిడని ఇంటికి తీసుకురావటం, ఆ తర్వాత కూడా ఒకటి రెండుసార్లు తాను ఆవిడతో తండ్రిని చూడటం చెప్పింది.

సంజయ్‌కీ చప్పున గుర్తొచ్చింది పార్కులోని దృశ్యం. ఓ అందమైన మధ్యవయసు స్త్రీతో తండ్రి సన్నిహితంగా కూర్చుని మాట్లాడటం. అయితే ఆవిడే అన్నమాట ప్రమద్వర అనుకున్నాడు.

"ఆవిడ అడ్రసు తెలుసా నీకు? " అడిగాడు చెల్లిని.

"తెలియదన్నయ్యా"

"ఈ మహానగరంలో అడ్రసు తెలియకుండా ఆవిడనెక్కడని వెతగ్గలం. అయినా వెతకాలిగా. రేపు నాటక సమాజాలన్నింటి అడ్రసులకూ వెళ్ళి విచారిస్తే సరి" అన్నాడు.

"అంటే మరి. ఆ, అదో అమ్మపిలుస్తున్నట్లుంది చూద్దాం" అంటూ లోపలనుంచి అరుంధతి స్వరం విని గబగబా అటు నడిచింది సింధూర.

అనుసరించాడు సంజయ్.

కొడుకుని చూడగానే మంచంమీదనుంచి లేచి కూర్చుని భోరున ఏడుస్తూ పైట చెంగు ముఖాన కప్పుకుంది అరుంధతి.

చప్పున తల్లిదగ్గరకెళ్ళాడు సంజయ్.

"ఊరుకో అమ్మా, ఇప్పుడేమయిందనీ. నాన్నగారు బాగానే వున్నారు. కాకపోతే ఆయనకి కొన్నిరోజులలా బయట వుండిరావాలని ఉండివుంటుంది. త్వరలోనే వచ్చేస్తారు. నేను వెళ్ళి తీసుకొచ్చేస్తానుగా. రేపే వెళ్లి నాన్నగారు ఎటువెళ్లారో కనుక్కుని పిలుచుకొచ్చేస్తాను, సరేనా? "

"మీనాన్న... మీనాన్న వస్తారంటావా? "

"ఏమిటమ్మా మహామహావాళ్ళే ఇల్లు, సంసారం మోహాలనుంచి తప్పించుకోలేకపోయారు. తప్పక వచ్చేస్తారు"

"సంజూ, ఈ వయసులో నాకీ కష్టమేమిటి చెప్పు. ఇన్నాళ్ళూ నా భర్తా, నా పిల్లలు అనే లోకంలో గౌరవంగా బతికాను. ఇప్పుడు...? " దుఃఖంతో మాటలు రాలేదు ఆమెకు.

"ఊరుకో అమ్మా, నాన్నగారు వచ్చేస్తారని చెపుతున్నాకదా" సంజయ్‌కి ఆ క్షణంలో తండ్రిమీద ఎంతైనా కోపం వచ్చింది. ఎంతటి సాధుస్వభావం తల్లిది. పన్నెత్తి పరుషంగా ఎవర్నీ ఒక్క మాటనగా ఇంతవరకూ తానెరగడు. తనేమిటో తన లోకమేమిటో తప్ప మరోటి తెలియదు. తనకోసమని ఆమె ఆలోచించటం తామెవ్వరికీ తెలియదు. ఇరుగు పొరుగు వారితో ఎప్పుడైనా తీరిక దొరికితే ఓ అయిదు నిముషాలు మాట్లాడటమేకానీ ఆమెకంటూ స్నేహితురాళ్ళులేరు. పుస్తకాలు చదవదు. సినిమాలకెళ్ళదు. టీవి ముందుకూడా పట్టుమని పది నిముషాలు స్థిమితంగా కూచోదు. ఎప్పుడూ ఏదో ఓ పనిలోనే వుంటుంది. అటువంటి తల్లిని తన తండ్రి సరిగా అర్థం చేసుకోకుండా యిలా ఇల్లు కదలడమేమిటి?

దీనికంతా తను కూడా ఓ కారణం కాలేదుకదా? నాన్న ఉత్తరంలో వ్రాసి వున్నాడుగా. ఇన్నాళ్ళు తను బాధ్యత లేకుండా వున్నాడని ఆయన ఆగాడుట. ఇప్పుడు తనకి ఇంటిపై బాధ్యత వచ్చేసరికి ఆయన బాధ్యత తీరిపోయిందన్నమాట!

ఆహా ఏం లాజిక్కు!

★ ★ ★

మరునాడు పొద్దున్నే బయటకు బయలుదేరబోతూ సంజయ్ సింధూరను అడిగాడు.

"సింధూ, నువ్వీరోజు కాలేజీకి వెళ్ళటంలే




చుకదూ? "

"లేదన్నయ్యా. అమ్మనీ పరిస్థితిలో ఒంటరిగా వదిలితే ఎలా! పోనీ, అక్కయ్యలకి ఉత్తరం వ్రాద్దామా? " అన్నది.

"వద్దొద్దు, గబుక్కున లెటర్ రాసెయ్యకు. విషయం అక్కయ్యలవరకే వుండదుకదా, బావగార్లకీ, అటువైపు వాళ్ళ ఫేమిలీస్‌కి ఆ తర్వాత వూరందరికీ తెలుస్తుంది. ఇదంతా మనంతట మనమే దండోరా వేసినట్లుంటుంది. ఇప్పుడేమయిందని, రెండుమూడు రోజుల్లో నేను నాన్న ఎక్కడ వున్నదీ కనుక్కుంటాను. ఎక్కడున్నాడో తెలిస్తే నేనే స్వయంగా వెళ్ళి ఇంటికి తీసుకొచ్చేస్తాను. ఇంతలో అక్కయ్యలకీ, బావలకీ తెలియచేయటం ఎందుకు. వాళ్ళు మాత్రం వచ్చి ఏం చేస్తారు? "

సింధూరకు అదీ నిజమేననిపించింది. కానీ తర్వాత విషయం తెలిస్తే మాత్రం అక్కయ్యలు, బావలు కేకలేస్తారు. నిష్టూరాలాడతారు. పెద్దవాళ్లం మాకు తెలపక్కరలేదాని.

అదే అన్నది సంజయ్‌తో.

"అననీ, ఓసారంటారు. అదే పట్టుక్కూర్చోరుకదా. కానీ ఇప్పుడు చెబితే వాళ్ళంతా రావటం, అమ్మకి ఓదార్పు చెప్పబోతూ ఒకటనబోయి మరొకటనటం అమ్మకి కూడా మరింత బాధ ఎక్కువే అవుతుంది. పెద్దక్కయ్యవాళ్ళ అత్తగారి సంగతి తెలిసిందే కదా, ఏమీ లేనిదానికి కూడా గోరంతలు కొండంతలు చేస్తుంది"

"సరే అన్నయ్యా, నీఇష్టం అనేసింది సింధూర. సంజయ్ చెప్పులేసుకుని గుమ్మం దాటుతుంటే హఠాత్తుగా గుర్తొచ్చింది ఆమెకు.

అన్నయ్యా, చెప్పటం మర్చేపోయాను. ఆ ప్రమద్వరను టీవీ సీరియల్‌లో చూశాను. నాటకాలలో కూడా అప్పుడప్పుడు చూస్తూనే వుంటాను. నువ్వు నాటక సమాజాలవీ ఏం వెతకక్కరలేదు. నేరుగా టీవీ స్టేషన్‌కెళ్ళు ఆవిడ అడ్రసు అక్కడ తప్పక దొరుకుతుంది. "

"మరీ విషయం ముందే చెప్పవేం. సరే అయితే నేను అక్కడికే వెళ్ళి ప్రయత్నిస్తాను. ఆవిడ అడ్రసు దొరికితే అట్నుంచటే వాళ్ళ ఇంటికి వెళతాను. కాస్త ఆలస్యం అవుతుందేమో. కంగారుపడకు. అమ్మ జాగ్రత్త"

సంజయ్ వడివడిగా వెళ్ళిపోయాడు. అతను వెళుతుంటే చూస్తూ వెనుకనే గేటు దాకా వచ్చింది సింధూర, మనసులో తండ్రి ఆచూకి దొరికి వెంటనే ఇంటికి వచ్చేలా చేయమని దేముడ్ని ప్రార్థిస్తూ.

ఎదురింట్లోంచి అప్పుడే బయటకు వచ్చాడు అరవింద్. కాలేజీకి వెళ్ళేందుకు సిద్ధంకానట్లు నైటీలో నిలబడి వున్న సింధూరను ప్రశ్నార్థకంగా చూశాడు.

అటూ ఇటూ గమనించి తమనెవరూ చూడటం లేదనుకున్నాక

"ఏమయింది? కాలేజీకి రావటం లేదా?" సైగల ద్వారా ప్రశ్నించాడు.

తల అడ్డంగా తిప్పింది సింధూర.

"ఏం? " అడిగాడు.

"సైగల ద్వారా చెప్పే విషయమా? ఇది" మనసులో అనుకుని,

"మళ్ళీ చెప్తాను" అన్నట్లు సైగచేసి గబగబా లోపలకి వచ్చేసింది.

"ప్చ్, ఈ సింధుతో అంతా సస్పెన్సే" అనుకుంటూ తన స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు అరవింద్.

తమనెవ్వరూ గమనించలేదని వాళ్ళిద్దరూ అనుకున్నా లోపలి గదిలోని కిటికీలోంచి ఆ సైగలను వజ్రమ్మ చూడనే చూసింది.

"ఈ సైగలకీ, కళ్ళతో మాట్లాడుకోవటా

నికీ అనువుగా వుంటుందనే కాబోలు విందూ పట్టుబట్టి తనకెన్నో మాటలు చెప్పి ఈ ఇల్లు కొనిపించాడు. ఓరి పిడుగా, తానింకా తన మనవడు ఉత్త అమాయకుడు. ఈకాలం కుర్రాళ్ళలాకాదు, ఆడపిల్ల అన్నా, పెళ్ళి అన్నా ఆమడదూరం పరుగెత్తుతున్నాడు అనుకుంటూందికానీ, అమ్మో ఎన్ని వేషాలు నేర్చాడు? ఆ! వాడిమొహం, వీడికి ఇన్ని తెలివి తేటలు ఎక్కడున్నాయి. అమాయకపు వెధవ. ఆ పిల్లే వీడ్ని ఈ ప్రేమ వ్యవహారంలోకి లాగి ఇవన్నీ నేర్పి వుంటుంది"

ఆమెకాక్షణంలో సింధూరమీద చాలా కోపం వచ్చేసింది. అప్పటికప్పుడు ఎదురింటికి వెళ్ళి నాలుగూ అడిగి రావాలన్నంత ఆవేశమూ కలిగింది.

కానీ ఆమెకున్న వ్యవహార జ్ఞానమూ, లౌక్యమూ వల్ల ఆ ఆవేశాన్ని అదుపులోకి తీసుకుంది.

"ఆవేశాలు, తగవులు వల్ల పరిష్కారమయ్యే సమస్యకాదిది. ఇప్పటికే ఓసారి విందూతో వీల్లేదని వాదించి అనవసరంగా విషయాన్ని కాస్తా గట్టిపరిచింది. ఇప్పుడు తానెళ్లి అరవటం, అది విందూ చెవి దాకా వెళ్లటం తనకూ వాడికీ మళ్ళీ గొడవరావటం, వాడు మరింత మొండికి తిరగటం అవుతుంది. తనేం చేయాలనుకున్నదో అది ఎవరికీ అనుమానం రాకుండా నిశ్శబ్దంగా చేయగలగాలి. అన్నీ సహజంగా జరిగినట్లే వుండాలి. తను జీవితంలో ఎన్ని ఢక్కామొక్కీలు తిన్నది. ఇది ఓ లెక్కలోనిదా? కాకపోతే సమస్య ఎంత జటిలమో పరిష్కారం అంత సున్నితంగా వుండాలి. అంతే, నిదానంగా ఆలోచిస్తే వుపాయం తట్టకపోదు"

ఆమె అలా అనుకున్నాక ఆ విషయం గురించే తీవ్రంగా ఆలోచించటం మొదలుపెట్టింది. సాయంత్రందాకా అలా ఆలోచిస్తూనే వుంది.

సాయంత్రం అరవింద్ ఇల్లు చేరే సమయానికి ఆమెకు ఉపాయం తట్టనే తట్టింది.

దాంతో మనవడి కోసం ఉత్సాహంగా ఎదురు చూడసాగింది. అరవింద్ కాలేజి నుంచి వచ్చి కాళ్ళు, చేతులు ముఖం కడుక్కోవటం ఆలస్యం వేడివేడి బజ్జీల ప్లేటు తెచ్చి ముందుపెట్టింది.

ఆవిడ ముఖంలోకి చూశాడు అరవింద్. ప్రసన్నంగానే వుంది. సింధు విషయం చెప్పినప్పట్నుంచీ ఇద్దరి మధ్యా ముభావమే తప్ప మాటలు లేవు. కోపంగా ముఖం ముడుచుకునే వున్న ఆమె అంత శాంతంగా, అసలేమీ జరగనట్లే వుంటే కాస్త అనుమానంగానూ, ఆశ్చర్యంగానూ చూశాడు.

"కోపం పోయిందా నానమ్మా? నాకిష్టమైన ఇంత మంచి టిఫిన్ చేశావు. అయినా ఇప్పుడేగా హాస్పిటల్ నుంచి వచ్చావు. అప్పుడే ఇలాంటి పనులన్నీ చేయటమెందుకు" అడిగాడు ప్లేట్లోని బజ్జీలు తీసుకుంటూ.

"నీమీద నాకు కోపం ఏమిట్రా పిచ్చిసన్నాసి? ఇక ఇవి చేయటం ఎంతసేపు, స్టవ్ దగ్గర పదినిముషాలు నిలుచుంటే అయిపోయింది." అన్నది తేలిగ్గా.

"కోపం పోయిందంటే సింధుతో పెళ్ళి విషయమూ అంగీకరించినట్లేనా?"

నాలుక చివరిదాకా వచ్చిన మాటని అడక్కుండా ఆపేశాడు అరవింద్.

"తొందర పడటం ఎందుకు? ఆవిడే ఆ టాపిక్ ఎత్తనీ. ఇష్టమైతే ఎటూ తనూరుకోదుకదా" అనుకున్నాడు.

కాఫీగ్లాసు పక్కనే పెడుతూ "నిన్నొకటి అడుగుతాన్రా అబ్బాయ్, కాదనవుగా" అడిగింది వజ్రమ్మ.

"పెళ్ళి విషయం తప్ప ఏదన్నా అడుగు" చెయి కడుక్కునే నెపంతో అక్కడ్నుంచి





లేస్తూ అన్నాడు, "ఇప్పుడెటూ తన అభిప్రాయము చెప్పాలిగా" అనుకుంటూ.

కానీ వజ్రమ్మ తెలివిగా ఆ విషయాన్ని దాటవేస్తూ, "అది కాదు విందూ, మనమొకసారి మద్రాసు వెళ్ళాలిరా?" అన్నది.

వింతగా చూశాడు అరవింద్.

"ఇంకా ఏమిటో చెపుతుంది, అడుగుతుంది అనుకుంటే ఇదేమిటి?" అనుకుంటూ "మద్రాసా? ఎందుకు?" అడిగాడు.

"మా విశ్వనాథం బాబాయ్ వాళ్ళింటికి వెళ్ళాలి. వాడు పెళ్ళి చేసుకున్నప్పట్నుంచీ పిలుస్తూనే వున్నాడు. ఇదో వస్తాను, అదో వస్తాను అంటూనే వున్నా. పాతికేళ్ళు గడిచిపోయాయి. విశ్వం దగ్గర్నుంచి వాళ్ళ బ్బాయి పెళ్లి శుభలేక దాంతోపాటు తప్పక రావాలన్న ఉత్తరమూ వచ్చిందికదా. మద్రాసు వెళదాం. పెళ్లికి వెళ్లినట్లు వుంటుంది. అటునుంచి కంచి, రామేశ్వరం ఇవన్నీ కూడా చూసి రావచ్చు" తాపీగా చెప్పింది వజ్రమ్మ.

"ఇప్పుడు కంచి, రామేశ్వరం ఏమిటి హఠాత్తుగా?"

"ఇప్పుడంటే ఏమిటి నీ ఉద్దేశం? కంచీ రామేశ్వరాలు చూడాల్సిన వయసుకాదా నాది?"

ఏం చెప్పాలో అర్థం కానట్లు చూశాడు అరవింద్.

నిన్న మొన్నటిదాకా "నీ పెళ్ళి అయితే గాని నాకు నిశ్చింతలేదు. నీచేత ఆ మూడు ముళ్లూ వేయించి నిన్నో ఇంటివాడిని చేస్తే కానీ ఈ సంసార బంధనాలనుంచి నాకు విముక్తి దొరికినట్లు కాదు. అప్పుడింక ఏ కాశీ రామేశ్వరాలకో వెళ్లి భగవత్సేవ చేసుకుంటూ శేషజీవితం గడపాలన్నది నా ఆశ!

అనే నానమ్మ పెళ్ళీ గిళ్లీ మాట కూడా ఎత్తకుండా హఠాత్తుగా కంచీ, రామేశ్వరం అంటుందేమిటి? తన పెళ్ళి విషయం ఏం ఆలోచించినట్లు?" కానీ ఆమెను నేరుగా "మరి నా పెళ్లి సంగతేం చేశావు?" అని అడగటానికి మొహమాటంగా అనిపించింది. ఇన్నాళ్లూ ఆమె వెనుకపడేది పెళ్ళి చేసుకోమంటూ, సింధు సంగతి చెప్పిన తర్వాత వీల్లేదన్నది సరే, ఆ విషయమై మళ్ళీ మాట్లాడదేమిటి?" తనలోతను ఆలోచించుకుంటున్నట్లునిశ్శబ్దంగా వుండిపోయిన మనవడివంకే చూస్తూ అడిగింది వజ్రమ్మ.

"ఏమిట్రా? ఏం మాట్లాడవు?"

"ఆ! ఏం లేదు"

"ఏంలేదు కాదు. సెలవు పెట్టు అంటున్నాను"

"సెలవా? ఇప్పుడు హఠాత్తుగా సెలవు అంటే...?"

"ఏమవుతుంది? ఒక్కోసారి సెలవులు హఠాత్తుగానే పెట్టాల్సివస్తుంది. నేను విశ్వం కొడుకు పెళ్ళికి వెళదామనుకుంటున్నాను. ఇక నాతో నువ్వూ వస్తున్నావు. నువ్వే చెప్పేవాడివి, నానమ్మా నువ్వు తీర్థయాత్రలంటూ అందరితోపాటు ఆ బస్సుల్లో వెళ్ళక్కరలేదు. నిన్ను నేనే స్వయంగా అన్ని స్థలాలకు తీసుకెళ్ళి చూపిస్తాను అని"

"నిజమే అన్నాను. పెళ్ళంటే సరే వెళదాం. ఇప్పుడర్జంటుగా తీర్థయాత్రలకెందుకూ అని. ఇంకో రెండు మూడు నెలల్లో సెలవులెటూ వస్తున్నాయిగదా అప్పుడెళదాం"

"లేదు విందూ. వేసవిలో నేను ఆ వూర్లన్నీ తిరగలేను. అదీగాక ఎటూ అంత దూరం వెళుతున్నాంకదా. ఆ చుట్టుపక్కలున్నవి చూసేసి వద్దాం. కాస్త మార్పు కావాలనుంది నాకు. అట్లా నాలుగు ప్రదేశాలు చూసి వస్తేనన్నా మనసు ప్రశాంతంగా వుంటుంది. అసలు కాలు, చెయ్యి సరిగా వున్ననాడే తిరగాలి, చూడాలి. నానాటికి దిగజారే ఆరోగ్యమే కానీ బాగుండే వయసు

కాదుగదా నాది"

"అది కాదు... నానమ్మా"

అతని మాటలకి మధ్యలోనే అడ్డొచ్చింది వజ్రమ్మ.

"విందూ, నువ్వు వస్తే రా! లేదు, నానమ్మా నేను నీ మునుపటి మనవడ్ని కాదు, ఎదిగిపోయాను. నీ మాట వినలేను అంటే నువ్వు సెలవు పెట్టక్కరలేదు. నేను ఒక్కదాన్నే వెళతాను"

ఖచ్చితంగా చెప్పేసింది.

నిస్సహాయంగా చూశాడు అరవింద్. ఇంకా మాటకి తిరుగేముంటుంది.

"అలాగే. వెళదాం నానమ్మా" అన్నాడు మెల్లగా.

అరవింద్ దగ్గర్నుంచి ఆ మాట వచ్చిన తర్వాత గానీ ఆవిడ అక్కడ్నుంచి కదల లేదు.

అంతలో అరవింద్‌కి గబుక్కున గుర్తొచ్చింది. ఈవేళ సాయంత్రం సింధూర తనను పార్కులో కలుసుకోమన్నదనీ ఏదో మాట్లాడాలన్నదనీ.

నానమ్మతో మాట్లాడుతూ ఇప్పటికే లేటయింది. సింధు అక్కడ ఎదురు చూస్తుంటుంది అనుకుని లేచి చెప్పులేసుకుని వడివడిగా బయటకొచ్చాడు.

★ ★ ★

"సారీ సింధూ, లేటయింది"

పార్కులో తమ మామూలు ప్లేసులో ఎదురుచూస్తున్న సింధూర దగ్గరకెళ్లి పక్కన కూచుంటూ చెప్పాడు అరవింద్.

"సారీ నేనే చెప్పాలి. ఎప్పుడూ నాకన్నా ముందు మీరే వచ్చి కూర్చునేవారు. ఎదురు చూడడంలో ఎంత విసుగు, ఆరాటం వుందో ఈరోజు నాకు బాగా తెలిసింది. ఇకపై ఎప్పుడూ మీరు ఇలా ఎదురుచూసేలా నేను లేటుగా రాను" కోప్పడకుండా సింధు అతని చేతిని తన చేతుల్లోకి తీసుకుంటూ ప్రేమగా అన్నది.

"అంటే మన కథంతా ఇలా పార్కులో కలుసుకోవటాలు, ఎదురు చూసుకోవటాల్లోనే గడిచిపోతుందంటావా? "

పదునుగా అతనన్న తీరుకి తెల్లబోయి చూసింది సింధూర.

ఆమె ముఖం చూసి నవ్వేశాడు అరవింద్. "అబ్బ, ఏదో ఓ మాట తమాషాకి అన్నాను. అంతలోనే అదే నిజమన్నట్లు ముఖమలా పెట్టేసుకోవాలా? "

"ఏమిటో ఈరోజు లేటుగా వచ్చారు. పైగా ఇలాంటి మాటలు, ఏమిటి విషయం? "

"చాలా చాలా పెద్ద విషయాలే వున్నాయి. అన్నీ చెప్తానుగానీ నువ్వు మధ్యలో అడ్డు రాకూడదు"

అప్పుడే సింధూర ముఖంలోకి టెన్షన్ వచ్చేసింది. దాన్ని దాచి పెడుతూ నెమ్మదిగా "చెప్పు" అన్నది.

తాను నానమ్మతో తమ ప్రేమ విషయం చెప్పేయటం దగ్గర్నుంచి, ఆవిడ కోప్పడి వీల్లేదనడం, ఆ తర్వాత సంజయ్‌తో కూడా తాను మాట్లాడటం అన్నీ చెప్పాడు అరవింద్.

సిగ్గు, భయం, దిగులు, కోపం అన్ని భావాలు ప్రతిబింబించాయి సింధూర ముఖంలో.

"ఎందుకు చెప్పేశావలా? నాకు తెలుసు. పెద్దవాళ్లు ఒప్పుకోరని చెపుతూనే వున్నా కదా"

"ఎప్పుడయినా తెలియాల్సిందేగా. ఒప్పుకోరని భయపడుతూ చెప్పకుండా ఎన్నాళ్లని వుందాం? " కాస్త విసుగ్గా అన్నాడు అరవింద్. కానీ అతనికి అంతలోనే సింధూరనలా బేలగా చూస్తుంటే జాలిగా అనిపిం




చింది.

"పిచ్చి సింధూ, ఎందుకంతగా భయపడతావు? మామూలుగా అయితే మా నానమ్మ నేనీ సంగతి చెప్పగానే ఎంతో సంతోషపడివుండేది. విషయం తెలుసుకున్న క్షణం తాంబూలం పళ్ళాలతో మీ ఇల్లు నింపేసేదే. కానీ మా నాన్నకలా అవటం, ఆ జ్యోతిషం మీ తాతయ్య చెప్పినట్లే అవటం, ఇదంతా కలిసి ఆవిడ మనసులో ఓ విముఖత ఏర్పడిపోయింది. అయినా నేను ఈ అయిష్టాన్ని ఇష్టంగా మార్చగలననే అనుకుంటున్నాను. చూస్తుండు, మన పెళ్లి మన పెద్దవాళ్ళందరి అంగీకారంతోనే అవుతుంది"

"నాకేమాత్రం నమ్మకం లేదు. పెద్దవాళ్ల అంగీకారం మాట అటుంచు. అసలు మన పెళ్లి అవుతుందన్న నమ్మకమే కలగటం లేదు నాకు. నువ్వెటూ మీ నానమ్మని ఎదిరించలేవు, కాదనలేవు. నేనూ మా వాళ్లు ఒప్పుకోకుండా నీతో వచ్చేయలేను. ఇంకెలా అవుతుంది మన పెళ్ళి? "

" నిజమే. కాదంటే కాదు! కాదని తెలిసే మనిద్దరం ప్రేమించుకుంటున్నాం. నీకు మరొకడితో, నాకు మరొకతితో పెళ్లి అయ్యే దాకా ఏదో ఇలా సరదాగా కాస్త కాలక్షేపం అవుతుందని ఇలా పార్కుల వెంటా అక్కడా ఇక్కడా తిరుగుతున్నాం. అవునా?" కోపంగా అడిగాడు అరవింద్.

దెబ్బతిన్నట్లు చూసింది సింధూర. "నువ్వింత అన్యాయంగా మాట్లాడుతావనుకోలేదు నేను"

"నువ్వాలోచించటంలేదు అన్యా... యం...గా? " దానికి మళ్ళీ ఏదో ఆవేశంగా అనబోతున్న సింధూరను ఆపేశాడు.

"ఊరికే వాదనలెందుకు! నీతో ఇదంతా చెపితే నువ్వేదన్నా ఉపాయం చెపుతావనుకున్నానుగానీ ఇలా మనం పోట్లాడుకోవటానికి కాదు"

"ఉపాయాలేముంటాయి? ఇదేమన్నా సినిమానా? నాటకమా? వేషాలు వేసి మనుషుల్ని, అభిప్రాయాలనీ మార్చటానికి? "

"సినిమాలు మాత్రం జీవితాల్నుంచి కాక మరెక్కడ్నుంచి వస్తాయి అయినా మా నానమ్మ వీల్లేదన్నది సరే. మీ అన్నయ్య దాదాపు ఒప్పుకున్నట్లే మాట్లాడాడుకదా. అవునూ ఈ విషయమై మీ అన్నయ్య మీ ఇంట్లో ఏం చెప్పలేదా? "

హఠాత్తుగా అప్పుడు గుర్తొచ్చింది సింధూరకి. అసలు అరవింద్‌ను తాను పార్కుకెందుకు రమ్మన్నదీ, ఏం మాట్లాడాలనుకున్నదీను.

"చెప్పేవాడేనేమో. కానీ... కానీ మా ఇంట్లో అలా..." ఆగిపోయింది.

"ఏం జరిగింది? "

ఒక్క నిముషం ఏం చెప్పాలి? ఎలా చెప్పాలి అని సంశయిస్తున్నట్లు తటపటాయించినా తర్వాత మెల్లగా చెప్పింది సింధూర.

"మా నాన్నగారు ఇంట్లోంచి వెళ్ళిపోయారు!"

ముందు తానేం విన్నాడో ఓ క్షణం అర్థం కాలేదు అరవింద్‌కి.

తెల్లబోతున్నట్లు సింధూర వంక చూశాడు.

"మీ నాన్న... ఇంట్లోంచి వెళ్ళిపోవటమేమిటి? " అడిగాడు.

'ఛీ, ఇలాంటి స్థితి పగవారికి కూడా రాకూడదు' మనసులో అనుకుంటూ గిల్టీగా చెప్పింది. ఆనందరావు ఉత్తరం పెట్టి ఇంట్లోంచి వెళ్ళిపోవటం.

"మీ నాన్నకి మతిస్థిమితంగానే వుంది కదూ? " అనుమానంగా అడిగాడు అర

వింద్.

కోపంగా చూసింది సింధూర. "అటువంటిదేమీ లేదు. ఉత్తరంలో క్లియర్‌గా రాశారుగా. నాటకాల కోసం ఇల్లు వదిలి వెళుతున్నానని. ఆ ఉత్తరం చూసినప్పట్నుంచీ అమ్మ మంచం దిగలేదు. అన్నయ్యా, పాపం నాన్న ఆచూకీ తీసే ప్రయత్నంలో తిరుగుతున్నాడు"

"అరె, సంజయ్ నాకూ ఈ విషయం చెప్పివుంటే నేనూ అతనికి సహాయంగా వుండేవాడినికదా. ఇప్పటికయినా మించిపోయిందేం లేదు. ఎటూ రేపు ఎల్లుండిలో మేము మద్రాసు వెళ్ళబోతున్నాం. అక్కడ నేనూ ఆచూకీ కోసం ప్రయత్నిస్తాను"

"మద్రాసు వెళుతున్నారా? ఎందుకు?" అడిగింది సింధూర.

"చూశావా. నేనిది చెప్పటమే మర్చిపోయాను. బంధువుల పెళ్లి వుంది. నానమ్మ ఖచ్చితంగా వెళ్ళితీరాలని కూచుంది. మామూలుగా బంధువులు, కార్యాలు అన్నింటికీ దూరంగానే వుంటుంది. మరెందుకో ఇప్పుడు వెళ్ళాలని పట్టు బడుతూంది. వెళ్ల కతప్పదు. అట్నుంచటే ఏవో పుణ్యస్థలాలవీ కూడా చూడాలట. వారం, పదిరోజులు పట్ట వచ్చు తిరిగి రావటానికి"

"వారం, పది రోజులా?"

"పదిరోజుల్లో ఏమేం జరుగుతాయో!" భయంగా అనుకుంది సింధూర.

"పదిరోజులు ఎంతట్లోకి అయిపోవాలి. ఈ లోపల మీ నాన్నగారు ఇంటికి వచ్చేయవచ్చు. మీ అన్నయ్య మీ అమ్మానాన్నలతో మన పెళ్లి విషయం మాట్లాడొచ్చు. ఇక ఈ పది రోజుల్లో నేనూ మా నానమ్మ మనసు మార్చేందుకు ప్రయత్నిస్తానుకదా"

"అన్నీ నువ్వు చెప్పినట్లే జరిగితే ఇక అంతకన్నా సంతోషమేముంటుంది? కానీ జరగాలిగా"

"జరుగుతుంది. జరగాలనే కోరుకుందాం. నువ్వు అనవసరంగా పిచ్చి పిచ్చి ఆలోచనలతో వర్రీ అయిపోకు. బీహేపీ, లే, ఇక వెళదాం. ఇప్పటికే నీకు ఆలస్యమయినట్లుంది" అప్పుడు పరిసరాలు చూసి గబుక్కున లేచింది. సింధూర.

"బాప్‌రే. చాలా లేటయిపోయింది. ఇంట్లో అమ్మ ఒక్కర్తే వుంది. పద వెళదాం" వడివడిగా అడుగులు వేస్తూ అన్నది.

"అరె, అలా సడన్‌గా పరుగుపెట్టేవేమిటి? ప్చ్ నీకు ఏ ఆలోచన వచ్చినా పట్టలేం. ముందు ముందు నీతో నేనెలా వేగాలో ఏమో?"

సింధూరని ఆటపట్టిస్తూ మామూలు మూడ్‌లోకి తెస్తూ తనూ ఆమె వెనుక అడుగులు వేశాడు అరవింద్.

★ ★ ★

ప్రమద్వర గురించి టీవీ స్టేషన్లో, తానామెకి చాలా దగ్గరి బంధువుననీ, అర్జంటు మెసేజి అందచేయాలనీ చెప్పి ఆమె అడ్రసు తెలుసుకున్నాడు సంజయ్.

ఆ చిరునామా ప్రకారం వెళ్ళి చూస్తే ఇంటికి తాళం వెక్కిరిస్తూ కనిపించింది. పక్కయింటి వారిని విచారిస్తే ఆమె ఏదో నాటక కంపెనీతోపాటు ఆలిండియా టూర్ వెళ్లినట్లు రావడానికి నెలపైనే పట్టవచ్చన్నట్లు తమతో చెప్పిందని చెప్పారు.

ఉస్సురని నిట్టూర్చాడు సంజయ్.

ఆనందరావూ సందేహం లేకుండా వాళ్ల కంపెనీతోపాటు ఆలిండియా టూర్ వెళ్లి వుంటాడని అనిపించగానే నీరసంగా ఇల్లు చేరాడు.

ఏమయిందని ఆత్రుతగా ఎదురొచ్చిన సింధూరకు విషయం చెప్పాడు. సింధూరకి మరీ దిగులేసింది. "ఇప్పుడిక నాన్న ఆచూకీ తెలిసేదెలా? అసలు వాళ్లు ముందుగా




ఎక్కడికి వెళ్ళారో, ఏయే వూర్లలో ప్రోగ్రాము లివ్వనున్నారో ఆ వివరాలేవీ తెలియలేదా?" అని అడిగింది.

"ఆ పక్కింటి వాళ్ళు ఇది చెప్పటమే గొప్ప. రేపు మళ్ళీ వెళ్ళి ప్రయత్నిస్తాను. అయినా నువ్వీ విషయం అమ్మకు చెప్పకు" అన్నాడు.

"అలాగే అమ్మ అడిగితే రేపు తెలుస్తుం దట అని చెప్పేస్తాను" ఆ ఆలోచనతోనే తనకీ ధైర్యం చెప్పుకున్నది సింధూర.

★ ★ ★

ఆ రెండోరోజే అరవింద్, వజ్రమ్మ మద్రాసు బయలుదేరారు. ఆటో బయలుదే రుతుండగా ఏదో పనివున్నట్లు గేటు దగ్గరకి వచ్చిన సింధూరకి కళ్ళతోనే వీడ్కోలు చెప్పి వజ్రమ్మ చూడకుండా మెల్లగా చెయ్యూపాడు అరవింద్.

ఓరకంటితో అంతా గమనిస్తూనే వున్న వజ్రమ్మ కావాలనే చూసీచూడనట్లుగానే వుండిపోయింది.

"ఏడు కొండలవాడా, అంతా నేననుకున్న ట్లుగానే జరగనివ్వు. నా మనవడి పెళ్ళితో పాటు నీకూ కళ్యాణం చేయిస్తాను" మనసు లోనే దేముడికి మొక్కుకుంది.

మద్రాసులో విశ్వనాథం కుటుంబం వీరిని ఎంతో ఆదరంగా ఆహ్వానించారు. విశ్వనాథం డాక్టరుగా ప్రైవేటు ప్రాక్టీసు పెట్టి రెండు చేతులా ఆర్జిస్తున్నాడు. ఆయ నకి ఇద్దరు కొడుకులు. చిన్న కొడుకు ఇంజ నీరింగ్ చదువుతున్నాడు. పెద్దబ్బాయిని మెడిసన్ చదివించాడు. తండ్రికి హాస్పిటల్ నిర్వహణలో చేదోడు వాదోడుగా వుంటు న్నాడు.

అతను తనతోపాటు చదువుకున్న అమ్మా యిని ప్రేమించటం, దానికి ఇరువైపు పెద్ద లకూ అభ్యంతరాలు లేకపోవటంతో వారి ప్రేమ వివాహాన్ని పెద్దలే చేయనిశ్చయిం చారు. ఆ పెళ్లికే ఇప్పుడు అరవింద్ వజ్రమ్మ వచ్చింది.

పెళ్ళికొడుకు వినోద్ కూడా అరవింద్ వయసువాడే అవటంతో వారిద్దరూ బాగా కలిసిపోయారు. ఇద్దరూ కలుపుగోరువారే కావటంతో కొద్దిసేపటిలోనే దగ్గరి స్నేహి తుల్లా మసలసాగారు.

వజ్రమ్మకి జీవితమంతా అంత ఆస్తినీ, పసిపిల్లవాడ్ని కంటికి రెప్పలా కాపాడుకురా వటంతోనే సరిపోయింది. బంధువులు, చుట్టాలతో రాకపోకలకు వీలయినంతదూ రంగానే వుండేది. ఎవరితో ఎక్కువ సఖ్య తగా వుంటే ఎవరు దగ్గర చేరినట్లే చేరి ఏం మోసం చేస్తారోనని ఆవిడ భయం. ఇన్నేళ్ళ తర్వాత ఇప్పుడు పెళ్ళి ఇంట్లో చేరిన అందరి బంధువుల్ని తీరుబడిగా చూడటంతో పేరు పేరునా వారినీ వీరినీ పలకరిస్తూ ఆవిడ చాలా బిజీగా వుండిపోయింది. అరవింద్ కూడా కొత్త ప్రదేశంలో ఒంటరితనం బాధ లేకుండా వినోద్, అతని ఫ్రెండ్స్ సర్కిల్‌లో కలిసిపోయాడు.

అరవింద్‌కు వినోద్‌ను చూస్తుంటే ఆనం దంగానూ, ఎక్కడో కించిత్ అసూయగానూ అనిపించింది.

"అదృష్టవంతుడు. ఏ గొడవలు, సమ స్యలు లేకుండా ప్రేమించిన అమ్మాయినే అందరి ఆశీర్వాదంతో బంధుమిత్రుల సమ క్షంలో హాయిగా పెళ్ళి చేసుకుంటున్నాడు. తమ ప్రేమకథ కూడా యిలా అయివుంటే ఎంత బావుండేది. తనకూ సింధుకీ మాత్రం ఎందుకిన్ని అడ్డంకులు, సమస్యలు? చివరికెలా ముగుస్తుందో, ఏమవుతుందో కదా తమ ప్రేమ? "

మళ్ళీ తనలోతనే సర్దిచెప్పుకున్నాడు. "ఆ, ఏ థ్రిల్లూ లేకుండా ఎవరూ అడ్డు చెప్పకుండా అడగ్గానే పెద్దలు సరేననేసి పెళ్ళి చేసేస్తే అదేం ప్రేమ వివాహం. తమలాగ సమస్య



లెదురైనా వాటిని పరిష్కరించుకుని ఒకట వటంలోనే ఆనందం వుంటుంది"

అనుకున్న ముహూర్తానికి వినోద్ పెళ్ళి ఆడంబరంగా జరిగి పోయింది. పెళ్ళి జరిగిన రెండోరోజే ఊర్లనుంచి వచ్చిన చుట్టాలందరూ కూడా వెళ్ళిపోయారు, విశ్వనాథం భార్య తరుపున బంధువులు ఒకరిద్దరు తప్ప. వజ్రమ్మ మాత్రం పెళ్ళి అయిపోయినా అక్కడ్నుంచి కదిలే సూచనలేమీ కనిపించలేదు అరవింద్‌కు.

మద్రాసులో చూడవలసిన ప్రదేశాలన్నీ చూపించాడు. పక్కనే వున్న మహాబలిపురం, కంచిలాంటివి కూడా చూసేశారు.

"నానమ్మా, నువ్వు రామేశ్వరం, కన్యాకుమారి చూడాలన్నావు. యింకా యిక్కడే వుంటే అవన్నీ చూసేదెప్పుడు? " అడుగుతూనే వున్నాడు అరవింద్.

"వెళదాము, ముందు ఈ నగరంలోనివన్నీ చూడనీ" అనేయసాగిందామె.

వినోద్ పెళ్ళిలో అందరి దృష్టినీ ఆకర్షించింది దీపిక అనే అమ్మాయి. ఆ అమ్మాయిని తమ స్నేహితుడి కూతురిగా పరిచయం చేశాడు విశ్వనాథం.

దీపిక తల్లీతండ్రీ యిద్దరూ ఆరునెలల క్రితమే కార్ ఏక్సిడెంట్‌లో ఒకేసారి చనిపోయారుట. తల్లి అక్కడికక్కడే చనిపోగా తండ్రి హాస్పిటల్లో చనిపోతూ తమ ఒక్కగానొక్క కూతురును ప్రాణస్నేహితుడైన విశ్వనాథంకి అప్పగించాడుట.

దీపికకు డబ్బుకేమీ కొదువలేదు. మద్రాసులోనే స్వంత ఫ్లాట్, బంగారమూ, బేంక్ బేలన్సు బాగానే వుంది. అయితే పచ్చని పసిమిఛాయ, తీరైన కన్నూముక్కుతో ఎంతో అందంగా వుండే ఆ అమ్మాయి మూగ.

ఇన్నాళ్ళూ తనలోని ఆ లోపాన్ని తలుచుకునే బాధపడే ఆ అమ్మాయికి ఒక్కసారిగా తల్లీతండ్రీ కూడా పోవటంతో మానసికంగా బాగా దిగులు పడిపోయింది.

కానీ తన బాధనీ, దిగుల్నీ తనలోనే దాచుకుని ఎప్పుడూ ఏదో ఓ పని కల్పించుకుని చేస్తూ, యింట్లో ఎవరెవరికి ఏమేం కావాలో గమనించుకుంటూ చురుగ్గా, కలివిడిగా తిరిగే దీపిక అంటే వజ్రమ్మకు వచ్చిన రెండురోజుల్లోనే అభిమానం ఏర్పడిపోయింది.

"దేముడు ఎందుకిట్లా మనుషుల్ని పరీక్షిస్తాడో తెలియదు. బంగారు బొమ్మలాంటి పిల్లకు ఆ ఒక్కలోపం పెట్టకుండా వుండకూడదూ! అయినా పెద్దలంటే ఎంత వినయం. విధేయత! ఇంటెడు పనీ సునాయాసంగా చేసుకుపోగల చురుకుతనం ప్ఛ్ తల్లీతండ్రినీ కూడా దూరంచేశాడాయే. కనీసం మెడలో ఆ మూడుముళ్ళు పడినదాకా నన్నా వాళ్ళని వుంచకూడదూ" అంటూంటే విశ్వనాథం కూడా అదే బాధను వ్యక్తం చేశాడు.

"అవును పిన్నీ, అదే పాపం చనిపోయేటప్పుడు వాళ్ళ నాన్న బాధ పడ్డాడు. మూగపిల్లను అనాథను చేసిపోతున్నానే అని. ఆస్తి వుందనుకో. కానీ ఆస్తి వుండడమూ పెద్ద బాధే అయిందిప్పుడు. దీపికకు దగ్గర బంధువులెవ్వరూ లేరు. ఉన్న ఒకరిద్దర్నీ వాళ్ళ నాన్న నమ్మలేదు. దీపకు మంచి సంబంధం చూసి పెళ్ళిచేసే బాధ్యత నామీద పెట్టాడు. కానీ అమ్మాయి మూగ అని తెలిసీ మంచి మనసుతో పెళ్ళి చేసుకోగల వరుడు దొరకాలికదా. ఆస్తికోసం చేసుకుని ఆ తర్వాత ఆ పిల్లనేమన్నా చేస్తారేమోనని అదో భయం. ఎవర్ని నమ్మాలో, ఎవర్ని నమ్మకూడదో తెలియకుండా వుంది. నాలుగైదు సంబంధాలు చూశాను. కానీ అందరూ అమ్మాయి ఆస్తిపాస్తుల వివరాల డిగేవారే. తీరా ఆ కట్టుకున్నవాడు దుర్మార్గుడైతే చూస్తూ చూస్తూ నోరు లేని పిల్లను ఓ




కసాయివాడి కప్పగించిన పాపం నాకు చుట్టుకుంటుంది. అందుకే దీపకొక మంచి వరుడ్ని చూడటమే యిప్పుడు నాకు ముఖ్యమైన పనయింది. వినోద్‌కే యిచ్చి చేసుకుందామనుకున్నాను కానీ వాడు అంతకు ముందే ప్రేమించి పెళ్ళికి రెడీ అయి కూచున్నాడు!"

అతని బాధను అర్థంచేసుకుంది వజ్రమ్మ. ఆమెకి దీపిక అంటే జాలి, ఆపైన వాత్సల్యమూ కలిగాయి.

"నీ ఎరికలో ఏదైనా మంచి సంబంధం వుంటే దీప సంగతి మర్చిపోకు పిన్నీ" అని అడిగిన విశ్వంకు, "అలాగేలే" అని చెప్పి తను ఆలోచనలో పడింది.

అక్కడున్న నాలుగు రోజులూ దీపికను నిశితంగా గమనిస్తూన్నదల్లా ఆఖరున ఒక ఆలోచనకు వచ్చింది. ఊరినుంచి బయలుదేరేటప్పుడు ఆమె ఆలోచన వేరు. కానీ యిప్పుడు దీపికను చూస్తూంటే ఆమె ఆలోచనలో మార్పు వచ్చింది.

అయితే చూస్తూచూస్తూ ఓ మూగ అమ్మాయిని తన మనవడి పక్కన ఊహించుకోవటానికి ఆమె మనసు కాస్త తటపటాయించసాగింది. ఆ ఒక్క లోపమే తప్ప దీపిక ఆమెకెంతగానో నచ్చింది. దీపిక పోతపోసిన సౌందర్యరాశేకాదు సుగుణాల రాశి కూడా.

దైవభక్తి, పెద్దలంటే వినయవిధేయతలు, చిన్నపిల్లలంటే వాత్సల్యము, తోటివారిపై స్నేహగుణం, బీదాబిక్కీ అన్నా పనివారన్నా దయాగుణం, పనిపాటలలో చురుకుతనం, తెలివితేటలు, ఓ మంచి యిల్లాలికి వుండవలసిన అన్ని లక్షణాలు మిగిలిన అమ్మాయిల్తో పోల్చుకుంటే ఎన్నో రెట్లు ఉత్తమంగా అనిపించసాగింది.

కానీ ఎంతయినా అందరిలా మాట్లాడ లేదు కదాని ఓ మూల కాస్త అసంతృప్తిగా వున్నా అది ఆవేళ జరిగిన సంఘటనతో మొత్తం తుడిచిపెట్టుకుపోయింది.

ఆవేళ మధ్యాహ్నం అందరూ భోజనాలు చేసి విశ్రాంతిగా కబుర్లు చెప్పుకుంటున్న సమయంలో పెళ్ళికూతురు వీణకు పెద్దమ్మ వరుస అయినావిడ అదే కాలనీలో వుంటుంది. ఆవిడ ఓ పెద్దాయన్ని వెంటపెట్టుకు వచ్చింది. వాళ్ళ ఫామిలీ ఫ్రెండెవరో పంపించారుట అతను జోస్యం చాలా చక్కగా చెప్తాడని. తమ యింట్లోనివారు చెయి చూపించుకుంటే నిజంగానే జరిగినవన్నీ కూడా దాదాపు చక్కగా చెప్పాడట. అందుకని వీణ చేయి కూడా చూపిద్దామని అతన్ని తీసుకువచ్చిందిట. కానీ వీణ తనిలాంటివన్నీ నమ్మనని ఖచ్చితంగా చెప్పేసి తన గదిలోకి వెళ్ళిపోయింది. కానీ యింట్లో మిగిలినవాళ్ళు ఆసక్తి చూపారు.

జ్యోతిష్యం అంటే ఏ కొందరికోతప్ప సామాన్యంగానే అందరికీ కుతూహలంగా ఆకర్షణగానే వుంటుంది. ఇంట్లో వుండే చిన్నా పెద్దా ఆడవారంతా డ్రాయింగ్ రూమ్‌లో అతని చుట్టూ చేరారు.

ఎదురుగ్గా వున్న గదిలో కూచుని అదంతా చూస్తున్న వజ్రమ్మకి కోపంగా, చిరాగ్గా అనిపించసాగింది. మెడపట్టుకుని ఆ జోస్యం చెప్పేవాడిని బయటకు గెంటాలనిపించింది. అదే ఆమె యిల్లయితే అంతపనీ చేసివుండేదే కానీ వేరే వాళ్ళింట్లో తను అధికారం చూపెట్టటం ఏం బాగుంటుంది. వారు తనకెంత మర్యాదయిచ్చినా అని ఆ అసహనాన్ని, కోపాన్ని అణుచుకోసాగింది.

చేతులు చూపెట్టుకున్న వారందరికీ సరిగానే చెప్పాడతను. వెనుక వరండాలో ఏదో పని చేయిస్తున్న దీపికనూ వీణ పెద్దమ్మ చేయిపట్టుకుని లాక్కువచ్చి అతని ముందు కూర్చోపెట్టింది.

ఆ అమ్మాయి కళ్లతోనే వద్దని చెపుతూ చేయి వెనక్కి లాక్కుంటున్నా వినకుండ

బలవంతంగా చెయిలాగి అతని ముందు సాచిందావిడ నవ్వుతూ.

"చూడనీ అమ్మాయ్, పెళ్ళి కావల్సిన పిల్లవు. వరుడు ఏ పక్కనుంచి వస్తాడు, పిల్లలెంత మంది పుడ్తారు? అన్నీ చెప్తాడు" సరదాగా వేళాకోళం చేసింది.

వజ్రమ్మ యిక ఆగలేకపోయింది. ఆమె గుండె కొట్టుకోసాగింది. హఠాత్తుగా దడ ప్రారంభమయింది.

"మహా చెప్పావులే జ్యోతీష్యాలు, దయ చెయ్. మా మంచిచెడ్డలు మాకెటూ జరక్క మానవు. ముందుగానే మాకేం చెప్పక్కర లేదు" అని గట్టిగా అరవాలనుకుంది. కానీ ఏదో తెలియని బలహీనత ఆమెని లేవనివ్వ లేదు.

"ఏం చెప్తాడు యీ అమ్మాయి గురించి?" మిగిలిన అందరికీ చెపుతుండగా ఉదాసీ నంగా వింటున్నట్లు ఉండలేకపోయింది. దీపిక గురించి అతను చెప్పబోయేదేదో జీవ న్మరణ సమస్యలా ఊపిరి బిగపట్టి వినసా గింది. ఆమెకు తెలియకుండానే సర్వేంద్రి యాలు వినికిడికే సమీకరించబడ్డాయి.

అతను దీపికకు పెద్దగా ఎక్కువసేపు ఏమీ చెప్పలేదు. కానీ చెప్పిన రెండుమా టలూ ఆమెకు అమృత తుల్యంగా మాత్రం తోచాయి.

"అమ్మాయి వివాహానికి ముందు జీవి తంలో ఎన్నో ఒడిదుడుకులున్నా వివాహం తర్వాత మాత్రం మెట్టినింట ఎంతో సుఖప డుతుంది. సంపూర్ణ ఆయుష్యు, దీర్ఘసుమం గళి, బహు పుత్రలాభం"

అంతే... ఒక్కసారిగా ఎక్కడలేని బలమూ వచ్చి చేరిపోయింది వజ్రమ్మలో. గబుక్కున లేచి వడివడిగా ఆ జోస్యం చెబుతున్న గది లోకి వచ్చింది. ఆమె బొడ్లో ఎప్పుడూ పట్టు బట్టతో కుట్టిన చిన్న డబ్బుల సంచీ వుంటుంది. అది తీసి ఓ వందరూపాయల కాగితం దీపిక చేతిలో పెట్టి 'అతనికివ్వమ్మా' అన్నది సంతోషంగా.

దీపికకేమీ అర్థంకాలేదు. తాను చేయి చూపించుకుంటే యీ పెద్దావిడ డబ్బివ్వడ మేమిటి అనుకుంది.

విశ్వనాథం భార్య కూడా విస్తుపోయి విడ్డూరంగా చూసింది. వజ్రమ్మకు జోస్యా లంటే ఎంత కోపమో, ఎంత విముఖతో ఆమె ఓసారి భర్త ద్వారా వినివున్నది.

"అలాంటిది, యిదేమిటి యీవిడ యింత ఉదారంగా డబ్బులు కూడా యిస్తుంది. అదీ వందరూపాయలు, పైగా దీపిక చెప్పించుకు న్నదానికి!" అనుకుంది.

అయితే అక్కడున్న ఎవరి చూపులు లెక్క చేయలేదు వజ్రమ్మ.

ఆ సంఘటన తర్వాత యిక ఆమె దీపి కను తన మనవడికి నిశ్చయించడానికి మరేమి సంశయించలేదు.

"దీర్ఘసుమంగళి, బహుపుత్రలాభం!" ఆ మాటలే పదేపదే వినిపించసాగాయామె చెవులకు.

ఇలాంటి అమ్మాయే సరిగ్గా యిలాంటి అమ్మాయే తమ యింటి కోడలవాలి. ఆమె వలన తమ వంశం వృద్ధిచెందాలి. తరానికి ఒక్కగానొక్క బిడ్డతో, అల్పాయుష్కులతో శాపగ్రస్తలా వున్న తమ కుటుంబం పిల్లాపా పలతో కళకళలాడాలి. ఆ తర్వాతిక ఆమె ఆలస్యం చేయలేదు. తన మనసులోని మాటను విశ్వనాథంతో చెప్పేసింది. అతను ముందు తానేం వింటున్నాడోనని తన చెవుల్ని తానే నమ్మలేకపోయాడు.

"ఏమిటి?! ఏమిటి పిన్నీ... నువ్వు నిజంగా అరవింద్‌కు దీపికను చేసుకుందా మనుకుంటున్నావా? దీపికకు అందమూ, ఆస్తి, అణుకువ అన్నీ వున్నాగానీ మూగ అని తెలిసీ నిజంగానే అరవింద్‌కే అడుగు తున్నావా?" ఆశ్చర్యానందాలతో అడిగాడు.

"ఆహా... అక్షరాలా అరవిందుడికే అడుగుతున్నాను. మూగ అని అనుకున్నవాళ్ళు అనుకుంటారు. కానీ నేను పెద్దవాళ్లతోనూ మగనితోనూ ఎదురు మాట్లాడని అమ్మాయి అనుకుంటాను. ఎప్పుడూ చిరునవ్వుతో వుండే దీపిక పెదాలు మాట్లాడకపోయినా ఆ పెద్దపెద్ద కళ్ళలోని భావాలు మనం అర్థంచేసుకోగలిగితే చాలు అని నా ఉద్దేశం"

"పిన్నీ... నేను యింకా నిజంగా నమ్మలేకపోతున్నాను. నువ్వేనా మాట్లాడుతున్నదీ అని. ఇదే నిజమైతే దీపిక నిజంగా పోయిన జన్మలో బంగారు పూలతో పూజచేసుకున్నట్లే. మంచి భర్త నివ్వమని దైవాన్ని అడిగితే ఆ దైవమే భర్త అయినట్లయింది ఆ అమ్మాయికి"

"ఆ, ఆగాగు, అన్నీ నువ్వే చెపుతున్నావు. అసలింతకీ ఆ అమ్మాయి కిష్టం వుందో లేదో మనం అడగాలి కదా? "

"ఇష్టమా? ! మనసులో మరెవరో వుంటే తప్ప అరవింద్‌ను కాదనేందుకు మరే కారణమూ వుండదు. దీప సంగతి నాకు బాగా తెలుసు. తనకలాంటి ప్రేమలు, దోమలు తెలియవు. అందుకే గట్టిగా చెబుతున్నాను. దీపిక మనస్ఫూర్తిగా యిష్టపడుతుంది అని."

వజ్రమ్మ ఓ క్షణం ఆగి గంభీరంగా అన్నది.

"విశ్వం, నీకు ముందుగానే చెప్పేస్తున్నాను. ఇదంతా ఆ పిల్లమీద నాకేర్పడిన అభిమానంవల్లనే అడుగుతున్నాను. దీపిక లోటు తెలిసీ ఒప్పుకుంటుంటే ఆ అమ్మాయి వెనుకున్న ఆస్తికి ఆశపడి అడుగుతున్నారేమోనని భయంగా వుంది అని నువ్వోసారి అన్నావు. ఆ అమ్మాయి ఆస్తిలో ఒక్క పైసా మాకొద్దు. తన డబ్బు తన యిష్టం వచ్చినట్లు చేసుకోగల అధికారం ఆ అమ్మాయికెపుడూ వుంటుంది. కట్టుబట్టలతో మా యింటికి వచ్చినా చాలు!"

విశ్వనాథం గబుక్కున వచ్చి వజ్రమ్మ చేతులు పట్టుకున్నాడు. "ఎంతమాటన్నావు పిన్నీ. ఆ మాట ముక్కు మొగం తెలియని వారి గురించి నా అనుమానంతో అన్నది. కానీ లక్షలు మీరు చూడనివా, ఆస్తిపాస్తులు మీకు లేనివా? మీరు డబ్బుకోసం దీపికను చేసుకోబోవటం ఏమిటి? అయినా అరవిందకి అమ్మాయి కావాలనుకుంటే ఇంతకన్నా డబ్బున్న సంబంధాలే వస్తాయని నాకు తెలియదా? నువ్వు అడగటమే ఆ అమ్మాయి అదృష్టం"

వజ్రమ్మ నిట్టూర్చింది. "నీకా అభిప్రాయం వుంది చాలు. ఆ, మరోమాట. ఇదంతా నా మనసులోని మాటే. నేనింతవరకు యీ విషయం అరవిందుడికి చెప్పలేదు"

అంతవరకు ఉత్సాహంగా, ఆనందంగా మాట్లాడుతున్నవాడల్లా సందేహంగా చూశాడు విశ్వనాథం.

"అరవింద్ ఒప్పుకుంటాడంటావా పిన్నీ?"

"వెంటనే ఒప్పుకోడు. కానీ నేను ఒప్పించగలననే అనుకుంటున్నాను" దృఢంగా అన్నది వజ్రమ్మ.

చిన్నగా అన్నాడు విశ్వనాథం, "కానీ యిష్టంలేని పెళ్ళి బలవంతంగా ఒప్పించి చేయటం అంత మంచిది కాదేమో"

"పిల్లలకేది మంచో చెడో నిర్ణయించేది పెద్దలే. పెళ్ళి అనేది నూరేళ్ళపంటే కాదు రెండు వంశాలకీ సంబంధించింది. అరవిందుడికి నేను చెప్తాను. కానీ ముందు నువ్వొక విషయానికి సరేననాలి"

"ఏమిటది? "

"చెప్తాను... ముందిది చెప్పు. నీకు నా మాటమీద నమ్మకం వుంది కదా? "

"అదేం మాట పిన్నీ. నువ్వు మాట




యిచ్చావంటే యిక దీపకు పెళ్ళయిపోయి నట్లే అని నేననుకుంటాను"

"అయితే దీపికను ముందు నాతో పంపించు. ఇప్పుడే యీ పెళ్ళి విషయం దీపకు తప్ప యింట్లో మరెవ్వరికీ చెప్పాల్సిన పనిలేదు. ఓ నెల ఆగి నేనే కబురు చేస్తాను. అప్పుడు ఏకంగా మీరంతా పెళ్ళికే తరలి రావచ్చు"

"అంటే దీపికను యిప్పుడు మీతో వూరికి పంపించమంటావా. కానీ ఎందుకట్లా?"

"ముందు మా యింట్లో దీపను కలిసిపో నివ్వు. కుందనపు బొమ్మలా వుండే అమ్మాయి కళ్ళ ముందు తిరుగుతూంటే విందూకి మంచి అభిప్రాయం ఏర్పడక పోదు. అప్పుడు వాడిని ఒప్పించటం తేలిక అని నా ఉద్దేశ్యం. నువ్వేమీ వేరే ఆలోచనలు పెట్టుకోకు. నాతో పంపటం పెళ్ళికే అనుకో. కాకపోతే మిమ్మల్ని కొన్ని రోజులాగి రమ్మంటున్నాను అంతే. ఇదంతా నీకేమీ అభ్యంతరం వుండదనే అనుకుని అడుగుతున్నాను"

ఇక అతనికే సంశయాలు కలగలేదు.

"అభ్యంతరమా? భలే దానివే. పెద్ద దానివి నీతో పంపటానికేం అలాగే తీసు కెళ్లు. నేను దీపికకు చెప్తాను, ప్రయాణానికి సిద్ధంకమ్మని"

విశ్వనాధం సంతోషంగా వెళ్లిపోయాడు.

వజ్రమ్మ తనలో తాననుకున్నది, "మొదటి అంకం పూర్తయినట్లే, ముఖ్యమైనది ఊరికి వెళ్లిన తర్వాత విందూని ఒప్పించేదేవుంది. ఒప్పుకోక ఏం చేయగలడు? చిన్నచిన్న అస్త్రాలు పని చేయకపోతే బ్రహ్మాస్త్రం వుండనేవుంది"

  

కళ్లు మూసుకుని తన ఆలోచనల్లో తానుండగా పడక్కుర్చీలో పడుకుని వున్న వజ్రమ్మ హఠాత్తుగా తన కాళ్లపై చల్లగా చేతులు పడటంతో చటుక్కున కళ్లు తెరిచి చూసింది.

దీపిక!

"అరె, పిచ్చిపిల్లా, యిదేంపని?" ఆ అమ్మాయిని లేపి దగ్గరకు తీసుకుంది.

విశాలమైన ఆ అమ్మాయి కనులనిండా నీరు!

ఒక్కనిముషం అన్నట్లు ఆమెవైపు చూసి వడివడిగా తన గదిలోకెళ్లి పుస్తకం, పెన్‌తో వచ్చింది. వజ్రమ్మ చూస్తుండగానే చకచకా రాసి పుస్తకం ఆమె చేతిలో పెట్టింది.

త్వరత్వరగా రాసినా దస్తూరి చక్కగా గుండ్రంగా వుంది.

"ఇప్పుడే విశ్వం అంకుల్ చెప్పారు. అనాధనైన నన్ను మీలో ఒకరిగా చేసుకుని దేవతలా ఆదరిస్తానంటున్నారు. కానీ చిన్న మనవి. ఈ పెళ్లికై అరవింద్‌గారిని బలవంత పెట్టకండి. అన్ని అర్హతలున్నవారు ఆయన. తనకు కాబోయే భార్య పట్ల ఎన్నో ఆశలుండవచ్చు ఓ మూగ అమ్మాయిని చేసుకోవాల్సిన అవసరం ఆయనకేముంది?"

దీపికను చూస్తే ఓ క్షణం జాలి, ఆపై ప్రేమ, వాత్సల్యం పొంగగా అనునయంగా అంది.

"నువ్వేమీ పిచ్చి అనుమానాలు పెట్టుకోకు. బలవంతం ఏమీ వుండదు. నువ్వు నాకు నచ్చావు. విందూకి నచ్చుతావు! పద బట్టలవీ సర్దుకో. రేపే ప్రయాణం"

తమతో వూరికి దీపిక కూడా బయలుదేరుతుందని తెలిసి ఆశ్చర్యపోయాడు అరవింద్.

"అదేమిటి, దీపిక మనతో రావటం ఎందుకు?" వజ్రమ్మను అడిగాడు.

"విశ్వం ఆ అమ్మాయికి ఓ మంచి సంబంధం చూడమని చెప్పాడు. నాకా

అమ్మాయి ఎంతగానో నచ్చింది. కొన్ని రోజులు మనతోవుంటుంది. నాకు తోడుగా మనింట్లో వుంటుంది. ఓ మంచి సంబంధం చూసి పెళ్ళి చేసేస్తే ఎటూ అత్తగారింటికి వెళ్ళిపోతుంది"

ఇంకేం చెప్పగలడు. కానీ అతనికేదో ఇదంతా కాస్త అనుమానించాల్సిన వ్యవహారం లాగానే తోచసాగింది.

తన నాయనమ్మ ఏ పనీ ఆలోచించకుండా చేయదని అతనికి తెలుసు. కానీ యిందులో ఆమెకి వ్యతిరేకంగా కాదనేందుకూ ఏమీలేదు. "సరే కానివ్వు నానమ్మ ఏం చేయదలుచుకుంటే అదే చేయనీ, మొత్తంమీద ఇదంతా మనసులో ఏదో పెట్టుకునే చేస్తోంది. ఆమె అంతట ఆమే బయటపడనప్పుడు తనెందుకు బయటపడాలి" అనుకుని కామ్‌గా వుండిపోయాడు.

దీపిక కూడా వాళ్ళతో అలా వూరికి వచ్చేసింది.



ఉదయాన్నే వాకిట్లో ముగ్గువేస్తున్న సింధూర ఎదురింటి ముందు ఆటో ఆగిన శబ్దానికి తల ఎత్తి చూసింది. వజ్రమ్మ, అరవింద్‌లతోపాటు ఓ అందమైన యువతి కూడా ఆటో దిగటం చూసి ఆశ్చర్యపడింది.

అరవింద్‌కూడా ముగ్గువేస్తున్న సింధూరను చూశాడు. కానీ చూపులు కలిపి కనీసం చిరునవ్వు అయినా నవ్వే వీలులేకుండా వజ్రమ్మ అతన్నే చూస్తూ "ఆ పద పద తాళాలు తీసి త్వరగా తలుపుతీయి. దీపిక ఎంతసేపు బయట నిలుచుంటుంది. ఆటోకి డబ్బులు నేనిస్తాను" అంటూ అతన్ని అక్కడ నిలుచోనివ్వకుండా లోపలకి పంపేసింది.

"ఎవరా అమ్మాయి? బంధువులతో తమకు పెద్దగా రాకపోకలులేవని చెప్పాడే అరవింద్. అరవింద్ కేమవుతుంది తను. కొంపదీసి ఈ ముసలమ్మ వూరికి తీసుకెళ్ళినట్లు తీసుకెళ్ళి అక్కడ బలవంతపెట్టి అరవింద్‌కి పెళ్ళి చేసేయలేదుకదా?" ఆ ఆలోచనతో ఒక్కసారిగా ఆమెలోంచి బలమంతా ఎవరో లాగేసినట్లయింది సింధూరకు.

మళ్ళీ ఏమూలనో ఆశ. లేదు లేదు తన అరవింద్ అలా ఎన్నటికీ చేయడు. పెళ్ళంటూ జరిగితే అది తనతోనే, లేదా బ్రహ్మచారిగానే వుండిపోతాను అనికదా చెప్పాడు తనతో

ఏమో ఎవరు నమ్మమన్నారు ఇలాంటి మాటల్ని. మా నానమ్మ ఇదో ఇలా చెప్పింది... అలా చెప్పింది... తప్పనిసరి పరిస్థితుల్లో చేసుకోవాల్సి వచ్చింది... అని కనుక చెపితే తనేం చేయగలదు?

ఇలా రెండు విధాలైన ఆలోచనలతో ఆమె అన్యమనస్కంగానే వుండిపోయింది ఆ రోజంతా.

ఇంటి పనులన్నీ అస్తవ్యస్తంగానే పరాకుగానే చేయసాగింది. కాలేజి లేకపోవటంతో అరవింద్‌ను కలిసి విషయం ఏమిటని అడిగే అవకాశమూ కలగలేదు.

సింధూర ఈ రకమైన ఆలోచనల్లో వుండగా పోస్ట్‌లో వచ్చిన ఉత్తరం సింధూరకీ సంజయ్‌కీ ఆందోళననీ అందులోనే కాస్త నిశ్చింతనూ కలగచేసింది.

అది అంజలి దగ్గర్నుంచి వచ్చిన ఉత్తరం. అందులో ఇలా వుంది.

"ప్రియమైన అమ్మకి,

నమస్కారములతో, ఉభయకుశలోపరి. పోయిన వారం మీ అల్లుడుగారు ఆఫీసు పనిమీద బెంగుళూరు కేంప్ కెళ్ళాల్సి వచ్చింది. అక్కడ స్నేహితులతో కలిసి అనుకోకుండా ఓ నాటకానికి వెళ్ళారుట వాళ్ళ బలవంతంపై. ఆ నాటకంలో నాన్న ఓ చిన్న కేరక్టర్ వేశారుట. అదంతా ఎందుకో




ఈయనకి వాళ్ల స్నేహితులముందు అవమానంగా అనిపించిందట. నాటకం అయిన తర్వాత నాన్నని కలుద్దామనే అనుకున్నారుటకానీ వెంటనే ప్రయాణం వుండటంతోనూ, అక్కడ ఆర్టిస్టులను కలిసేందుకు ఉన్న ఆ కొద్ది సమయంలో వీల్లేక పోవటంతోనూ కలవకుండానే వచ్చేశారుట. అయితే 'మీ నాన్న అలా నాటకాల్లో వేషాలు వేయటం ఏమిటి? ఈ వయసులో' అని నన్ను కేకలేశారు. మా అత్తగారి సంగతి, ఆయన సంగతి మీకు తెలిసిందేకదా. మాటకు ముందు అదే చెప్పి దెప్పి పొడుస్తున్నారు. ఇదంతా ఏమిటో నాకు అర్థం కావటంలేదు. ఉత్తరం రాయి, సింధునూ, సంజుని అడిగినట్లు చెప్పు.

ఇట్లు అంజు"

అదీ ఉత్తరంలోని సారాంశం. ఆ ఉత్తరం సంగతి అరుంధతికి చెప్పకూడదని ఇద్దరూ కలిసి నిశ్చయించుకున్నారు.

"విషయం ఎటూ పెద్దక్కయ్యకు తెలిసిపోయింది. ఇక ఆటోమేటిగ్గా మంజక్కయ్యకూ తెలిసిపోతుంది. వాళ్లిద్దరిలో ఎవరో ఒకర్ని వారం రోజులకి ఇక్కడ వుండేట్లు రమ్మందామా? మనకి కాస్త ధైర్యంగా వుంటుందేమో? " సింధు అన్నది.

"వద్దొద్దు, ఏం తెలిసింది వాళ్లకి? నాన్న ఇలా నాటకాలంటూ అమ్మతో కూడా చెప్పకుండా ఇల్లు వదిలి వెళ్లిపోయాడని తెలియదుకదా. మనందరికీ తెలిసే నాన్న అలా వెళ్లాడని వాళ్లనుకుంటున్నారు. నాన్న ఎవరితో చెప్పకుండా యిల్లు వదిలి వెళ్లాడంటే యిప్పటికే ఇన్ని రాసింది అక్క. ఇంకా వాళ్ల వాళ్లు ఎన్ని మాటలైనా అంటారు. నాన్న ఇల్లు చేరేదాకా వాళ్లకేం తెలియకపోవటమే మంచిది"

"సరే కానివ్వు. అన్నయ్యా! నువ్వీరోజే బెంగుళూరు వెళ్లి నాన్నని ఎలాగైనా వెనక్కి తీసుకొచ్చెయ్యి. అమ్మ నిద్రలో కూడా ఏదో పలవరిస్తూనే వుంది"

"అవును, నేనూ అదే అనుకుంటున్నాను. వాళ్లు అక్కడే వుంటేసరి. లేదు కనీసం అక్కడికి వెళితే అక్కడ్నుంచి తర్వాత వాళ్లు ఎక్కడకు వెళ్లిందీ అన్నా తెలుస్తుంది.

ఇక్కడసలు ఎవరూ ఏ వివరమూ సరిగా చెప్పటంలేదు. నేను బెంగుళూరు వెళతాను. కానీ నేను వెళ్లి వచ్చేలోగా నువ్వూ అమ్మా ఒంటరిగా వుండాల్సి వస్తుంది. అందునా అమ్మకి ఒంట్లో కూడా బాగులేదు? " సందేహంగా అన్నాడు సంజయ్.

"నేను మానేజ్ చేసుకుంటాలే అన్నయ్యా! మరీ మనమేం అడవిలో లేముకదా! ఇంత మంది తెలిసినవాళ్లు వున్నారు. అంతగా ఏదన్నా అవసరం వస్తే ఎవరిని పిలిచినా సహాయానికి రాకపోతారా? " అన్నది ధైర్యం చెపుతూ.

అదీ నిజమేననిపించింది సంజయ్‌కి.

"సరే మరి నేనీరోజే బయలుదేరుతాను. బ్యాంక్‌కెళ్లి డబ్బు తీసుకొస్తాను. బ్యాంక్ టైమ్ అయిపోయేట్లుంది. నువ్వు బట్టలవీ చూసిపెట్టు. నేను వచ్చేస్తాను" అని వడివడిగా బయటకెళ్లిపోయాడు సంజయ్.

ముందు ఉత్తరం సంగతే తల్లికి చెప్పకూడదనుకున్నారుకానీ తను వూరికి వెళ్లాలంటే చెప్పి వెళ్లాలికదా అనుకుని అరుంధతి దగ్గరకొచ్చి చెప్పాడు సంజయ్.

"నాన్న బెంగుళూరులో వున్నారుట అమ్మా!"

ఉత్తరం వచ్చిందని, అంజలి రాసిన విషయాలు ఇవేవి చెప్పలేదు. ఇక ఆమె అప్పటినుంచీ పెద్ద కూతురి గురించి కూడా ఆలోచిస్తూ మనసు పాడు చేసుకుంటుందని.

అరుంధతి మంచంలో మగతగా పడుకుని వున్నదల్లా కొడుకు మాటకి గబుక్కున

దిండునానుకుని కూర్చుంటూ అడిగింది.

"నిజంగానా? ఎవరు చెప్పారు? "

"ప్రయత్నించితే తెలిసింది. నేను ఇవాళే బెంగుళూరు బయలుదేరి వెళ్లి నాన్నని తీసు కొస్తాను" అన్నాడు సంజయ్.

"వస్తారంటావా సంజూ? " దీనంగా అడుగుతున్న తల్లిని చూస్తుంటే అతనికెంతో బాధ కలిగింది. తండ్రిపై చెప్పరాని కోపమూ కలిగింది.

"ఎందుకు రారు? తప్పకుండా వస్తారు! పోనూ రానూ మధ్యలో అక్కడో రోజు అంతా కలిపి మూడు నాలుగు రోజులవుతుందేమో అంతే. చూడు, నేను, నాన్న వచ్చేసరికి మాత్రం నువ్విలా మంచానికంటుకుని కాకుండా లేచి చక్కగా తిరుగుతుండాలి" అన్నాడు.

నీరసంగా నవ్వింది అరుంధతి.

"నిజం అమ్మా! నువ్వు లేచి తిరగాలి. లేనిపోని దిగుళ్లుపెట్టుకుంటున్నావు. నువ్విలా పడుకుని వుంటే నాకు చాలా బాధగా వుంది. నాకు పుట్టి బుద్ధెరిగి జ్వరంతో కూడా నువ్వు రెండు రోజులు పడుకుండగా చూడలేదు. అలాంటిది హఠాత్తుగా ఎలా అయిపోయావో తెలుసా? "

అతనికి కళ్లలో నీళ్లు తిరగబోయాయి. కొడుకు మనసులో తనపట్ల వున్న ప్రేమకు మరొకప్పుడైతే ఎంతో పొంగిపోయేదే అరుంధతి. కానీ ఇప్పుడామె ఆలోచనలన్నీ భర్త చుట్టే తిరుగుతున్నాయి.

అసలు తండ్రి అంటే తల్లి మనసులో ఇంతప్రేమ, అనురాగం వుందా అని యిప్పుడే తెలుసుకున్నారు సింధూర, సంజయ్. ఏనాడూ వారిద్దరూ సన్నిహితంగ కూచుని సరదాగా నవ్వుతూ మాట్లాడుకోగా కూడా వారు చూసింది లేదు. ఎప్పుడూ పిల్లల తోడిదే లోకంగా వుండేది. సంతానం గొడవలోపడి భర్తని సరిగా పట్టించుకున్నట్టే వుండేదికాదు.

అదే తండ్రి మనసులో భార్యపట్ల అఘాతాన్ని సృష్టించిందేమో. కానీ ఒక్కసారిగా భర్త ఇప్పుడు ఇలా తననుంచి దూరమయ్యాడు అనుకోగానే ఆమె మనసులోవున్న ప్రేమ అంతా బయటకు వచ్చేసింది.

భర్త సన్నిధిలేని జీవితం ఆమెకు శూన్యంగా అనిపించసాగింది. మనసు ప్రభావం శరీరంపై ఎంతగానో వుంటుంది అని తెలుసుకునేందుకు ఉదాహరణ ఆమె రూపాన్ని చూసి చెప్పవచ్చు.

వారం రోజులకే మనిషి చిక్కి శల్యమైపోయింది. హఠాత్తుగా ఓ పదేళ్ల వృద్ధాప్యం పైన పడినట్లుగా తయారయింది. పక్క వీధిలోనే వున్న డాక్టర్ రోజూ వచ్చి చూసి మందులిస్తున్నా బలహీనమూ, మానసిక ఆందోళన తప్ప మరేం లేదని చెపుతూనే వున్నా ఆమె మంచంనుంచి బాత్‌రూమ్ దాకా కూడా కనీసం పక్కనెవరు సాయం లేకుండా పోలేనంతగా బలహీనపడిపోయింది. లేస్తే ఒక్కసారిగా కళ్లు తిరిగిపోతున్నాయంటుంది.

సింధూర ఆహారం కూడా మంచం దగ్గరకే తెచ్చి తినిపించసాగింది. అదీ ఎంతో బలవంతంచేసి.

సంజయ్‌కీ, సింధూరకు ఆమెనలా చూస్తుంటే ఒక్కోసారి ఎంతో భయంగా వున్నా మళ్లీ ఒక్కసారి తండ్రివచ్చి ఎదుట నిలుచున్నాడంటే ఆమె అనారోగ్యమంతా చేత్తో తీసేసినట్లే మాయమయిపోతుందన్న నమ్మకంతో ధైర్యంగా వున్నారు.

ఇన్ని రోజులుగా సింధూర కాలేజికి వెళ్లలేదు. మరీ ముఖ్యమైన క్లాసులున్నాయనుకున్న రెండు రోజులు సంజయ్ ఇంట్లో తల్లిని చూసుకుంటుండగా వెళ్లి వచ్చింది.

ఇప్పుడు లెక్చరర్స్ సమ్మె అట. కాలేజీలు ఎటూ మూసివేశారు. దాంతో ఇబ్బందేమీ





లేకపోయింది.

సంజయ్ వూరికి వెళుతుంటే వెనకే గేటు దాకా వచ్చింది సింధూర. "అన్నయ్యా! మర్చిపోవద్దు, ఒకవేళ నాన్నా వాళ్లు కనుక బెంగుళూరునుంచి మరేదైనా వూరు వెళ్లిపోయివుంటే నువ్వు అక్కడికి వెళ్లేముందు ఫోన్ చేయి" అంటూ పక్కింటి లాయర్‌గారి టెలిఫోన్ నెంబరు ఓ కాగితంలో రాసిచ్చింది.

"అలాగే నేను డాక్టర్‌గారితో చెప్పి వచ్చాను. క్రమం తప్పకుండా రోజూ వచ్చి అమ్మను చూస్తానన్నారు. మరీ ఏదన్నా అర్జంటు అయితే ఎదురింటి వాళ్లనో, పక్కింటివాళ్లనో సాయానికి పిలువు. నేనూ ఫోన్ చేస్తూ వుంటాగా" ధైర్యం చెప్పాడు.

"అలాగే నువ్వు జాగ్రత్తగా వెళ్లిరా"

అప్పటికే వాళ్లిద్దరూ ఆ జాగ్రత్తలు రెండు మూడు సార్లు చెప్పుకుని వున్నారు.

తండ్రి ఇంట్లోంచి వెళ్లిపోవటం, తల్లి అనారోగ్యంతో ఇంటి బాధ్యతంతా వాళ్లిద్దరి తలపైకి పడ్డట్టయి ఇద్దరూ ఒకరికొకరు ఓదార్పు అయ్యారు. మామూలుగా ఒకే ఇంట్లో వుంటున్నా మొదట సంజయ్ తన చదువు, తన స్నేహితులు అంటుండేవాడు. ఆ తర్వాత తన ధ్యానం, తన సాధన అనేవాడే తప్ప అక్క చెల్లెళ్లతో కూడా అంత సన్నిహితంగా వుండేవాడుకాదు. ఈ కొద్దిరోజుల్లోనే అన్నాచెల్లి ఒకరికొకరు తోడు అయి మానసికంగా బాగా దగ్గరయ్యారు.

ఒకటే టెన్షన్‌తోనూ, ఇంటి పనులతోనూ బాగా అలిసిపోయి కాస్త చిక్కినట్లున్న చెల్లెలివంక ఆప్యాయంగా చూశాడు సంజయ్.

"పాపం హాయిగా బంగారు కలలుకంటూ ఏ చీకూచింతా లేకుండా కాలేజికి వెళ్లి వచ్చేదల్లా ఇంట్లో సమస్యలతో సతమతమైపోతున్నట్లుంది" అనుకుంటూ "నువ్వనవసరంగా దిగులు పెట్టుకోకు. అంతా సవ్యంగానే జరుగుతుంది. నేను వెళ్లగానే వివరంగా ఫోన్ చేస్తాను. అమ్మ జాగ్రత్త" మరీమరీ చెప్పి అతను వూరికి వెళ్లిపోయాడు.

గేటు దగ్గరే నిలబడి సంజయ్ వీధి మలుపు తిరిగేదాకా చూసి ఇంట్లోకి వెళ్లబోతూ ఆగి ఎదురింటి వైపుచూసింది సింధూర.

ప్రహారీ గోడ దగ్గర పందిరికి అల్లించి వున్న సన్నజాజి తీగ దగ్గర నిలబడి జాజి మొగ్గలు కోస్తూన్న దీపిక కనిపించింది. అంతదాకా ఆమె కూడా ఇటే సింధూర వంకే చూస్తూ వుండిందేమో చూపులు కలియగానే చిన్నగా నవ్వింది.

సింధూరకూడా అప్రయత్నంగానే ప్రతిగా నవ్వింది. అయితే 'హలో' అంటూ పలకరించబోయేలోగా ఆ అమ్మాయి ముఖమటు తిప్పేసుకుంది.

సింధూరకు కాస్త కోపం వచ్చింది.

"ఒకే వయసువాళ్లం పలకరిస్తే ఏమవుతుంది? లేకపోతే పెద్దావిడ ఎదురింటివాళ్లతో మాట్లాడకూడదు అనేమైనా ఆర్డర్ వేసిందేమో!"

అనుకుని తనూ తల తిప్పుకుని ఇంట్లోకి వచ్చేసింది సింధూర.



మరునాడు వీధిలోకి అరటి పండ్ల బండి వస్తే ఓ డజను పళ్లు తీసుకుని యాభై రూపాయల కాగితం ఇచ్చింది బండి అతనికి సింధూర. అతను నోటు తిరిగి ఇచ్చేస్తూ చిల్లరలేదన్నాడు.

"నా దగ్గరా చిల్లర లేదయ్యా ఏం చేయను? " అని విసుగ్గా అనబోతున్న సింధూర ఎదురింటి గేటు వైపు చూసి ఆగిపోయింది. అప్పుడే ఎక్కడికో బయలుదేరుతూ బయటకు వస్తున్నాడు అరవింద్. అటూ ఇటూ చూసి ఎవరూ ప్రత్యేకంగా



తమను గమనించటం లేదనుకున్నాక నాలు గడుగులు ముందుకు వేసి చేతిలోని యాభై నోటును అతనివైపు చూపుతూ... "చిల్లర వుందా? " అనడిగింది.

అరవింద్ కావాలనే జేబులో వెతుకుతు న్నట్లు, తర్వాత డబ్బుతీసి కాగితాలు వూరికే లెక్కపెడుతున్నట్లు నటిస్తూనే త్వరత్వరగా అడిగాడు.

"సింధూ, నీతో మాట్లాడాలి"

"ఊహు, అస్సలు వీలవదు, అమ్మకేమీ ఒంట్లో బాగులేదు. ఒక్కదాన్ని అమ్మనొదిలి నేను బయటకు రాలేను" అన్నది.

"మీ అన్నయ్యేమయ్యాడు? మీనాన్నగారి సంగతేమన్నా తెలిసిందా? "

"ఆ, బెంగుళూరులో చూశానని బావగారు ఉత్తరం వ్రాశారు. తీసుకువచ్చేందుకై వెళ్ళివు న్నాడు అన్నయ్య. అది సరే మీతో వచ్చిన అమ్మాయి ఎవరు? " సూటిగా చూస్తూ అడి గింది.

చిన్నగా నవ్వుకున్నాడు అరవింద్ ఆమె అనుమానానికి.

"ఆమె పేరు దీపిక. తల్లీ తండ్రీ ఈమ

ధ్యనే ఏక్సిడెంట్‌లో పోయారు. దగ్గరివారె వరూ లేరు. మేం పెళ్లికి వెళ్లిన విశ్వం బాబాయ్ తప్ప ఆస్తివుందికానీ తను మూగ. వూరికే కొన్ని రోజులు వుంటుందని నానమ్మ వెంటబెట్టుకొచ్చింది."

అంత అందంగా, చక్కగా వున్న ఆ అమ్మాయి మూగమ్మాయి అని తెలిసి కాస్త బాధగా అనిపించింది సింధూరకు.

"పాపం?" అనుకుంది మనసులో. కానీ మనసులోంచి ఏదో భారం తొలిగిన భావం.

అప్పటికే అతను చేతిలోని నోట్లను ఎన్నో సార్లు తిప్పించి తిప్పించి లెక్కపెట్టి వున్నాడు.

అరటిపండ్ల బండివాడూ వీరివంకే చూస్తుండటంతో ఇక డబ్బు సింధూర చేతిలో పెట్టాడు.

సింధూర కూడా యాభైరూపాయల నోటు అతని చేతిలో పెట్టి ఇవతలకి వచ్చేసింది.

అరవింద్ తన స్కూటర్ స్టార్ట్ చేసుకుని వెళ్ళిపోయాడు. సింధూర పండ్లతో ఇంట్లోకి నడిచింది.

అంతవరకూ వారిద్దరినీ హాల్లోని కిటికీ వెనుకనించి కుతూహలంగా చూస్తున్న దీపిక కూడా కిటికీ దగ్గర్నుంచి కదిలింది. లోపల్నుంచి వజ్రమ్మ పిలుపు విని దీపిక మాట్లాడలేదేకానీ చక్కగా ప్రతి చిన్న శబ్దమూ వినగలదు.



సంజయ్ వెళ్ళిన మూడో రోజు సాయంత్రం సింధూరకు ఫోనొచ్చింది.

అరుంధతికి బలవంతం చేసి మాత్ర మింగిస్తుండగా పక్కింటి లాయర్‌గారి పని పిల్లవచ్చి చెప్పింది ఫోనొచ్చిందని.

"ఎక్కడ్నుంచి అయి వుంటుందంటావు?" ఆందోళనగా అడిగింది అరుంధతి.

"అన్నయ్య దగ్గర్నుంచి అయివుంటుంది. నేను ఇప్పుడేవస్తాను"అని గబగబా పక్కింటికెళ్ళింది సింధూర.

యస్.టి.డి. కాబట్టి సింధూరను పిలవమని, అయిదు నిముషాల తర్వాత చేస్తానని చెప్పాడుట సంజయ్.

సింధూర వాళ్ళ డ్రాయింగ్ రూమ్‌లో కూచుని వెయిట్ చేయాల్సి వచ్చింది.

లాయర్‌గారి భార్యతో ముఖపరిచయమే కానీ పెద్దగా స్నేహం లేకపోవటంతో సింధూరకు కాస్త రిలీఫ్‌గా వుంది. లేకపోతే ఆవిడేవో ప్రశ్నలడిగి, జవాబులేం చెప్పాలో తోచక తడబడాల్సి వుండేది.

"బాగున్నావా? సింధూరా, ఎప్పుడో ఏ ఏడాదికో, ఆర్నెల్లకో మీ అక్కయ్యల దగ్గర్నుంచో, ఎక్కడ్నుంచో ఫోన్ కాల్ వస్తే తప్ప కనిపించవు" నవ్వుతూ పలకరించిందావిడ.

సింధూర నవ్వింది. అన్నింటికీ అదే బదులన్నట్లు.

"ఫోన్ వస్తే తీసుకో, నాకు కిచెన్‌లో పనుంది" అని చెప్పి ఆవిడ వంటింట్లోకెళ్ళిపోయింది.

సింధూర ఎదురుగా టేబుల్‌పైనున్న ఎర్రని టెలిఫోన్ వంకే ఎప్పుడెప్పుడు మోగుతుందా అన్నట్లు చూడసాగింది. అయిదు నిముషాలు అయిదు యుగాలుగా తోచాయి. ఆరో నిముషానికి మోగిందది.

వెంటనే రిసీవర్ తీసి 'హలో' అన్నది.

అవతల్నించి సంజయ్ స్వరం పలికింది. "హలో, సింధూరేనా మాట్లాడేది?"

"ఆ, నేనేనన్నయ్యా, ఏమయింది?"

"నేను ఇక్కడకు చేరి, విచారించి అడ్రసు కనుక్కుని వెళ్ళేసరికి వాళ్ళు బొంబాయి వెళ్ళిపోయారని తెలిసింది. నేను ఇటునుంచిటే





బాంబే వెళదామనుకుంటున్నాను. అమ్మ ఎలా వుంది? "

"అమ్మ బాగానే వుంది. నువ్వు ఇప్పుడు బాంబే వెళుతున్నావా మరి, అక్కడ నీకె వరూ తెలియదే" ఆందోళనగా అన్నది.

"పిచ్చీ, ఇక్కడ మాత్రం ఎవరు తెలిసున్నా రని వచ్చాను. నోట్లో నాలిక వుంటే ఎలాగో లాగ కనుక్కోవచ్చులే. ఎలాగైనా నాన్నని తీసుకునే ఇంటికి వస్తాను. అమ్మకిలా కాకుండా మరేదైనా చెప్పు. జాగ్రత్త. సరేనా? "

"సరే, సరే. అలాగే" ఎంత దాచుకున్నా సింధూర గొంతులో దిగులు ధ్వనించింది.

"నువ్వేం కంగారుపడకు. అంతా సరిగ్గానే అవుతుంది. వుంటానిక జాగ్రత్త" సంజయ్ అవతల ఫోన్ పెట్టేసాడు. సింధూర కూడా మెల్లగా రిసీవర్ క్రెడిల్ చేసేసింది.

"సంజయ్ బాంబే వెళ్ళి అక్కడంతా ఆచూకీలు తీసి చిరునామా కనుక్కుని వెళ్ళే సరికి వాళ్ళు అక్కడే వుంటారని గేరంటీ ఏమిటి? అన్నయ్యా వాళ్ళనెంత దూరమని ఫాలో అవుతాడు? దొరికినా నాన్న వెంటనే సులభంగా ఒప్పుకుని ఇంటికి వచ్చేస్తారా? ఏమిటీ గందరగోళమంతా? "

మనసులోని దిగులుని కళ్ళలో ప్రతిఫలిం చనివ్వకుండా అదిమిపెడుతూ హాల్లోంచి లోపలికి చూస్తూ, "ఆంటీ, నేవెళ్ళొస్తానిక, థాంక్యూ" అని చెప్పింది.

లాయర్‌గారి భార్య కూర కలియబెడు తున్న గరిటతోనే హాల్లోకి వస్తూ "అలాగే" అన్నది.

సింధూర శక్తే లేనట్లు మెల్లగా నడుచు కుంటూ తమ ఇంటికి వచ్చింది.

సింధూరను చూడగానే అరుంధతి ఆత్రు తగా అడిగింది మంచం మీదనుంచి లేచి కూచుంటూ.

"ఎక్కడ్నుంచి ఫోను? అన్నయ్యేనా? "

"ఆ" నీరసంగా చెప్పింది పక్కనేవున్న కుర్చీలో కూర్చుంటూ.

"అలా వున్నావేం? ఏమన్నాడు సంజు. నాన్నగారు కనిపించారటనా ఇంటికి వస్తు న్నారా? చెప్పవేమే? " ప్రశ్నలు కురిపించిం దామె.

"ఏం చెప్పాలి అమ్మకు? " హఠాత్తుగా ఏమీ తోచలేదు సింధూరకు. ఆమెకు ఆలో చించుకునేందుకు తడవేలేదు. ఏంచెప్పాలో ఆలోచించుకోకుండా అలా వచ్చి తల్లి ముందు కూచోని తానెంత పొరపాటు చేసిందోనని అప్పుడనుకుంది.

"బొంబాయి వెళ్ళారట అమ్మా. అన్నయ్య కూడా వెళ్ళి వున్నాడు" అంటే అదీ తంటా నేమో. లేదు "కనిపించారు, వస్తున్నారు" అంటే "కనిపిస్తే పొద్దున వచ్చేసేదానికి ఇంతలోకే ఫోనెందుకు" అంటుంది. అయినా రేపట్నుంచి ఇంకా రాలేదేం? అని వూరూరికే అడుగుతూంటే తనేం జవాబు చెప్పగలదు. అబద్ధం ఎంతసేపని సాగు తుంది?

సింధూర ఆలోచనలు అలా సాగిపోతూం డగానే అరుంధతి మళ్ళీ కోపంగా అడిగింది. అంత నీరసంలో ఆ కోపానికి ఆమె ముఖ మంతా ఎర్రగా అయిపోయి పెదవులు వణుకుతున్నాయి.

"అడుగుతుంటే అలా బెల్లం గొట్టిన రాయిలాగ కూచుంటావే? ఏమిటా ఫోన్ అని అడుగుతున్నానా? "

"ఏంలేదమ్మా, ఇంతలో నువ్వెందుకిలా ఆయాసపడి పోతున్నావు? అన్నయ్యా దగ్గ ర్నుంచే రెండుమూడు రోజుల్లో నాన్నగా రితో కలిసి వస్తున్నాడట. నీ ఆరోగ్యం ఎలావుంది అని అడిగేందుకు చేసాడంతే" కాస్త తటపటాయిస్తూనే అన్నది.

"రెండుమూడు రోజులెందుకుట? నాన్న

గారిని చూశాడటనా, మాట్లాడాడటనా? "

"ఆ, మాట్లాడాడట"

"ఇంటికి వచ్చేస్తుంటే మళ్ళీ రెండు మూడు రోజులు దేనికి? కాదు, నువ్వేదో దాస్తున్నావు. నాకు తెలుసు మీ నాన్న కని పించి వుండరు. కనిపించినా ఇక ఇంటికి వస్తానని వుండరు. ఆ మాయలాడి వలలో పడిపోయివుంటారు. అయ్యో భగవంతుడా, ఈ వయసులో నాకేమిటీ పరీక్ష? ఇదంతా చూస్తూ ఈ పాపిష్టి బతుకు బతక్కపోతే ఏం నన్ను తీసుకెళ్ళి పోరాదా? దేముడా, దేముడా"

ఆవిడ ఆవేశంగా అరుస్తూ గబుక్కున వెనుక గోడవైపు తిరిగి తల గోడకేసి కొట్టు కోసాగింది.

"అమ్మా, ఏమిటిది? " ఒక్క ఉదుటున లేచి తల్లిని వారించబోయింది సింధూర.

విదిలించి కొట్టిందామె కూతురి చేతుల్ని. "నీ ముఖం చూస్తేనే నువ్వేదో దాస్తున్నా వని తెలుస్తోంది. కన్నతల్లితోనే అబద్ధాలు చెప్తావుటే. మొగుడు చూస్తే అలాగ. పిల్లలు చూస్తే ఇలాగ. ఎందుకు బ్రతకాలి నేను? " ఆవిడ తల కొట్టుకుంటూనే వుంది ఏడుస్తూ.

ఆమెని ఆపటం కష్టంగావుంది సింధూ రకు.

"అమ్మా, వూరుకో, ఏమిటిది? " సింధూ రకు ఏంచేయాలో తోచని నిస్సహాయస్థితిలో ఏడుపు వచ్చేయసాగింది.

"నన్ను వారించొద్దు. నన్నెవరూ తాకొద్దు" సింధూర చేతుల్ని విసిరికొట్టేస్తూనే వుంది అరుంధతి. హఠాత్తుగా అసలామె ఎందు కలా ప్రవర్తిస్తోందో, ఆమెకంత బలం ఎక్క డ్నుంచి వచ్చిందో తెలియలేదు సింధూరకి.

చివరికెలాగో సింధూర బలవంతంగా తల్లి తలని గోడకేసి పోనివ్వకుండా ఆపింది.

అయితే అంతవరకూ హిస్టీరిగ్గా ఏడుస్తూ అరుస్తున్న అరుంధతి హఠాత్తుగా కళ్లు తేలే స్తున్నట్లుగా చూసి తలవాల్చేసింది.

"అమ్మా? "

ఒక్కనిమిషం అలా తల్లివైపే కళ్లప్పగించి చూస్తుండిపోయింది సింధూర. ఆ తర్వాత మెల్లగా భయంగా భయంగా తల్లిని కదిపి చూసింది. "అమ్మా, అమ్మా" అంటూ. అరుంధతిలో ఏమాత్రమూ స్పృహ కనిపించ లేదు. జీవితంలో అంత భయాన్ని, దుఃఖాన్ని ఎప్పుడూ అనుభవించి వుండదు సింధూర. ముందు ఏంచేయాలో తోచనట్లు అలాగే నిలబడిపోయిందల్లా ఒక్కసారిగా తెలివి వచ్చినట్లయి రివ్వున వీధిలోకి పరుగె త్తింది.

ఆమెకాక్షణంలో అరవింద్ తప్ప మరె వ్వరూ గుర్తుకురాలేదు. అరవింద్ అప్పుడే ఎక్కడికో వెళ్ళబోతున్నాడులావుంది. బాణంలా వచ్చిన సింధూర ఒక్క ఉదుటన అతన్ని చేరుకుని అతని చేతుల్లో వాలిపో యింది ఏడుస్తూనే.

ఒక్కక్షణం అరవింద్‌కూ ఏమీ తోచలేదు. నివ్వెరపోతూ తన చేతుల్లో వున్న సింధూర వంకే విస్మయంగా చూశాడు. అక్కడే హాల్లోనే సోఫాలో కూచునివున్న వజ్రమ్మ, వెనుక గదిలోనుంచి వస్తూన్న దీపిక కూడా నిర్ఘాంతపోయి చూడసాగారు ఆ దృశ్యాన్ని.

ముందుగా తేరుకున్న అరవింద్ సింధూర భుజాలు పట్టుకుని కుదుపుతూ అడిగాడు, "సింధూ, ఏమయింది? "

లాలనగా ఆమె వైపే చూస్తూ మళ్ళీ అడగ్గా అప్పటికి కాస్త తనూ తేరుకుని వెక్కుతూనే చెప్పింది సింధూర.

"అమ్మ, అమ్మకేమో అయింది విందూ. ఎవ్వరూ లేరు ఇంట్లో. నాకు చాలా భయంగా వుంది"





"అరె, ఏమయింది? పద వెళ్ళి చూద్దాము" వెంటనే ఆమె చేయిపట్టుకుని ఎదురింట్లోకి పరుగెత్తుతూన్నట్లే వెళ్ళాడు అరవింద్.

చేయిచేయి పట్టుకుని అలా వేగంగా వెళ్ళిపోతున్న వారివంకే కళ్ళప్పగించి, చేష్టలుడిగిన దానిలా చూస్తుండిపోయింది వజ్రమ్మ. దీపిక కూడా ఓ రెండు నిముషాల తేడాలో వారిననుసరించింది. అక్కడ అరుంధతి పరిస్థితి అలాగే వుంది. అరవింద్ వడివడిగా వచ్చి ఆమె చేయి పట్టుకు చూశాడు. నాడి బలహీనంగా కొట్టుకుంటోంది.

అతనిక ఆలస్యం చేయలేదు.

"నేను డాక్టర్ని తీసుకొస్తాను" సింధూరతో చెప్పేసి వేగంగా బయటకు వచ్చి తమ ఇంటిముందున్న స్కూటర్ స్టార్ట్ చేసుకుని రివ్వున వెళ్ళిపోయాడు. అతనలా వెళ్తుంటే వాకిట్లో తనకెదురైన దీపికను కూడా గమనించలేదు. దీపిక పరిచయంలేని వారిల్లు అని ఏమాత్రం సంశయించకుండా సరాసరి లోపలికి వచ్చేసింది.

లోపలి గదిలో అరుంధతి మంచం దగ్గరే మోకాళ్ళపై కూచుని ఆమె వంకే చూస్తూ రోదిస్తున్న సింధూర కనిపించింది. తన తల్లి గుర్తుకు వచ్చింది దీపికకు ఆ క్షణం. మెల్లగా వచ్చి పక్కన నిలబడి సింధూర భుజంపై చేయి వేసింది ఓదార్పుగా.

తల తిప్పి చూసింది సింధూర. ముందు అలా తన పక్కన దీపిక వుండటం చూసి ఆశ్చర్యపడినా తన ధోరణిలో తానుండిపోయింది. దీపిక తనే చొరవగా అటూ ఇటూ చూసి డైనింగ్‌టేబుల్ ఎదురుగా వున్న ఫ్రిజ్ తీసి వాటర్‌బాటిల్‌లోంచి ఓ గ్లాసులో నీళ్ళు వంపి సింధూర దగ్గరకి తీసుకొచ్చి ఇచ్చింది.

"అమ్మకేంకాదు. ముందునీళ్లు తాగు" అన్నట్లు చేతుల్తోనే చెపుతున్న ఆ అమ్మాయి వంకే చూస్తూ అప్రయత్నంగానే గ్లాసందుకుని నీళ్ళు గటగటా తాగేసింది సింధూర.

పక్కపైనున్న అరుంధతికి చీర అదీ సరిచేసి సరిగ్గా పడుకో బెట్టింది దీపిక. ఆ తర్వాత సింధూర పక్కనే వచ్చి కూచుంది.

"ఏడవకు" అంటూ సైగచేసి ఆమె చేతిని తన చేతుల్లోకి తీసుకుంది ఆత్మీయంగా.

నిజంగానే ఆక్షణంలో దీపిక సన్నిధి సింధూరకెంతో ధైర్యంగా అనిపించింది.

అరవింద్ డాక్టర్ దగ్గరకెళ్ళటం, దీపిక తన దగ్గర ఉండటంతో తాను ఒంటరికాదు, తన దుఃఖంలో, బాధలో పాలుపంచుకునేందుకు తనకూ తోడు వున్నారన్న వూరట కలగసాగింది.

ఇంతలో అరవింద్ డాక్టర్‌తో గదిలోకి వచ్చాడు.

ఆ డాక్టర్ రోజూ వచ్చి అరుంధతిని చూసే డాక్టరే కాబట్టి వీళ్ళేమీ చెప్పకుండానే ఆమెను పరీక్షచేసాడు. తన మెడికల్‌కిట్ తెరిచి ఇంజక్షన్ చేసి నుదుట అయిన గాయానికి డ్రెస్సింగ్ చేసాడు. సింధూరవైపు తిరిగి నుదుట గాయమెలా అయిందని అడిగాడు.

"సడన్‌గా ఎమోషనలయి గోడకేసి తల కొట్టుకుందండి" చిన్నగా లోగొంతుకతో చెప్పింది సింధూర.

"భయపడాల్సిందేమీలేదు. సడన్‌గా బి.పి ఎక్కువైంది కొద్దినిముషాలకి తెలివి వచ్చేస్తుంది. రోజు ఇచ్చే మాత్రలే కంటిన్యూ చేయండి. తర్వాత ఆమెకి బాగా విశ్రాంతి అవసరం. ఆవేశం, ఆందోళన బొత్తిగా పనికిరావు. జాగ్రత్తగా చూసుకోండి. నేను మళ్ళీ రేపు వచ్చి చూస్తాను" డాక్టర్ సింధూరకు ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు. గుండెలపైనుంచి కొండంత భారం దిగిపోయినట్లనిపించింది సింధూరకు. అరవింద్ ఆమె భుజంపై చేయివేసి మెల్లగా తడుతూ చెప్పాడు. "డాక్టర్ చెప్పారుకదా, ఏంభయం

లేదని. ఇప్పటికైనా కుదుటపడు" నవ్వుతూ అంటున్నవాడల్లా ఆ పక్కనే దీపిక నిలబడి వుండటం చూసి చప్పున ఆమె భుజంపై నుంచి చేయి తీసేశాడు.

అయితే దీపిక ఇటు తిరగనే లేదు. కావాలనే అటు తిరిగి నిలబడినట్లుంది.

"సరే సింధూ... నేనూ మళ్ళీ వచ్చి చూస్తాను. నీకే సహాయం కావాల్సివచ్చినా నేను ఇంట్లోనే వుంటాను. రావటానికి వెను కాడవద్దు" అనేసి గబగబా అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు. అంతలో అరుంధతి చిన్నగా కదిలి "అమ్మా" అని గొణిగింది.

"అమ్మా, ఇటు చూడు నేను సింధుని" ముందుకి వంగుతూ అన్నది సింధూర.

అరుంధతి చిన్నగా "వూ" అంటూ తల కదిలించి అటు పడుకుంది.

దీపిక సింధూర దగ్గర కొచ్చి "ఇక అమ్మకేం ఫర్వాలేదుగా, నేనూ వెళ్ళిరానా? " అన్నట్లు సైగలతోనే అడిగింది. సింధూర స్నేహ పూర్వకంగా దీపిక చేయి నొక్కింది.

"థాంక్యూ వెరీమచ్! యింతకుముందు పరిచయమే లేకపోయినా నాకష్ట సమయంలో ప్రాణస్నేహితురాలిలా నాకెంతో ఓదార్పుగా నిలబడ్డారు. నిజంగా మీ మంచి మనసును నేనెప్పటికీ మర్చిపోలేను" హృదయపూర్వకంగా అన్నది సింధూర.

మొహమాటంగా నవ్వింది దీపిక.

కొంచెం ఆగి "వస్తాను జాగ్రత్త" అని చెప్పి వెళ్ళిపోయింది దీపిక.

★ ★ ★

దీపిక యింట్లోకి వెళ్ళబోతున్నదల్లా గుమ్మందగ్గరే సందేహంగా ఆగిపోయింది.

లోపల్నుంచి వజ్రమ్మ, అరవింద్‌లమధ్య తీవ్రంగా వాదన జరుగుతోంది.



ఎదురింట్లోంచి వచ్చి మామూలుగా తన గదిలోకి వెళ్ళబోతున్న అరవింద్‌ను వజ్రమ్మ కటువైన స్వరం ఆపింది.

"అయినాయా ఓదార్పులు, పరామర్శలు, సేవాకార్యక్రమాలు? !"

ఆవిడ కళ్ళముందునుంచి ఎంత నెట్టేస్తున్నా సింధూర అరవింద్‌ను హత్తుకుపోయి ఎదపై తల వాల్చి ఏడుస్తూంటే అరవింద్ లాలనగా "ఏమయింది సింధూ? " అంటూ అడుగుతూన్న దృశ్యమే స్టిల్ పిక్చర్‌లా కదలనంటూంది మరి.

ఆమె ప్రశ్నకు కాస్త అసహనంగా చూశాడు అరవింద్.

"ఏమిటి నానమ్మా నువ్వంటున్నది? "

"ఏం నా మాటలు కూడా నీకర్థం కావటంలేదా? "

"నానమ్మా, సింధూ వాళ్ళింట్లో తనూ వాళ్ళమ్మగారు తప్ప మరెవ్వరూ లేరు. ఆవిడ స్పృహతప్పి పడిపోయింది.

ఆ కంగారులో సింధుకి ఆవిడ స్పృహే తప్పిందో మరేమన్నా అయిందోనని తెలియని భయంతో, మరెవ్వరిని పిలవాలో దిక్కుతోచక మనింటికొచ్చింది. నేను

డాక్టర్ని పిలుచుకొచ్చాను. అంతే జరిగింది. దీనికి నువ్వేదో అర్థాలు తీయక్కరలేదు. ఈ మాత్రం సహాయం ఒకరికొకరు ముఖ పరిచయంవున్న వారైనా చేస్తారు" అన్నాడు.

"చేస్తారు... ఈ వీధిలో ఎంతమంది వున్నారు. మనకన్నా ముందునుంచీ వున్న వాళ్ళూ, వాళ్లకి పరిచయస్తులు వున్నారు. కానీ ఆ అమ్మాయి నిన్ను మాత్రమే వచ్చి పిలుచుకుపోవటమేమిటి? "

అరవింద్‌లోనూ సహనం చచ్చిపోయింది. తనూ గట్టిగానే చెప్పాడు.

"ఎందుకంటే ఆ అమ్మాయి నన్నే ప్రేమించింది కాబట్టి. కష్టం, సుఖం నాతోనే పంచుకోవాలనుకున్నది కాబట్టి, సరేనా? "

"అంటే? ఆవేళ నాకెన్ని చెప్పావు, నీకిష్టం లేకుండా ఆ పిల్లవైపే చూడను అన్నావుగా. ఆ మాటేమయింది? అంటే ఆ ప్రేమాయణం యింకా సాగుతోందన్న మాటేగా? "

"ఆహా! సాగుతోంది. మా ఇద్దరిలో ప్రాణం వున్నంతవరకు కొనసాగుతూనే వుంటుంది. మీ అందరి అంగీకారం లేకుండా పెళ్ళి చేసుకోము అన్నామేకానీ మా మనసుల్లో వున్న ప్రేమను తుడిచిపెట్టేసుకుంటున్నాము అని చెప్పలేదే. అయినా అవతల ఆవిడ చావుబతుకులో వుంది. కనీస మానవత్వంతో ఆవిడకెలా వుందన్న మాట అయినా నీ నోటినుంచి వచ్చిందా? ఆరోజు నీకు ఏక్సిడెంటయి దిక్కులేనిదానిలా రోడ్డుపై పడివున్నపుడు ఆవిడ కొడుకేకాదూ నిన్ను హాస్పిటల్లో చేర్చి నీ ప్రాణం కాపాడింది. వేడుక చూస్తున్న పదిమందితోపాటు నాకెందుకు వచ్చింది అని అతననుకున్నాడా ఆ రోజు? మనమొక్కళ్ళమేనా ఆప్తులం, యీ వీధినున్న పదిమందీ ఏమయ్యారు అని ఆరాదీస్తున్నావు యీరోజు? నీకు రానురాను అసలు నువ్వేం మాట్లాడుతున్నావో, ఏం ఆలోచిస్తున్నావో కూడా అర్థంకాకుండా పోతున్నట్లుంది. అయినా ఎప్పుడో వెనకటి తరంలో జరిగినదానికి యిప్పుడు మమ్మల్ని యిలా సాధిస్తున్నావే దానికి అనుకోవాలి" అరవింద్ కోపంగా అనేసి విసురుగా తన గదిలోకెళ్ళిపోయాడు.

"అను... అను... ఇంకా అను... నేను చాదస్తంగా సాధిస్తున్నాను. మానవత్వం లేని రాక్షసిని చాలా? ఇంకా ఎన్నయినా అను. అహర్నిశలు నీ క్షేమమే కోరుతూ నిన్ను కంటికి రెప్పలాగ కాపాడుకుంటూ వచ్చాను కదూ, అందుకు నాకీ ప్రతిఫలం కావాల్సిందే!"

ఆవిడ ఏడుస్తూ కూచుండి పోయింది.

దీపికకు ఆ వాతావరణంలో ఇంట్లోకి వెళ్ళాలంటే చాలా యిబ్బందిగా అనిపించింది. కానీ వెళ్ళకుండా ఎంతసేపని గుమ్మంలోనే నిలబడగలదు. అందుకే అసలదంతా తానేమీ విననట్లు, మెల్లగా అడుగులు కూడా చప్పుడుకానివ్వకుండా నడుస్తూ తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆమెకు విషయమంతా చక్కగా అర్థమైపోయింది.

"సింధూర, అరవింద్‌లమధ్య అనురాగ బంధముంది. ఏ కారణాలవల్ల అయితేనేం వజ్రమ్మ వారి పెళ్ళికి పూర్తి వ్యతిరేకంగా వుంది. బహుశా ఆ కారణంవల్లనేమో ఆమె ఎదురింటి మాట అంటేనే మండిపడుతుంది. వాళ్ళ వీధిగుమ్మం తెరిచి వుంటే ఈమె వచ్చి దఢాలున తమ గుమ్మం తలుపులు మూసి వేయటం కూడా గమనించింది తను.

అరవింద్‌తో తనకు పెళ్ళి అని మద్రాసులో విశ్వనాథం అంకుల్‌తో చెప్పి తనను యిక్కడికి తీసుకొచ్చింది. కానీ ఆవిడకీ ఏ మూలో పూర్తిగా నమ్మకం లేనట్లుంది అరవింద్‌ను ఒప్పించగలనని అందుకే కాబోలు,

"ఉత్తరం వ్రాసిన తర్వాతే అందరూ తరలి రండి" అని చెప్పివచ్చింది.

నయం కదూ, తానూ గుడ్డిగా అరవిందని ఆరాధించటం మొదలు పెట్టలేదు. అయినా తనకి తన అదృష్టంపై ఎన్నడూ నమ్మకంలేదు. పెళ్ళి అయిన తర్వాతే భర్త అన్న వ్యక్తిని ప్రేమించాలి అనుకోవటం మంచిదయింది.

ఇప్పుడు అరవింద్ తనను పెళ్ళి చేసుకోకపోయినా తనకేం బాధలేదు. అసలు ఒకవేళ అతన్ని ఏదో చెప్పి భయపెట్టో, బాధపెట్టో, బలవంతాన వజ్రమ్మ ఒప్పించబోయినా యీ పెళ్ళి తనకే యిష్టంలేదు అని ఆవిడకి చెప్పేయాలి.

తను మూగదే కావచ్చు మాటాడలేకపోవచ్చు దానికర్థం తన మనసూ మూగ కాదుగా. తనంటే యిష్టంలేని వారి హృదయంలో బలవంతంగా కాపురం పెట్టాలనుకోవటం మూర్ఖత్వం. అతనికి బతుకులో మనశ్శాంతి కరువుచేసి తనూ కోరి అశాంతిని కొని తెచ్చుకోవటమే అవుతుంది. రేపే విశ్వనాథం అంకుల్‌కి ఉత్తరం రాసేయడం మంచిది, తను మద్రాసు వచ్చేస్తున్నట్లు"

దీపికకు వజ్రమ్మమీద కోపమూ రాలేదు. పైగా జాలిగా కూడా అనిపించింది. పెద్దతనంతో వాళ్ళ పంతాలు, పట్టింపులే ముఖ్యమనుకుంటారే కానీ పిల్లల మనసుని అర్థం చేసుకోవాలని ప్రయత్నించరు. పెళ్ళి అనేది ఒక్కనాటి ముచ్చటా? జీవితాంతం ఇరువురు కలిసివుండే పవిత్రబంధం. జీవితంలో అతిముఖ్యమైన ప్రధానమైన మలుపు. ఈ మలుపులో సరిఅయిన నిర్ణయం తీసుకోకపోతే ఆ తర్వాత జీవితమంతా బాధపడేది ఆ పెళ్ళి చేసుకున్న భార్యాభర్తలే.

అరవింద్, సింధూర చక్కని జంట అవుతారు పెళ్ళి జరిగితే. సింధూర ఎంతో అదృష్టవంతురాలు! అరవింద్‌లాంటి యువకుడి మనసును గెలుచుకున్నది? ఏది ఏమైనా సరే తను మాత్రం వారిద్దరి మధ్యా రాకూడదు.

"భగవాన్ ఆ పరిస్థితి రానివ్వకు. వారిద్దరినీ ఎలాగైనా కలుపు" మంచి మనసుతో దేముడ్ని వేడుకుంది దీపిక.

★ ★ ★

బొంబాయి వంటి మహానగరంలో చిరునామా చేతిలో వున్నాకూడా అంతవరకూ ముక్కూ ముఖం తెలియని ప్రదేశాలలో వెతుకుతూ వెళ్ళడం ఎంత కష్టమో అనుభవ పూర్వకంగా తెలిసి వచ్చింది సంజయ్‌కి.

ఆ కాంక్రీట్ జంగిల్‌లో అలా అవస్థపడుతుంటే అదృష్టవశాత్తూ దేవుడిలా కనిపించాడు డిగ్రీలో క్లాస్‌మేట్ అయిన- రాజు. ముందు రాజు చూసి "సంజయ్" అని పిలుస్తుంటే, ఆ జనారణ్యంలో తన పేరు పిలిచేదెవరా అని! ఆశ్చర్యానందాలతో చూస్తే ఒకప్పటి స్నేహితుడు రాజు!

మిత్రులిద్దరూ కుశలప్రశ్నలయాక ఎన్ని రోజుల తర్వాత కలుసుకున్నదీ గుర్తుచేసుకుని ప్రస్తుతం ఏమేం చేస్తున్నది చెప్పుకున్నారు.

రాజు అక్కడో పెద్ద ప్రయివేట్ కంపనీలో నాలుగంకెల జీతంతో మంచి వుద్యోగంలోనే వున్నాడుట. వచ్చే వేసవిలో పెళ్ళి కూడా నిశ్చయమైందట. ప్రస్తుతం మరో యిద్దరు స్నేహితులతో కలిసి ఓ గదిలో నివాసం, పెళ్ళి అయితే భార్యను తీసుకొచ్చేందుకై యిప్పటినుంచీ ఓ రెండు గదుల యింటికోసం వెతుకులాటలో తిరుగుతున్నాడట.

సంజయ్‌ని తన గదికి తీసుకెళ్ళాడు. అంత జీతమొచ్చినా అతని సంపాదన ఆ మహానగరంలో ఏదో బొటాబొటీగా మాత్రమే సరిపోయేలా వుంది. పొద్దున




లేచింది మొదలు, తమతమ నివాసాలనే గూళ్ళనుంచి ముప్పయ్యేసి, నలభయ్యేసి కిలోమీటర్లు అతిమామూలుగా ప్రయాణించి ఉద్యోగాలు చేసుకుంటున్నారు వాళ్ళంతా. ఆ బిజీ, ఆ జనప్రవాహం, ఆ వాహనాలు అదంతా సంజయ్‌కి హారిబుల్‌గా అనిపించింది, అతనూ ఓ సిటీ నుంచే వచ్చినా.

సంజయ్ తనెందుకు బొంబాయి వచ్చిందీ రాజుకి చెప్పాడు. ఆ తర్వాత పనులు చురుకుగా సాగిపోయాయి. రాజుకి నగరమంతా బాగా తెలిసివుండటం వలన అతని సహాయంతో ప్రమద్వర వాళ్ళ నాటక మండలి ఎక్కడ నాటకాలు వేస్తున్నదీ సులభంగానే తెలుసుకోగలిగారు సంజయ్ దగ్గరున్న వివరాలతో. సంజయ్, రాజు బయలుదేరి వెళ్ళేసరికి ఆనాటి కార్యక్రమంగా థియేటర్‌లో ఓ సాంఘిక నాటకం జరుగుతోంది. వీళ్ళు వెళ్ళేసరికి నాటకం మొదలైపోవటంతో ఆనందరావుని వేరుగా కలుసుకునేందుకు వీలు పడకపోవటంతో అందరితోపాటు వీళ్ళు నాటకం చూసేందుకు కూచున్నారు. నాటకంలో ఆనందరావుకి చిన్న పోర్షనుంది. హీరో దగ్గర రెండు డైలాగులు చెప్పేది. నిజానికి ఆ పాత్రకీ నాటకానికీ పెద్దగా సంబంధం లేనట్లుంది. ఏదో అప్పటికప్పుడు కావాలని ఓ రెండు డైలాగులు రాసి ఆ వేషాన్ని సృష్టించినట్లుంది. ఆనందరావు ఎంతో చిక్కిపోయి వున్నాడు. ఆ పది రోజులకే పదేళ్ళు వయసు పైబడ్డవాడిలా వున్నాడు.

తండ్రినలా చూస్తుంటే సంజయ్‌కెంతో వేదన కలిగింది.

"ఎందుకొచ్చిన కష్టమిదంతా? " అని కలత చెందాడు. నాటకమైన తర్వాత అనుమతి తీసుకుని దగ్గరకు వెళ్ళాడు. ముందు అంత హఠాత్తుగా అక్కడ కొడుకుని చూసేసరికి ఆనందరావుకేం అర్థంకాలేదు.



"ఏరా సంజూ, యిలా వచ్చావు? ఇంట్లో అంతా బాగున్నారా?." సర్దుకుని మెల్లగా అడిగాడు.

దీర్ఘంగా చూశాడు సంజయ్. "మీరేమిటి నాన్నా, యిలా అయిపోయారు? "

"ఎలా అయిపోయానంటావు. నాలుగురోజులు చూడక సడన్‌గా చూస్తే ఎవరికైనా అలానే కనిపిస్తారు. నా కళ్ళకి నువ్వా చాలా చిక్కినట్లు అనిపిస్తున్నావు తెలుసా? " నవ్వేశాడు.

"ఇంటికి వెళదాంరండి నాన్నా" మరే ఉపోద్ఘాతమూ, వివరాలు లేకుండా అడిగాడు సంజయ్.

"ఏం హఠాత్తుగా యిలా వచ్చి యింటికి రమ్మంటున్నావు ఇంట్లో అంతా బాగానే వున్నారుకదా? " కాస్త కలవరంగా అడిగాడు ఆనందరావు.

"ఇప్పటివరకూ అంతా బాగానే వున్నారు. ఇంకా మీరు యింటికి రాకపోతే మాత్రం అమ్మ పరిస్థితి ఏమీ చెప్పలేము"

"ఏం అమ్మకేమయింది? నేను వచ్చేటప్పుడు బాగానే వుందిగా"

"మీరు వచ్చేసినప్పట్నుంచీ యింతవరకూ అమ్మ మంచంలోంచి లేవలేదు. మీరు యింకా ఆలస్యం చేస్తే అమ్మని... అమ్మని మనం దక్కించుకో...లేం" ఆమాట అంటూంటే సంజయ్ గొంతు వణికింది.

ఆనందరావు కొడుకువంక ఓ నిముషం నమ్మలేనట్లుగా చూశాడు. ఆ తర్వాత కొంచెంసేపు తనలో తనేదో ఆలోచించుకున్నట్లుగా వుండిపోయి చివరకి "అలాగే వెళదాము. నేను వీళ్ళతో చెప్పేసి వస్తాను" అన్నాడు.

సంజయ్‌కి ఒక్కసారిగా మనసులోంచి కొండంత భారం తొలిగిపోయినట్లయింది. తండ్రి ఇంటికి రావడానికి అంత వెంటనే, అంత సులభంగా అంగీకరిస్తాడని అతనను కోలేదు. అంతవరకూ గది బయటే

వేచివున్న స్నేహితుడితో సంతోషంగా ఆ విషయం చెప్పాడు. ఆనందరావు వాళ్ళని కొద్దిసేపు వెయిట్ చేయమని లోపలికెళ్లాడు.

కొంచెంసేపటి తర్వాత ఓ చిన్న కుర్రాడొచ్చి సంజయ్‌ని "ప్రమద్వరగారు" పిలుస్తున్నారని అటువైపున్న లేడీస్ మేకప్ రూమ్ వైపు తీసుకెళ్ళాడు.

సంజయ్ వెళ్ళేసరికి ప్రమద్వర అప్పుడే మేకప్ అంతా తీసేసి ముఖం కడుక్కుని వస్తోంది టవల్‌తో తుడుచుకుంటూ "కూర్చోండి" కుర్చీ చూపించింది.

సంజయ్ కూర్చున్నాక తనూ వచ్చి ఎదురుగా కూర్చుంటూ అడిగింది.

"మీరు ఆనందరావుగారబ్బాయా? "

తలవూపాడు సంజయ్. అతను ప్రమద్వరనే గమనించసాగాడు. ఏ అలంకారమూ లేకుండా వున్నా ఆమె ముఖం ఎంతో అందంగా వుంది. చెల్లెలిద్వారా వినివున్న దానివలన ప్రమద్వరని అతను మరో విధంగా వూహించుకుని వున్నాడు. "కానీ ఈమె ఎంతో అందంగానే కాదు, హుందాగా, మర్యాదపూర్వకంగా కూడా వుంది!" మనసులో అనుకున్నాడు.

"మీరు మీ నాన్నగారిని వెతుక్కుంటూ వచ్చి మంచి పని చేశారు. ఆయన ఉండాల్సిన చోటు యిది కాదు. ఇక్కడ అలవాటు లేని వ్యక్తులు ఇమడలేరు"

ఆమె మాటలకి కాస్త ఆశ్చర్యంగా చూశాడు సంజయ్.

"ఆయనేదో మానసిక అసంతృప్తితో మా వెంట వచ్చేశారని తెలుసు మాకు. పెద్దవారు, గౌరవనీయులు మా ట్రూప్‌లోని వారం కాదనలేకపోయాం. మామూలుగా మేము కొన్ని సెలక్టివ్ నాటకాలే వేస్తుంటాం. మా నాటకాలలో ఆయన వయసుకి తగ్గ కేరక్టర్స్ లేవు. ఆయన మీదుండే గౌరవంకొద్దీ నేనే మా డైరెక్టర్ గారితో చెప్పి కొన్ని పాత్రలు సృష్టించమన్నాను. నిజానికి అవి తగినవి కావు. కానీ అంతకన్నా మేమేం చేయలేం. ఆశయమయితే వుందికానీ అనుభవం లేదుకదా. నేనెన్నోసార్లు చూచాయగా చెప్పిచూశాను. ఈ రంగానికి సరిపోరని. ఈవరకు బహుశా ఆయనే అర్థం చేసుకుని వుంటారు"

ఆమె ఓ క్షణం ఆగింది.

"నాకు రెండు మంచి టీవి సీరియల్స్‌లో అవకాశాలు వచ్చాయి. నేనూ యీ ట్రూప్‌లోనే పూర్తికాలం కొనసాగలేను. రావుగారికి ఇక్కడ నేను తప్ప మరెవరితోనూ పెద్దగా పరిచయం లేదు. ఆయన మీతో ఇంటికి వచ్చేస్తాననడం నాకూ పెద్ద అపరాధ భావం తొలిగినట్లుంది"

మళ్ళీ ఆగి మెల్లగా అన్నది. "రావుగారలా మాతో వచ్చేయడానికి కారణం నేను అని మీరు అనుకుంటున్నట్లయితే నన్ను మన్నించండి. ఆయన ఇంట్లో ఓ ఉత్తరం మాత్రం పెట్టి ఎవరితో చెప్పకుండా వచ్చేసినట్లు నాకు తర్వాతే తెలిసింది. అప్పుడే చెప్పాను అది మంచి పద్ధతి కాదేమోనని. దానికాయన రెండు రోజులు అన్నంతినలేదు. నాకెంతో బాధవేసింది. సరే ఏదెలా అవాలనుంటే అలా అవుతుంది లెమ్మని వూరుకుండిపోయాను"

అంతలో ఆమెతో మాట్లాడేందుకని ఎవరో రావటంతో ఆమె లేచి నిలబడింది.

సంజయ్ కూడా లేచి ఆమెవంక చూస్తూ అప్రయత్నంగానే చేతులు జోడించాడు. "మేము వెళ్లొస్తాము" ఆమె కూడా చేతులు జోడించింది మృదువుగా నవ్వుతూ.

మరి కొద్దిసేపటికే సంజయ్ తండ్రితో ఆ ప్రదేశం వదిలిపెట్టి వచ్చేశాడు. చిన్న ఎయిర్‌బేగ్‌తో తనవెంట మవునంగా వస్తున్న తండ్రిని చూస్తుంటే ఎందుకో అప్పటిదాకా

ఏమూలో వున్న కోపం మంచులా కరిగి పోయి జాలి కలిగింది. అడిగింది దొరకలే దని మారాంచేసి కొద్దిసేపు అలిగి మళ్ళీ మరిచిపోయి మామూలు ధోరణిలో పడి పోయే చిన్నపిల్లాడిలా అనిపించాడాయన అతనికా క్షణంలో.

తెలతెల్లవారుతుండగా కాలింగ్‌బెల్ మోత విని నిద్ర కళ్లు నులుముకుంటూ వచ్చి తలుపు తెరిచింది సింధూర. దిగులు నిండిన ఆలోచన్లతో రాత్రంతా సరిగా నిద్ర పట్టక అంతకుముందే నిద్రపట్టింది సింధూ రకు.

అయితే తలుపు తీయగానే కనిపించిన సంజయ్‌నీ, ఆ వెనుకే ఆనందరావునీ చూడ గానే ఆ నిద్రమత్తంతా చప్పున మాయమై పోయింది.

"నాన్న వచ్చేశాడు. ఇక అమ్మకేమీ కాదు. లేచి మామూలుగా తిరుగుతుంది" ఆ వూహకే గాలిలో తేలుతున్నంత ఆనందంగా అనిపించగా అలాగే రివ్వున అరుంధతి పడుకుని వున్న గదిలోకి పరుగెత్తుకెళ్ళింది.

"అమ్మా, నాన్న వచ్చేశారు!" సంతోషంగా దాదాపు అరిచినట్లే చెప్పింది.

నిద్ర, మెలకువ కానిస్థితిలో కళ్లు మూసు కునివున్న అరుంధతి కూతురి మాటలకి చటుక్కున కళ్లు తెరిచి చూసింది.

అప్పటికే సింధూర వెనుకే సంజయ్, ఆనందరావులు ఆ గదిలోకి వచ్చారు. ఆనం దరావు భార్యవంకే ఆశ్చర్యంగా చూస్తుండి పోయాడు. తనను మళ్ళీ ఇంటికి తీసుకువ చ్చేందుకై సంజయ్ ఏదో అరుంధతికి అనా రోగ్యం అని చెపుతున్నాడనుకున్నాడే కానీ నిజంగానే భార్య అలా మంచంకి అంటుకి పోయి ఉంటుందనుకోలేదు. తను వెళ్ళిన ఈ కొద్ది రోజులకే ఇంత మార్పా? తన ఉనికికి ఇంత ప్రభావం వుందా భార్యలో? అప్రయత్నంగానే ఆయన కళ్లలో నీళ్లు తిరి గాయి.

"ఏమయింది అరుంధతీ? ఏమిటిలా అయిపొయ్యావు? " ఆమె తలపై చేయి వేస్తూ ఆప్యాయంగా అడిగాడు.

"మీరు... మీరు నిజంగానే వచ్చేశారా? సంజూ, సింధూ నేను కలకనటం లేదు కదా? " అరుంధతి ఆయన చేతులు అందు కుంటూ వణుకుతున్న కంఠంతో అడిగింది.

"లేదమ్మా, నిజంగానే నాన్న వచ్చేశారు" సంజయ్ చెప్పాడు. సంజయ్‌కీ, సింధూరకూ కూడా కళ్ళనిండా నీళ్లు తిరిగాయి.

"నిజంగానే! ఏడు కొండలవాడా దయచూ పించావా? " అరుంధతి ఏడ్చేయసాగింది.

"అరుంధతీ, ఏమిటిది చిన్నపిల్లలాగ. నేనె క్కడికి వెళ్ళిపోయాను. వచ్చేశాగా, వూరుకో"

ఆనందరావు ఓదార్చసాగాడు. సంజయ్, సింధూర మెల్లగా ఆ గదిలోంచి వచ్చే శారు.

★ ★ ★

అరుంధతి అనారోగ్యమంతా చిత్రంగా ఎవరో చేత్తో తీసేసినట్లే మాయమవగా మెల్లగా లేచి తిరగసాగింది. చిన్నగా తనే స్నానం చేసేసుకుని, డైనింగ్ టేబుల్ దగ్గర కొచ్చి అందరితోపాటు కూర్చుని భోంచే సింది. పనులు అవీ చేసేంత శక్తి రాకపో యినా బలహీనంగానే వున్నా మరో రెండు మూడు రోజుల్లో మామూలుగా అయిపో తుందని అనిపించసాగింది సింధూరకూ, సంజయ్‌కీ. డాక్టర్ కూడా చూసి ఇంకేమీ భయపడాల్సిన పనిలేదని మంచి ఆహా రమూ, విశ్రాంతి తీసుకుంటే నాలుగురో జుల్లో లేచి ఎప్పటిలా ఇంటి పనులన్నీ చేసు కోగల శక్తీ, ఉత్సాహమూ వచ్చేస్తుంద న్నాడు.

★ ★ ★

లెక్చరర్ల సమ్మె గెలిచింది. కాలేజీలు తెరి

చారు.

సింధూర తల్లికి పళ్లరసం తీసి గ్లాసులో పోసి ఇస్తూ అడిగింది.

"అమ్మా, నేను రేపు కాలేజికి వెళ్ళనా? పనంతా చేసేసి వెడతానులే"

"పిచ్చి పిల్లా, ఈ పదిరోజులుగా పని చేసి చేసి నువ్వు ఎంత చిక్కిపోయావో తెలుసా? నాకింకేమీ పర్వాలేదు. నువ్వు నిక్షేపంగా కాలేజికి వెళ్లు. పరీక్షలకు ముందు కాలేజి మానేస్తే తర్వాత హైరానా పడతావు"

సింధూర హాయిగా నిట్టూర్చింది తల్లి నోటంట ఆ మాట విని. ఆ రోజంతా, తండ్రి వచ్చేశాడని, తల్లి ఆరోగ్యం చాలావ రకు చక్కబడినట్లేనని అరవింద్‌తో చెప్పా లని ఎంతగానో చూసింది సింధూర. కానీ ఎదురింటివైపు చూస్తూ ఎంతసేపని నిరీక్షి స్తున్నా అరవింద్ దర్శనమే కాలేదు. నిరు త్సాహంగా అనిపించింది.

ఇక మరునాడు కాలేజికి వెళ్ళినప్పుడు చెప్పాల్సిందే అనుకుంటూ ఆ సాయంత్రం బయట వరండా దగ్గరున్న మల్లెపాదు దగ్గర నిలబడి ముదురు ఆకులు తీసేస్తూ, పాదులు సరిచేస్తూ ఆఖరు ప్రయత్నంగా ఎదురింటివైపు చూసింది సింధూర. అప్ప టికి అరగంటనుంచి మెల్లగా ఆ పని చేస్తూనే వుంది.

అరవింద్ బయటకు రానేలేదు. అసలు ఇంట్లోనే వున్నాడో లేక ఎక్కడికైనా బయ టకు వెళ్ళాడో కూడా తెలియలేదు. ఇక విసుగొచ్చేసి ఇంట్లోకి వెళ్ళిపోదామ నుకుంటున్నంతలో దీపిక బయటకు వచ్చింది.

సింధూరని చూసి పలకరింపుగా నవ్వి చెయ్యూపుతూ గేటువైపు వచ్చింది. సింధూర కూడా నవ్వుతూ ఆమె వైపుగా నడిచింది.

లోపల అరుంధతి ఆరోగ్యం ఎలా వుంద న్నట్లు చూపుతూ ప్రశ్నించింది దీపిక.

"బాగుంది. పూర్నుంచి మా నాన్నగారు వచ్చేశారు" సంతోషంగా చెప్పింది సింధూర.

ఆ కబురు విని దీపిక ముఖంలోనూ సంతోషం కనిపించింది.

"మీరు ఆ రోజు చాలా సహాయం చేశారు. నాతోనే వుండి నాకెంతో ధైర్యం చెప్పారు. మీ మంచి మనసు నేనెప్పటికీ మర్చిపోలేను" మనస్ఫూర్తిగా అన్నది సింధూర. మొహమాటంగా నవ్వింది దీపిక.

"ఇంటిలోకి రాకూడదూ? కాఫీ తాగు దురు కానీ" ఆదరంగా ఆహ్వానించింది సింధూర.

"ఇప్పుడు కాదు మరోసారి" అన్నట్లు సైగ చేసి, ఇంతలో లోనుంచి వజ్రమ్మ గొంతు విని "వస్తానని" చెప్పి చెయ్యూపి లోపలకి వెళ్ళిపోయింది దీపిక.

సింధూర కూడా గేటు దగ్గర్నుంచి ఇంట్లోకి వచ్చేసింది. తన పిలుపు విని లోనికి వచ్చిన దీపిక వంక చూస్తూ మన సులో అనుకుంది వజ్రమ్మ.

"ష... ఇదొట్టి వెర్రిబాగుల పిల్ల. కాస్త నవ్వుతూ మాట్లాడేసరికి ఆ సింధూర చాలా మంచి అమ్మాయి అనుకుంటోంది కాబోలు. ప్చ్ అయినా విందూ దీపికతో పెళ్లికి ఏమాత్రమూ ఒప్పుకొనే ఆశలు కనపడటం లేదు"

ఆవిడకెంతో దిగులుగా అనిపించింది.

సింధూరమీద పీకలదాకా కోపమూ వచ్చింది. ఆ అమ్మాయే కనుక తన మన వడ్ని వలలో వేసుకోకపోతే అసలీ గొడ వంతా వుండేనా? లక్షణంగా ఈవరకు ఓ మంచి అమ్మాయిని చూసి ఆ మూడుముళ్లు కూడా వేయించివుందును. అంతా తన

ఖర్మ. తన కళ్ళతో అసలు మనవడి పెళ్ళి చూసే అదృష్టం వుందో లేదో?

అరవిందుడికి పెళ్ళయి ఈ ఇంట ఓ వంశాంకురం పుడితే కానీ తన ఆత్మకు శాంతి వుండదు- ఈ లోకాన వున్నా, ఏ లోకాన వున్నా.

దీపికని సింధూరతో మాట్లాడవద్దని చెప్పాలనిపించిందిగానీ ఇంతవరకూ ఆ అమ్మాయి తమ ఇంటి కోడలు కానేలేదు. అప్పుడే ఇలా శాసించటానికి తనకేం హక్కువుంది? ముందు పిలిచి ఆ సంగతీ చెప్పాలనుకున్నది. కానీ మళ్ళీ ఈ ఆలోచనతో మానుకుంది.

కానీ, ఆవిడకి తెలియదు, దీపిక, విశ్వనాధంకు ఎప్పుడో ఉత్తరం వ్రాసేసిందనీ, పెళ్ళెటూ జరగదనీ.



చాలారోజుల గ్యాప్ తర్వాత కాలేజి తెరవటంతో విద్యార్థులంతా ఎంతో ఉత్సాహంగా తయారయి కాలేజికి వచ్చారు. ఆ ఆవరణ అంతా కళకళలాడిపోతోంది.

స్నేహితుల మధ్య కబుర్లు తరగటమే లేదు. ఒకటే నవ్వులతో, కేకలతో హోరెత్తిపోతోంది కేంపస్ అంతా. లెక్చరర్స్ కూడా వాళ్ళ అల్లరి చూసీ చూడనట్లే దాటిపోతున్నారు. సింధూర కళ్లు స్నేహితురాళ్ళతో మాట్లాడుతున్నా అరవింద్ కోసమే వెతుకుతున్నాయి.

చివరికి స్టాఫ్ రూమ్‌కి వెళ్ళి అక్కడే గనక వుంటే అతన్ని బయటకి పిలిచి అన్నా మాట్లాడుదామన్న నిర్ణయానికి వచ్చింది.

"ఇప్పుడే వస్తాను. చిన్న పనుంది" అని ఫ్రెండ్స్‌తో చెప్పి స్టాఫ్‌రూమ్‌వైపు నడుస్తుండగా అటుపక్క ఫాకల్టీస్ రూమ్‌నుంచి వస్తున్న తన్మయి చూసి పిలిచింది. "హాయ్, సింధూ" అంటూ సింధూరకి ఆగక తప్పలేదు.

"ఇటెక్కడికి? " దగ్గరకొచ్చి అడిగింది.

తన్మయి చేతిలో చిక్కితే ఓ పట్టాన వదలదు మనుషుల్ని.

"ఓ, నీవదనారవిందం దర్శనానికేనా? " చిలిపిగా నవ్వుతూ తనే మళ్ళీ అడిగింది.

చిరుకోపంగా చూసింది సింధూర.

"బాప్‌రే, కాలం చూశావా ఎంత ఫాస్టయిందో? అమ్మాయిల్ని అబ్బాయిలు ఫాలో అయితేనే కంగారు పడేవారట మన సీనియర్స్ టైంలో. మరి ఇప్పుడో అమ్మాయిలే అబ్బాయిల కోసం పరుగు పెట్టేస్తున్నారు" అల్లరిగా అన్నది.

సింధూర, అరవింద్‌ల ప్రేమాయణం ఆమె గ్రూప్‌లోని వారందరికీ చూచాయగా తెలిసిన విషయమే అయినా "ఏయ్ తనూ, నిన్నూ" అంటూ తన్మయి చేతిని గట్టిగా గిల్లింది సింధూర.

"అబ్బ, ఏమిటా గిల్లటం? కంద పూడివచ్చేట్లు. నిన్ను నీ గోవిందుడు ఎలా భరిస్తాడోగానీ? "

చేతిని చూసుకుంటూ తెచ్చి పెట్టుకున్న కోపంతో అన్నది తన్మయి.

"ఇదో మళ్ళీ? నీతో మాట్లాడటమే నా బుద్ధి తక్కువ పని" అనేసి సింధూర తన

దారిన తాను నడవబోతుంటే ఆమె చేయిప ట్టుకు ఆపింది తన్మయి.

"సరేసరే. నీ గోవిందుడితో మాట్లాడటమే బుద్ధి ఎక్కువపని కానీ ఇంతకీ నీ అరవిం దుడు స్టాఫ్ రూమ్‌లో లేడు"

"లేడా? నీకెలా తెలుసు?" గబుక్కున అడిగింది సింధూర.

"పది నిముషాల క్రితం లైబ్రరీలో చూశాను"

"నిజంగా" అనుమానంగా చూసింది సింధూర స్నేహితురాలిని.

"నిజంగా నిజం. కావాలంటే మన శమం తకమణి ఒట్టుమీద ఒట్టు" నవ్వింది తన్మయి.

వాళ్ళ గ్రూప్‌లోని శమంతకు మాటకు ముందు ఒట్టు అనడం అలవాటు.

"సరే పద మరి" వెనక్కి తిరిగి లైబ్రరీ వున్న దారిన అడుగులు వేస్తూ అన్నది సింధూర.

"మీ ఇద్దరి మధ్యా నేనెందుకే రామాయ ణంలో పిడకలాగ" తనూ సింధూ వెనకే నడుస్తూ అన్నది తన్మయి.

"ఊరికేగానీ మాట్లాడక పద. మాది రామాయణమూ కాదు. ఇక నువ్వు పిడ కవూ కాదు"

"పోనీ ప్రేమాయణంలో చిలకలాగా అనేదా?"

"ఏమీ అనొద్దు. నోర్మూసుకుని నడువు చాలు"

ఇద్దరూ చేయి చేయి పట్టుకుని నవ్వు కుంటూ లైబ్రరీవైపు వెళ్ళారు. అయితే అక్కడో భయానక సన్నివేశం సింధూర కోసం కాచుకుని వుంది.

★ ★ ★

లైబ్రరీ వున్న మలుపు తిరగ్గానే ఇద్దరూ సీరియస్ అయిపోయి తమ నడక వేగం హెచ్చించారు. కారణం అక్కడ అప్పటికే కాలేజిలోని సగంమంది గుంపుగా చేరిపో యివున్నారు. మిగిలినవాళ్ళూ వచ్చి చేరుతు న్నారు. లైబ్రరీ రూమ్‌ముందే పెద్ద అరుగు వుంటుంది. అది సరిగ్గా సెంటర్ ఆఫ్‌ది కాలేజి కేంపస్ అవటంవలన, దాని ముందంతా చక్కని పెద్ద లాన్ వుండటంవ లన కాలేజిలో జరిగే అన్ని ఫంక్షన్స్, కార్య క్రమాలు అన్నీ ఆ డయాస్‌మీదే జరుగుతుం టాయి. అక్కడ చుట్టూ తెరలు కట్టేస్తే నిముషాలమీద పెద్ద స్టేజి తయారైపో తుంది.

ఆ డయాస్‌మీద మధ్య నిలబడివున్నా డొక పిచ్చివాడు. అతనా కాలేజిలోకి ఎలా వచ్చాడో ఏమో తెలియలేదు. బిగ్గరగా, పిచ్చిగా నవ్వుతున్నాడు అతడు. అతని ఒంటిమీద బట్టలు బాగా చిరిగి, మాసి పోయి వున్నాయి. గడ్డం మాసి దుబ్బుగా తీరుతెన్ను లేకుండా వున్న జుట్టు సగం ముఖాన్ని కప్పేస్తుండగా విచిత్రంగా కను గుడ్లు తిప్పుతూ చేతుల్తో ఏదేదో సైగలు చేస్తున్నాడు.

అందరికీ భయం గొలుపుతూ అతని చేతిలో తళతళ మెరుస్తూంది పదునైన కత్తి.

ఆ కాలేజి కేంపస్‌లోకి ఆ పిచ్చివాడెలా ప్రవేశించాడో అందునా ఆ పిచ్చివాడి చేతి లోకి అంత పదునైన కత్తి ఎలా వచ్చి చేరిదో అక్కడున్న ఎవరికీ అర్థం కాలేదు. ఎవ్వరూ అతన్ని సమీపించే సాహసం చేయ టంలేదు. కారణం అతను ఒకేదిశగా నిలబ టంలేదు. చూడటం లేదు. అతని కదలి కలు అతివేగంగా వున్నాయి. చేతిలోని కత్తి అందరికీ భయం గొలుపుతూ కదులు తూంది. డయాస్ మీదే అతనికెదురుగా నలుగురు నిలబడివున్నారు నిరుత్తరులై.

బియస్సీ ఫైనలియర్ రజియా, కామర్స్



సెకండియర్ రోహిత్, పొలిటిక్స్ మేడమ్ మరియా, అరవింద్. ఏ క్షణానైనా ఆ నలు గురిలోని ఒకరు పిచ్చివాడి చేతిలో బలి కాబోయేట్లున్నారు.

మరియా మేడమ్ అయితే దాదాపు వణి కిపోతోంది. వారిలో ఎవరు ఏమాత్రం అటూ ఇటూ కదిలినా అతను కత్తి విసి రేలా వున్నాడు. ఆ నలుగురిలో అరవింద్ లేకుండా వుంటే సింధూర కూడా అందరితో పాటే కాస్త బెదురుగా వున్నా వినోదంగానే చూస్తూ వుండేదేమో. జరగబోయే దృశ్యాన్ని. కానీ... కానీ అక్కడ ఆ నలుగు రిలో అరవింద్ కూడా వున్నాడు.

సింధూర తన్మయి చేయి ఎప్పుడు వదిలే సిందో తెలియదు. గుంపులుగా వున్న అంద రినీ నెట్టుకుంటూ ముందుకు వచ్చేసింది. మెల్లమెల్లగా నడుస్తూ లైబ్రరీ పక్కన వరం డాలోంచి వచ్చి డయాస్‌కి ఓ పక్కన వున్న స్తంభం దగ్గర కొచ్చి నిలబడింది. అరవింద్ నిశ్చలంగా పిచ్చివాడి వంకే చూస్తూవు న్నాడు.

అతనే కాదు కాస్త ధైర్యమూ, చురుకుత నమూ వున్న మరికొంతమంది విద్యార్థులు, అవకాశం కోసం ఎదురు చూస్తున్నారు. అయితే రాజుకన్నా మొండివాడు బలవంతు డన్నట్లు అక్కడ వున్నది చిరుతపులిలా కదు లుతున్న పిచ్చివాడు. తాము వేసే ఒక్క అనాలోచిత అడుగువలన అతను ఎవరివై పన్నా కత్తి విసిరేశాడంటే మాత్రం ఒకరి ప్రాణాల్ని చూస్తూ చూస్తూ బలి యిచ్చినట్లు వుతుంది.

అందుకే అందరూ వూపిరి బిగపట్టి అత నివంకే రెప్పవాల్చకుండా చూస్తున్నారే కానీ అతన్ని వారించేందుకు ఒక్కరూ ముందుకు అడుగు వేయుటం లేదు.

సింధూర చూపులు అరవింద్‌పైనా పిచ్చి వాడి చేతిలోని కత్తివైపు చురుగ్గా కదులుతు న్నాయి. అతను మిగిలిన ముగ్గురి వంకా కాక అరవింద్‌వైపు కత్తి విసిరితే...?

భగవాన్, యింకేముంది?

తన జీవిత సర్వస్వం ఓ కత్తివేటుతో కోల్పోతుంది.

అరవింద్... అరవింద్!

అలాగే రెండు నిముషాలు గడిచిపో యాయి.

పిచ్చివాడు వికృతంగా నవ్వుతూనే వున్నాడు. చేతులు తిప్పుతూనే వున్నాడు.

హఠాత్తుగా గబుక్కున అతని నవ్వు ఆగి పోయింది.

కత్తి విసిరేశాడు బలంగా, అరవింద్‌వైపే. అరవింద్‌తోసహా అందరూ ఏం జరిగిందో తెలుసుకునే లోపల జరిగిపోయిందా సంఘ టన. పిచ్చివాడు కత్తి విసరటం, రివ్వున అదే వేగంతో సింధూర "అరవింద్" అంటూ అరవింద్‌వైపు పరుగెత్తుకు రావటం, కత్తి ఆమె భుజంలో దిగబడటం జరిగిపో యింది. ఆమె ఓ పక్కనుంచి పరుగెత్తుకు రావటం, అదీ అరవింద్‌కు అభిముఖంగా వెళ్ళటంతో ఆ కత్తి ఆమె భుజానికి తగి లింది. లేదంటే సరిగ్గా ఆ కత్తి అరవింద్ గుండెల్లోకి దిగబడేదే.

అరవింద్‌కి అంతసేపు ధ్యాసంతా పిచ్చివా డివైపే వుండటంతో అతను సింధూరని గమనించనేలేదు. ఆమె ఎటునుంచి వచ్చిం దోకానీ తన ప్రాణాలకి ఆమె ప్రాణాలు బలి పెట్టింది. చివ్వున రక్తం చిమ్ముతుండగా అలాగే అతనివైపు ఒరిగి స్పృహ తప్పిపడిపో యింది సింధూర.

పిచ్చివాడు "భలేభలే" అంటూ రక్తం చూస్తూ చిందులువేస్తూ నవ్వుతున్నాడు. ఇప్పుడతని చేతిలో కత్తిలేదు. అందుకే మెరి కల్లాంటి కొందరు విద్యార్థులు, లైబ్రేరియన్, అటెండరు అందరూ ఒక్కుమ్మడిగా అతన్ని చుట్టుముట్టేసి రెక్కలు విరిచి పట్టుకు

న్నారు.

పిచ్చి బలంతో గింజుకుంటున్న అతన్ని బలవంతాన లాక్కెళ్లి తాళ్లుతెచ్చి వరండా స్తంభానికి కట్టేశారు. మరికొంతమంది సింధూర చుట్టూ మూగారు. అంతవరకూ ప్రాణాలరచేతిలో పెట్టుకుని ఏమవుతుందో నని చూస్తున్న ప్రిన్సిపాల్, మిగిలిన లెక్చ రర్స్ కూడా అందరినీ తొలగించుకుంటూ ముందుకి వచ్చారు. అప్పటికే ఎవరో ప్రిన్సి పాల్ రూమ్‌లోకివెళ్లి అంబులెన్స్‌కి ఫోన్ చేసినట్లున్నారు... పరిస్థితి ఎలా వుంటుం దోనని.

మరో అయిదు నిముషాలకే అమిత వేగంతో కాలేజి ఆవరణలోకి అంబులెన్స్ వచ్చి ఆగింది. ఆ తర్వాత పనులు చకచకా జరిగిపోయాయి. సింధూరని అంబులెన్స్‌లో చేర్చారు. అరవింద్ ఆమె తలను తన ఒడి లోకి చేర్చుకున్నవాడు అలాగే అచేతనంగా వుండిపోయాడు.

అసలిదంతా అతనికి కలా నిజమా అన్న ట్లుంది. ఆ రోజతను ఎన్నో రోజులుగా తన దగ్గరే వుండిపోయిన లైబ్రరీ పుస్తకాల్ని రిటర్న్ చేద్దామని లైబ్రరీకొచ్చాడు. అంతలో హఠాత్తుగా ఎట్నుంచి వచ్చాడో పిచ్చివాడు అరుస్తూ గంతులేసుకుంటూ రావటంతో ఎక్కడివారక్కడే చెల్లాచెదురుగా వెళ్లిపో యారు. తనూ, మరియా మేడమ్, సరళ, రోహిత్ మాత్రం కదిలేందుకు వీల్లేకుండా అతని దృష్టికి చిక్కిపోయారు. అడుగు వేయబోతే చేతిలోని కత్తి విసురుతానంటూ భయపెట్టటంతో చేసేదేం లేక అశక్తుల్లా నిలబడిపోవాల్సి వచ్చింది.

అతను తను అనుకున్నట్లే కత్తి చివరకి తనవైపే విసిరాడు. తన ప్రాణాలు ఈ వరకు పోవాలసిందే. సింధు అడ్డురాకపోతే ఆ కత్తి తన ఛాతిలో దిగబడివుంటే?

సింధు, సింధు ఎంత పనిచేశావు? ఇప్పుడు సింధుకేమయినా అయితే తను బతకగలడా? ఏమిటిలా జరిగింది?

అంబులెన్స్ హాస్పిటల్ చేరేవరకు అర వింద్ ఆలోచనలలా సాగిపోతూనే వున్నాయి.

డాక్టర్స్ సింధూరని చూసి పరిస్థితి అప్ప టికి సీరియస్‌గానే వున్నా ప్రాణాపాయ మేమీ లేదన్నాకగానీ అతని మనసు కుదు టపడలేదు.

వీరి వెనుకే స్కూటర్స్‌లో, ఆటోలలో చాలామంది స్టూడెంట్స్, లెక్చరర్స్ కూడా వచ్చి చేరారు. హాస్పిటల్ బయట వాతావ రణమంతా కాలేజి వారితోనే కిటకిటలాడిపో యింది. అప్పటికే అది సంచలన వార్తగా అంచెలంచెలుగా ఆ చుట్టుపక్కలంతా పాకి పోయింది. పత్రికల వాళ్లూ రాసాగారు.

సింధూరని ఎమర్జెన్సీ వార్డులో వుంచారు.

హఠాత్తుగా గుర్తు వచ్చింది అరవింద్‌కు, సింధూర ఇంటిలో ఈ విషయం తెలియప ర్చారా అని. తన పక్కనున్న సింధూర క్లాస్ మేట్స్‌ని అడిగాడు.

"రవి అప్పుడే వెళ్లాడు సార్. బహుశా వాళ్ల పేరంట్స్ ఈవరకు వస్తూవుంటారు"

★ ★ ★

అప్పుడే బయటకు వెళ్లేందుకు తయారై వెళ్లబోతున్నాడు సంజయ్.

"నేను సింధూర క్లాస్‌మేట్‌ని అండీ" అని తననుతాను పరిచయం చేసుకుని రవి చెప్పిన విషయం షాక్‌లా అనిపించింది సంజయ్‌కి.

"సింధుకి కత్తిపోటా? హాస్పిటల్లో సీరి యస్ పరిస్థితిలో వుందా? "

"గంట రెండు గంటల క్రితం ఘామూ లుగా హాయిగా కులాసాగా కాలేజికి వెళ్లిన తన చెల్లెలు ఇప్పుడు కత్తిగాయంతో హాస్పి



టల్లో వుందా? "

అతను నమ్మలేనట్లు చూశాడు. కానీ అంత సీరియస్ విషయంలో తమాషాలెవరు చెప్తారు?

"భగవంతుడా ఇదేం పరీక్షలు మాకు? నిన్ననే కదా నాన్నగారు ఇంటికి వచ్చారు. అమ్మ ఆరోగ్యానికేం భయం లేదిక అని తేలిగ్గా నిట్టూరుస్తున్నంతలో హఠాత్తుగా ఈ పిడుగుపాటేమిటి? ఇప్పుడిప్పుడే తేరుకుంటున్న అమ్మ బలహీనంగా వున్న గుండె ఈ విషయం విని తట్టుకోగలదా? ఒకదాని తర్వాత ఒకటిగా ఏమిటీ ఎదురు దెబ్బలు? తమ ఇంటికెవరో శాపం పెట్టలేదుగదా? "

విషయం విని నిలబడడానికే శక్తిలేనట్లు నిస్సత్తువుగా ఆ పక్కనే వున్న కుర్చీలో కూలబడిన సంజయ్ వంక ఓదార్పుగా చూశాడు రవి.

"భయపడాల్సిందేమీ లేదనే అన్నారు డాక్టర్లు" దగ్గరకొచ్చి అనునయంగా అన్నాడు.

తలెత్తి అతనివంక చూశాడు సంజయ్. ఆ తర్వాత గుండె దిటవు పరుచుకుంటూ లేని ధైర్యాన్ని, శక్తినీ తెచ్చుకుని నిలబడుతూ అన్నాడు, "ఒక్క నిముషం ఆగండి. వెళదాము" అని లోపలకి వెళ్లాడు.

ఇంటిపనంతా ఉదయమే లేచి సింధూర చేసే కాలేజికి వెళ్లటంతో గదిలో విశ్రాంతిగా కళ్లు మూసుకుని పడుకుని వుంది అరుంధతి. ఆనందరావు పుస్తకాల అలమార దగ్గర నిలబడి ఏదో పుస్తకాన్నికై వెదుకుతున్నాడు.

లోపలికి వచ్చిన సంజయ్‌ని చూసి అడిగాడు, "ఎవరువచ్చింది? నీ స్నేహితుడా? "

రవి చెప్పినది ఆయన వినలేదు.

"నాన్నా ఓ నిముషం ఇలా రండి" గబగబా దగ్గరకొచ్చి తండ్రి చేయి పట్టుకుని బయట వరండాలోకి తీసుకొచ్చాడు. ఆనందరావు తెల్లబోయాడు కొడుకు చర్యకి.

లోపలున్న తల్లికి అక్కణ్ణుంచి వినపడదనుకున్నాక చెప్పాడు రవి తనతో చెప్పిన విషయం.

ఆనందరావు షాక్ తిన్నట్లే చూశాడా మాటలకి.

"సింధుకిప్పుడెలా వుందట? " వణుకుతున్న గొంతుతో అడిగాడు ఇద్దరివంకా చూస్తూ.

"భయపడాల్సినదేమీ లేదట. నేను ఇప్పుడు హాస్పిటల్ కెళుతున్నా. మీరీ విషయం అమ్మకి చెప్పకుండా వుండటమే మంచిదేమో!" సందేహంగా అన్నాడు.

ఆయనా సరేనన్నట్లే తలవూపాడేకానీ "చెప్పకుండా ఎంతసేపు? సాయంత్రానికైనా సింధు ఇంటికి రావాలికదా? అప్పుడేం చెప్పాలి? "

ఇద్దరికీ ఒకేసారి వచ్చిందా ఆలోచన.

"సరేసర్లే, అవన్నీ నేను చూసుకుంటాను. మెల్లగా నేను చెప్తానులే అమ్మకి. నువ్వు వెంటనే వెళ్లు. అక్కడెక్కడ్నుంచయినా విజయవాడకి ఎస్‌టిడి చేయి. అక్కయ్యలొస్తే వాళ్లు అమ్మని చూసుకుంటారు" అన్నాడు ఆనందరావు.

"అలాగే" అని సంజయ్ రవి గేటు దాటబోతుంటే మళ్లీ పిలిచి దగ్గరకొచ్చి చెప్పాడు ఆయన.

"సంజూ, నువ్వెళ్లగానే చెల్లాయిని చూసి ఎలా వున్నదీ నాకు మన పక్కింటివాళ్ల నెంబరుకు ఫోన్ చేసి చెప్తావా? "

"అలాగే"నంటూ రివ్వున రవి బైక్‌మీద వెళ్లిపోయారు వాళ్లు.

"భగవంతుడా సింధుని కాపాడు"

ఆయన కళ్లముందు తెల్ల పావురం లాంటి సింధూర రక్తసిక్తమైవున్నట్లు కనిపించింది.




అరుంధతికి విషయమంతా మార్చి చెప్పాడు ఆనందరావు. సింధూర కాలేజిలో మేడమెట్లు మీదనుంచి కాలు మడతపడి కిందకి దొర్లిందని కాలు కొద్దిగా ఫ్రాక్చర్ యితే కట్టుకోసమై హాస్పిటల్ కెళితే డాక్టర్ ఆ కాలును రెండుమూడు రోజులు కదల్చ కూడదన్నాడని అందుకే ఆమెని హాస్పిటల్లో వుంచామని చెప్పారు.

దానికే ఎంతో కంగారుపడిపోయింది అరుంధతి.

"అయ్యో! బిడ్డ అక్కడ కదలలేకుండా వుంటే నేనిక్కడ ఎలా నెమ్మదిగా వుండేది? నేను వెళ్లి చూస్తాను" అని గొడవ చేసింది.

"సింధుకేం కాలేదు. చక్కగా కులాసాగా వుంది. రెండు రోజుల్లో తనే నడుచు కుంటూ వచ్చేస్తుంది. మేమింతమందిమి వున్నాంకదా చూసుకునేందుకు. నీకసలు పూర్తి విశ్రాంతి అవసరమన్నారు డాక్టర్" అని ఎలాగో నచ్చచెప్పి ఆమెని కుదుటప ర్చారు.

నిజానికి ఆ న్యూస్ సిటీలోనే సంచలన వార్త అయింది. టీవీలో కూడా చెప్పారు ఆ సంఘటన గురించి.

ఆ రాత్రికి హాస్పిటల్లో సింధూర దగ్గర ఎవరుండాలన్న ప్రశ్న వచ్చింది. లేడీస్వా ర్డ్‌లో జెంట్స్‌ను రాత్రి వుండేందుకు ఆ హాస్పిటల్ రూల్స్ ఒప్పుకోలేదు.

అరవింద్ కానీ సంజయ్ కానీ వుండే అవకాశమేలేదు. ఆ రాత్రికే సింధుని ఎమ ర్జెన్సీనుంచి రూమ్‌కి మారుస్తామన్నారు. సింధూర స్నేహితురాళ్లలో ఎవరైనా వుంటా రుకానీ సంజయ్ మొహమాటపడ్డాడు.

పరిస్థితి గమనించి అరవింద్ చెప్పాడు "సంజయ్ మీరు మా ఇంటికి వెళ్లి విషయం చెప్పండి. పొద్దున కాలేజీకని వచ్చిన వాడిని ఇంతవరకూ నేను ఇంటికే వెళ్లలేదు. నానమ్మ కంగారు పడుతూంటుంది. మా ఇంట్లో బంధువులమ్మాయి దీపికవుంది. చాలా హెల్పింగ్ నేచర్ గల అమ్మాయి. సింధుకీ తనకీ స్నేహమూ వుంది. ఆ అమ్మాయిని రాత్రికి ఇక్కడ వుండమం దాము" అన్నాడు.

సంజయ్‌కి అదీ అంత బాగుండదేమో అనిపించినా అరవింద్ మరోసారి కూడా చెప్పటంతో అలాగేనని ఇంటికి వచ్చాడు.



సంజయ్ ముందు తల్లికి తెలియకుండా తండ్రితో విషయం చెప్పి ఎదురింటికి వచ్చాడు.

అరవింద్ రాత్రుళ్లు ఇంటికి ఆలస్యంగా ఎప్పుడూరాడు. అదీ సాయంత్రం కాలేజీ నుంచి ఇంటికి వచ్చయినా మళ్లీ బయటకు వెళతాడేకానీ పొద్దున్నుంచి కనిపించకుండా బయటే ఎప్పుడూ వుండిందిలేదు. అందుకే వజ్రమ్మ ఎంతో ఆందోళనగా ఎదురు చూస్తోంది మనవడికోసం. అప్పటిదాకా హాల్లోనే సోఫాలో కూచుని వుండిన ఆమె కొద్దిసేపు ఏ భాగవతమో అన్నా చదువు తుంటే కాస్త మనసుకి వూరటగా వుంటుం దని తన గదిలోకి వెళ్లింది.

అప్పుడే వచ్చాడు సంజయ్ లోపలికి. తలుపు చిన్నగా తట్టిన శబ్దానికి దీపిక వచ్చి

తలుపు తెరిచింది.

ఆ అమ్మాయే అరవింద్ చెప్పిన దీపిక అయి వుంటుందనుకున్నాడు మనసులో సంజయ్.

"ఎవరూ? ఏమిటి?" అని ఆమె ఏమీ అడక్కముందే తానే గబగబా చెప్పాడు, "నా పేరు సంజయ్, సింధూర అన్నయ్యని"

"రండి కూర్చోండి" అన్నట్లు చిరునవ్వుతో చేతులు జోడిస్తూ సోఫా చూపింది దీపిక.

తలుపు తీసిన చప్పుడు విని గదిలో నుంచి వజ్రమ్మ వచ్చింది. సంజయ్ అంటే ఆమెకెప్పుడూ మంచి అభిప్రాయమే, అతను అరుంధతి కొడుకైనాగాని.

"బాగున్నావా బాబూ?" ఆప్యాయంగా అడిగింది.

బాగున్నట్లే తలవూపుతూ పొద్దున కాలేజిలో జరిగిన సంఘటనంతా క్లుప్తంగా చెప్పాడు.

"ఏమిటీ? అరవింద్‌పైన పిచ్చి వాడెవడో కత్తి విసరబోతే సింధూర అడ్డం వచ్చి తన ప్రాణాలమీదకి తెచ్చుకుందా? అలాకాక ఆ కత్తే కనుక విందూకే తగిలివుంటే? హారి భగవంతుడా?" ఆవిడ గబుక్కున ఎదురుగా వున్న సోఫాలో కూర్చుండిపోయింది. దీపిక కళ్లలోనూ ఆందోళన కనిపించింది. పరుగున తన గదిలోకి వెళ్లి తన నోట్‌బుక్ పెన్నూ తీసుకు వచ్చి "సింధూకిప్పుడెలా వుంది?" అని రాసి చూపెట్టింది సంజయ్‌కి.

సంజయ్ ఆశ్చర్యంగా చూశాడు దీపికవైపు అంత సీరియస్‌నెస్‌లోనూ. అతనికి తెలియదు మరి దీపిక మాట్లాడలేదని.

"డాక్టర్లు మరేం ఫర్వాలేదన్నారు. అయినా హాస్పిటల్‌లో కొన్ని రోజులుండాలి కదా! అరవింద్ అక్కడే వున్నాడు. మా అమ్మకి పూర్తిగా ఒంట్లో బాగుండలేదు. అసలీ విషయం మేము అమ్మకి చెప్పలేదు కూడా. అక్కయ్యలకి ఫోన్ చేసివున్నాము. రేపటికివాళ్లు వచ్చేస్తారు. ఈ రాత్రికి మాత్రం సింధు దగ్గరెవరైనా వుండాలి. అరవిందగారు ఈ విషయం ఇంట్లో చెప్పి రమ్మన్నారు"

"పద నాయనా నేను వస్తాను" వజ్రమ్మ చప్పున లేచింది సోఫాలోంచి.

"మీరా? మీ ఆరోగ్యమే సరిగా వున్నట్లు లేదు. ఈ వయసులో శ్రమతీసుకొంటే..."

అతని మాటలని మధ్యలోనే ఆపేసింది ఆమె.

"నాకేం నిక్షేపంగా వున్నాను. నువ్వు ఆటో పిలిస్తే నేను బయలుదేరుతాను" అన్నదేకానీ గుండెపట్టుకుని మళ్లీ సోఫాలోనే కూర్చుండిపోయింది. "దీపా, గుండె దడగా వుందమ్మా హఠాత్తుగా ఇదంతా వినేసరికి. కాస్త ఆ మాత్రలిలా అందుకో అమ్మాయ్!" ఆయాసంగా వుంది ఆమెకు.

చప్పున తన బుక్‌లో రాసి చూపించింది దీపిక.

"వద్దు మామ్మగారూ మీ ఆరోగ్యం బాగా లేదు. మీకెందుకు శ్రమ. నేను వెళతాను సింధూ దగ్గరకు"

వజ్రమ్మ ఆగి ఓ క్షణం ఆలోచించి అన్నది.

"సరే అలాగే కానివ్వు. కానీ నువ్వలా వెళ్లిన వెంటనే అరవిందుణ్ణి ఇంటికి పంపించు. ఈ ముసలి ప్రాణం ఇవన్నీ వింటూ తట్టుకోలేదని చెప్పు" ఆవిడ కంఠం రుద్ధమయింది.

ఆవిడ కప్పటికప్పుడు అంత గండంలోంచి బయటపడ్డ మనవణ్ణి చూడాలనివుంది. అంతేకాదు తన మనవణ్ణి అంత ప్రాణాపాయంనుంచి కాపాడిన సింధూరనే చూడాలని వుంది.

★ ★ ★







ఆ మరునాటికి వూరునుంచి మంజుల వచ్చేసింది. అంజలి వాళ్ల అత్తగారికి అప్పుడే కాటరాక్ట్ ఆపరేషన్ అయిందట. కబురు తెలిసీ వెంటనే రాలేకపోతున్నానని మంజుల ఇంటికి వచ్చి కన్నీళ్లతో తన పరిస్థితిని పుట్టింటిలో తెలియచేయమందట.

"ఇక నేను వూరినుంచి వచ్చేశాను కాబట్టి సింధూర దగ్గర నేను వుంటానులెండి. మీరు ఇంటికి వెళ్లిపొండి" అని మంజుల అన్నా దీపిక ఒప్పుకోలేదు.

"అక్కడ ఇంట్లో మాత్రం నేను చేసేదేముంది. మీరు మీ అమ్మగారి ఆరోగ్యం చూసుకోండి. పైగా మీకు చిన్న పాప కూడా వుంది. అవస్థ అవుతుంది... ఇటూ అటూ తిరగాలంటే" అని రాసి చూపి దీపిక తనే హాస్పిటల్లో సింధూర దగ్గర వుండిపోయింది. అనటమేకాదు సింధూరని కంటికి రెప్పలా చూసుకున్నది కూడా. ఆ అమ్మాయి వినయం, సహనం, పని చేసే తీరు ఇవన్నీ ఎంతో ముచ్చట గొలిపాయి ఆనందరావు, సంజయ్‌లకి.

తమకేమీ కాని ఓ అపరిచిత యువతిగా అనిపించటం లేదు ఇప్పుడు. దీపిక కూడా తమ కుటుంబంలోని ఓ వ్యక్తిగానే ప్రీతిపాత్రమైపోయింది వారందరికీ.

వారందరూ తనతో అంత ఆత్మీయంగా వుండటం దీపికకూ తానో అనాధనన్న భావం మెల్లమెల్లగా పోసాగింది.

సింధూర కొంచెం కోలుకుంది. లేచి కూర్చుని మాట్లాడసాగింది. ఆ మరునాడు ఇంటికి పంపేస్తామనగా వజ్రమ్మ వచ్చింది హాస్పిటల్‌కి. అంతకు ముందూ వచ్చింది కానీ అప్పుడు సింధుతో మాట్లాడలేకపోయింది.

అరవింద్ ఆమెని తీసుకు వచ్చి సింధూర రూమ్‌లో వదిలి తను బయటకు వెళ్లిపోయాడు.

కళ్లు మూసుకుని ఊరికే పడుకుని వున్న సింధూరని మెల్లగా తట్టిలేపి ఆమె కోసం వచ్చిన వజ్రమ్మను చూపింది దీపిక.

"తనను చూసేందుకు అరవింద్ నానమ్మ వచ్చిందా? తానంటేనే కోపంకదా ఆమెకు? "

ఆశ్చర్యంగా అనుకుంటూనే మెల్లగా లేచి దిండుకు ఆనుకుని కూర్చుంది సింధూర.

"ఆ, అc లేవకమ్మా, జాగ్రత్త" అంటూ దగ్గరకొచ్చి మంచం పక్కనున్న కుర్చీలో వచ్చి కూర్చుంది వజ్రమ్మ.

"ఎంత సాహసం చేశావమ్మా? ఆ కత్తే కనుక మరికాస్త బలంగా తగిలుంటే నీ ప్రాణాలకే ప్రమాదమయ్యేది అన్నారుట కదా డాక్టర్లు. అలా ఎందుకు చేశావమ్మా?" అడిగింది.

సింధూరకు తన మనసులోని మాట ఆవిడతో చెప్పేయాలనిపించింది ఆ క్షణాన. అందుకే అన్నది "నిజమే కావచ్చు కానీ ఆ పిచ్చివాడు అరవింద్‌వైపు కత్తి విసరటంతో ఆ క్షణంలో నేనింకేమీ ఆలోచించలేకపోయాను. అరవింద్‌కేమన్నా అయితే ఇక నేనుండీ ఎందుకు అనిపించింది. మన్నించండి మీతో ఇలా చెపుతున్నందుకు"

వజ్రమ్మ చప్పున ముందుకి వంగి సింధూర తలపై చేయివేసి నిమురుతూ అన్నది.

"ఇంకా కోపాలేమిటమ్మా మన్నించేందుకు. దేముడు మనయందున్నాడు. నా మనవడ్నీ, నా మనవడికి కాబోయే భార్యనూ ఇద్దరినీ కాపాడాడు!"

సింధూర ఆ మాటలకి ఆశ్చర్యానందాలతో కళ్లింత చేసుకుని చూసింది ఆవిడ వంక.

"పిచ్చిపిల్లా. ఇంత జరిగాక ఇంకా నేను మీ పెళ్లికి అడ్డుపడతాననుకుంటున్నావా? యముడితో పోరాడి భర్త ప్రాణాలు తెచ్చుకుంది సావిత్రి. కానీ నువ్వు అసలు యము



డేమిటి, అతగాడి భటుల్ని కూడా మావాడి ఛాయలకి రానివ్వకుండా నీ ప్రాణాలు అడ్డు వేసి మరీ రక్షించుకున్నావు. ఇంత ప్రాణాధికంగా ప్రేమించే అమ్మాయి నా మనవడికి భార్యగా వస్తుంటే ఇంక నాకు కావాల్సిందేముందమ్మాయ్. నువ్వే మా ఇంటికి రాబోయే కోడలివి"

సింధూరకసలు ఏం మాట్లాడాలో కూడా తోచలేదు. ఇంకా అపనమ్మకంగానే చూస్తోంది ఆవిడవంక. ఆవిడ అంత సులభంగా అంత ప్రసన్నంగా తమ పెళ్లికి ఒప్పుకుంటుందన్న ఆశ కలలో కూడా రాలేదు సింధూరకు.

అంతవరకూ వారిద్దరూ మాట్లాడుతుండగా తాను కిటికీలోంచి బయటకు చూస్తూ నిలుచునివున్న దీపికను దగ్గరకు పిలిచింది వజ్రమ్మ.

"దీపా, ఇలా రామ్మా? "

దీపిక దగ్గరకు రాగానే ఆ అమ్మాయి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ అన్నది.

"నవ్వు ఈ ముసలమ్మను క్షమించాలమ్మాయ్. నిన్ను మా అరవిందుడికి చేసుకుందామని పిలుచుకొచ్చాను. కానీ ఇప్పుడు వీరిద్దరి అనురాగం చూశాక వీళ్లని విడదీయాలనుకోవటం పాపం అనిపిస్తోంది. అలా అని నేను నిన్ను మళ్ళీ మద్రాసు పంపేయను. నా మనవడికన్నా మంచి సంబంధం చూసి నీ పెళ్ళి సలక్షణంగా జరిపించే బాధ్యత నాది సరేనా? "

సింధూర బెడ్‌కి తగిలించి వున్న ప్రిస్క్రిప్షన్ పాడ్ అందుకుని వ్రాసిచూపించింది దీపిక.

" అరవింద్, సింధూరల పెళ్లికి మీరంగీకరించటం నాకెంతో సంతోషంగా వుంది. వారిద్దరి ప్రేమ తెలుసుకున్నాక నేను ఎప్పుడో విశ్వనాథం అంకుల్‌కి ఉత్తరం వ్రాసేశాను, నేను మద్రాస్ వచ్చేస్తున్నట్లు. మీకు ఈ విషయం ఎలా చెప్పాలా అనుకుంటున్నంతలో ఈ సంఘటన జరిగింది. నా పెళ్ళి గురించి మీరేమీ బాధపడవద్దు. జరగాల్సినప్పుడే జరుగుతుంది"

"నాకు తెలుసు. దేముడు నీకు నోరు ఇవ్వలేదు కానీ కొండంత బంగారు మనసిచ్చాడని. నీ మంచి తనమే నీకు శ్రీరామరక్ష అవుతుంది. ఏదిఏమైనా నీకు మంచి వరుడ్ని చూసే బాధ్యత నాదే" వజ్రమ్మ దీవిస్తూ అన్నది.

దీపికకు అంతలో చటుక్కున ఏదో ఆలోచన రాగా,

"ఇప్పుడే వస్తానుండండి" అన్నట్లు సైగ చేసి బయటకు వెళ్ళింది.

బయట వరండాలో విజిటర్స్ కోసం వేసిన సోఫాల్లో కూర్చుని అక్కడున్న పుస్తకాలు యధాలాపంగా తిరగేస్తున్న అరవింద్ దగ్గరకెళ్ళి "రండి" అన్నట్లు చేయిపట్టుకుని గదిలోకి తీసుకువచ్చింది. తన దగ్గర ఎప్పుడూ అంత చనువు చూపని దీపిక చర్యకి ఆశ్చర్యపోతూనే వచ్చాడు అరవింద్.

"మామ్మగారు మీ పెళ్ళికి ఒప్పుకున్నారు"

పెద్ద పెద్ద అక్షరాలు వ్రాసి చూపించింది దీపిక నవ్వుతూ. అరవింద్ కూడా అది చూడగానే ఆశ్చర్యానందాలతో చూశాడు నానమ్మ వంక.

"నిజమేరా పిచ్చి! ఏమిటా చూపు? " ముద్దుగా విసుక్కుంది వజ్రమ్మ మనవడ్ని.

"థాంక్యూ నానమ్మా, నిజంగా నువ్వు గ్రేట్!"

"నేను కాదురా గ్రేట్. ఇదిగో ఈ సింధూరదే ఆ గొప్పతనమంతా. ఎలా అయితేనేం నన్ను ఒప్పుకునేలా చేసింది" ఆవిడ సింధూరను చూపిస్తూ అంటుంటే సింధూర సిగ్గుగా నవ్వేసింది.

"హమ్మయ్య నువ్వు గ్రీన్ సిగ్నల్ ఇచ్చావు. అంటే నా పెళ్ళి సగమయినట్లే" అన్నాడు అరవింద్.

"సగమేమిటి? " వజ్రమ్మ అడిగింది.

"అదంతే మరి. వీళ్లింట్లోనూ ఒప్పుకోవాలి కదా? "

"అదెంతసేపు ఒప్పించటం? కాదనడానికి ఈ వజ్రమ్మ మనవడికేం వంక? ముందు అమ్మాయిని క్షేమంగా ఇంటికి చేరనీ. నేనే స్వయంగా వెళ్ళి అడిగి నిశ్చయం చేయనూ? " ఆవిడెంతో తేలిగ్గా అనేసింది కానీ సింధూరకి మాత్రం సందేహంగానే వుంది. మిగిలిన అందరిమాట ఎలా వున్నా తల్లి ఒప్పుకుంటుందో లేదోనని.

★ ★ ★

అరుంధతి ఆరోగ్యం త్వరగానే కుదుటపడ్డది. డాక్టర్ ఆశ్చర్యపోయేలా లేచి తిరుగుతూ తన పనులు తాను చేసుకోవటమే కాదు ఇంటిల్లిపాదీ వద్దంటున్నా వినక మంజులకి ఇంటి పనుల్లో సాయం కూడా చేయసాగింది. ఓ రోజంతా అలా చురుగ్గా తిరిగిన తర్వాత రెండోరోజే "ఆటో పిలుచుకురండి. సింధూని చూడాలి" అన్నది.

తన ఆరోగ్యం బాగున్నదని నిరూపించుకోవటానికే ఆమె లేచి తిరిగిందని అర్థమైంది అందరికీ. ఇంక వద్దన్నా వినదని తెలుసు. అందుకే ఆనందరావు ఆమెని కూర్చోపెట్టి మెల్లగా విషయం చెప్పేశాడు. అంతా విన్న వెంటనే ఏడ్చేసింది ముందు.

"ఇప్పుడేం కాలేదుకదా" రేపు సింధుని ఇంటికి తీసుకొచ్చేస్తున్నాం అని చెబుతున్న అందరిపై కోప్పడింది.

"ఏమనుకుంటున్నారు మీరంతా నన్ను. నా కూతురికి అంత ప్రమాదం జరిగితే కన్నతల్లిని నా దగ్గరే దాస్తారా? కాలికేదో గాయమైందని అబద్ధాలు చెప్తారా? " అన్నది.

"మరి నీ ఆరోగ్యమూ చూడాలికదమ్మా. డాక్టర్ నీకు చెప్పవద్దన్నాడు. మళ్ళీ నీకేదైనా అయితే ఎలా? ఇప్పుడేమిటి నువ్వు చెల్లాయిని చూడాలి. అంతేకదా. సింధూ ఎటూ ఇంటికి వచ్చేయబోతోంది. కాదు ఇప్పుడే చూడాలి అంటే పద నేను తీసుకెళతాను. హాస్పిటల్‌కి" అంటూ సంజయ్ బయలుదేరేసరికి ఆ కోపమంతా మరిచిపోయి ఆందోళనగా కూతురి దగ్గరకు బయలుదేరింది.

సింధూర నవ్వుతూ మాట్లాడడం చూసిన దాకా ఆమె మనసు కుదుటపడలేదు.

తన కూతురికి తామెవ్వరూ కూడా చేయనంత సేవ స్వంత సోదరిలా చేస్తూ అక్కడున్న దీపికను చూస్తే అరుంధతికి ఎంతో ఆత్మీయంగా తోచింది. ఆ అమ్మాయి మాట్లాడలేదని తెలుసుకున్నాక ఎంతో బాధ పడింది. "బంగారు బొమ్మలాగుంది. మాట్లాడలేకపోతేనేం? " అనుకుంది.

అయితే దీపిక ఎదురింటికి వచ్చిన చుట్టాలమ్మాయి అని తెలిసి కాస్త అసంతృప్తిగా ఫీలయింది.

"వాళ్ళ సహాయం ఎందుకు తీసుకుంటున్నారు? మన మంజు వుంటుందికదా. ఆ అమ్మాయి పాపం ఎంతో మంచిదిలానే వుందనుకో. కానీ వాళ్ళ మంచితనాన్ని మనం వాడుకుంటున్నట్లు కాదూ? " అని సంజయ్‌ని మందలించింది చాటుగా.

"మంజక్క ఇంటిలో నిన్నూ తన చంటి పాపాయిని చూసుకోవాలికదమ్మా. అయినా దీపిక మేం ఎంత చెప్పినా వినలేదు. సింధు దగ్గర తనే వుంటానని పట్టుబట్టింది. వాళ్ళిద్దరికీ బాగా స్నేహం కూడా కుదిరిపోయింది. అసలు నాకూ, నాన్నగారికీ కూడా ఆ అమ్మాయిని చూస్తుంటే ఎందుకో పరాయిదిలా అనిపించటం లేదు. చిటికెలో మనలో కలిసిపోయింది"

★ ★ ★

సింధూరని ఇంటికి తీసుకొచ్చేశారు. ఆరోజే అంజలి కూడా పూర్నుంచి వచ్చింది పిల్లల్ని తీసుకుని. చెల్లెలికీ, తల్లికీ తను అవసరమైనప్పుడు వచ్చి ఆదుకోలేకపోయినందుకు ఎంతగానో బాధపడింది.

సింధూర క్షేమంగా ఇల్లు చేరిందని తమ కాలనీలో వున్న వేంకటేశ్వరస్వామి ఆలయంలో టెంకాయలు కొట్టి అర్చన చేయించింది అరుంధతి.



ఎన్నో రోజుల తర్వాత పిల్లలంతా ఒకేసారి కళ్ల ముందుండటం భర్తలోని మార్పు ఇవన్నీ ఎంతో సంతోషంగా అనిపించింది ఆమెకు. కళకళలాడుతూ, సందడిగా వున్న ఆ ఇంటిలోకి ఆ సాయంత్రం పూలు, పళ్లతో ప్రవేశించింది వజ్రమ్మ.

ఆవిడని చూస్తూనే ముభావంగా వుండిపోయింది అరుంధతి. అయితే అది ఎదురు చూసినట్లే ఆమె ముభావాన్ని లెక్కచేయకుండా తనే చొరవగా పలకరించింది వజ్రమ్మ.

"ఏమ్మాయ్, అరుంధతీ, నీకు చాలా సుస్తీ చేసిందటకదా, ఇప్పుడెలావుంది ఆరోగ్యం? "

"బాగుంది" చెప్పక తప్పింది కాదు అరుంధతికి. ఇంటికి వచ్చినవారిని పలకరించకపోవటం, అవమానించటం ఆమెకు చేతకాదు మరి.

"సింధూర వచ్చేసిందటకదా హాస్పిటల్ నుంచి, ఇప్పుడెలా వుంది? " మళ్లీ అడిగింది వజ్రమ్మ.

"కులాసాగానే వుంది" మళ్లీ పొడిగా అన్నది అరుంధతి.

"ఇవాళ చాలా మంచిరోజు. అందుకే శుభకార్యం గురించి మాట్లాడుదామని వచ్చాను" అన్నది వజ్రమ్మ.

అరుంధతి ప్రశ్నార్థకంగా చూసింది.

"మా అరవిందుడూ, సింధూర ఒకరినొకరు ఇష్టపడుతున్నారు. పెద్దలుగా వారి ప్రేమకు మనమూ ఆమోదం తెలిపితే బాగుంటుంది. నా మనవడికోసం మీ సింధూర తన ప్రాణాలే అడ్డువేసిందంటే ఆ అమ్మాయి ఎంతగా అరవిందుని ఇష్టపడుతోందో మీకూ తెలిసేవుంటుంది. అందుకే మీరూ సరేనంటే పెళ్లికి ముహూర్తం చూసుకుందాం"

అరుంధతి ఒక్కసారిగా ఏమీ మాట్లాడలేకపోయింది.

"ఈ ముసలమ్మ అసలు తమ రెండు కుటుంబాల మధ్య ఇంతకుముందు ఏమీ జరగనట్లే ఎంత తెలివిగా అతిమామూలుగా వచ్చి మాట్లాడుతోంది? తనూ ఏం జరగనట్లే మాట్లాడాలా? నిజమే అవిడన్నట్లు తన ప్రాణాలని కూడా చూసుకోకుండా కత్తికి అడ్డు వెళ్ళిందంటే సింధు అరవింద్‌ను ఎంత ప్రేమిస్తోందో తెలుస్తోంది. అంతేనా అరవింద్‌లాంటి అబ్బాయిని కాదనేందుకు తాను ఏం వంక చూపగలదు? ఈ సంబంధం కుదిరితే సింధు బంగారుపూల పూజ చేసుకున్నట్లే. కానీ తననీమె చేసిన అవమానం? "

అరుంధతి అలా ఆలోచనలలో వుండగానే అంతవరకూ పక్కగదిలో వున్న సంజయ్ హాల్లోకి వచ్చి "ఒక్క నిముషం అమ్మా" అంటూ లోపలికి పిలిచాడు.

"అమ్మా నువ్వెందుకాలోచిస్తున్నావో తెలుసు. ఆ రోజు ఆవిడలా ఎందుకు ప్రవర్తించిందో కూడా తెలుసు. దయచేసి ఆ విషయాలన్నీ మర్చిపో. అంత పెద్దావిడ ఆమె మర్చిపోయి మన ఇంటికి వచ్చి సంబంధం మాట్లాడుతూంటే ఇంకా మనం బెట్టు చూపడం ఏమిటి? సింధు గురించీ నువ్వు ఆలోచించు"

అరుంధతి మనసులో కొట్టుమిట్టాడుతున్న సంశయమూ తీరిపోయింది.

"నిజమే. తన తల్లి వయసావిడ. ఏదో ఆమె మనసు కష్టంకొద్దీ ఆరోజు అలా ప్రవర్తించింది. కానీ ఇప్పుడు ఆమెంతట ఆమే ఇంటికి వచ్చిందికదా. ఈరోజు తన కొడుకు ఇంత బాధ్యతగా, అక్కరగా కుటుంబం కోసం మాట్లాడుతున్నాడూ అంటే అది ఆవిడ మాటల ప్రభావమే అని సంజు చెప్పాడుకదా. దానికోసమైనా తను తన అవమానాన్ని మరిచిపోవచ్చు" అలా అనుకున్నాక వడివడిగా ముందుగదిలోకి వచ్చింది.

అక్కడ వజ్రమ్మ శాంతంగా కూర్చుని అరుంధతి మాటకై ఎదురుచూస్తోంది. అరుంధతి తన ఎదుటకు రాగానే అన్నది.

"అరుంధతీ, నువ్వారోజు జరిగినదాని గురించే ఇంకా ఆలోచిస్తున్నావేమో. నా కొడుక్కి అలా అయిందన్న బాధలో ఏదో నిన్నలా కోప్పడేశాను. ఈరోజు అదే నిన్ను నా మనవడికోసం దాన్నేమీ మనసులో పెట్టుకోవద్దని అర్థిస్తూ...."

ఆమె మాటలు పూర్తికాక మునుపే అడ్డుకుంది అరుంధతి.

"నా తల్లి వయసువారు. అంత మాట అనకండి పిన్నిగారూ. మీరు కోపంలో ఒక మాట అన్నా పర్వాలేదు. మీ మనవడికి మా సింధుని అడగటమే మా అదృష్టం. కానీ మావారితోనూ ఈ విషయం చెప్పి మేమిద్దరమూ మీ ఇంటికి వస్తాం"

"శుభం! మరో మాట కూడా వుంది..." ఆవిడ సందేహంగా ఆగింది.

"ఏమిటి? "

"అరుంధతీ, నువ్వే అన్నావు. తల్లిలాంటిదాన్నని. అందుకే ధైర్యంగా అడుగుతున్నాను. మీకు ఇష్టమైతే సరే లేదంటే లేదు. కానీ దీపికపై మీ అభిప్రాయం ఏమిటి? "

అర్థం కానట్లు చూసింది అరుంధతి.




ఇప్పుడు హఠాత్తుగా దీపిక గురించి అడుగుతుందేమిటీవిడ అనుకుంటూనే "దీపకేం బంగారు బొమ్మలా వుంటుంది. అంతకన్నా మంచి మనసు, వినయవిధేయతలు అన్నీ వున్నాయి ఆ అమ్మాయిలో" అన్నది.

"అవునా? దీపికను మీ సంజయ్‌కి చేసుకోవడానికి మీకేవన్నా అభ్యంతరమా? అమ్మాయి మూగ అని తెలిసీ ఇలా అడుగుతుందేమిటి ముసలమ్మ అనుకోకు. మూగ అయినా దీపికలాంటి సద్గుణరాశి నూటికో కోటికో ఒకరుంటారు. సంజయ్ నెమ్మది స్వభావానికి తగ్గ జోడి. అయినా ఇందులో బలవంతమేమీ లేదు. మీ కిష్టమేనా అని అడుగుతున్నా అంతే. అసలు ఈ విషయాలన్నీ మీవారితోనూ, అందరితోనూ చర్చించుకునే నాకు చెప్పండి"

అరుంధతి మెల్లగా అన్నది. "అలాగే, ముందు సంజయ్‌ని కనుక్కోవాలికదా!"

"అంతా మాట్లాడుకునే మీ అభిప్రాయం చెప్పండి. మరిక నేను వస్తాను" వజ్రమ్మ వెళ్ళిపోయింది.

★ ★ ★

ఆరోజే మద్రాసునుంచి విశ్వనాథం రావటంతో వజ్రమ్మ విశ్వనాథంకు వివరంగా అన్నీ చెప్పింది.

దీపిక ఉత్తరం చూసుకుని దీపికను తిరిగి తీసుకువెళ్ళేందుకే వచ్చిన విశ్వనాథం వజ్రమ్మ దీపికకు కుదిర్చిన సంబంధం చూసి సంతోషపడ్డాడు. సంజయ్, వాళ్ళ కుటుంబం విశ్వనాథంకూ ఎంతగానో నచ్చాయి.

దీపిక కూడా సంజయ్ తనను మనస్ఫూర్తిగా ఇష్టపడుతున్నాడని తెలుసుకుని సంతోషంగా ఆ పెళ్ళికి ఒప్పుకున్నది. మొదటిరోజే సంజయ్‌ని చూడగానే ఆమెకు అతని నిండు గంభీరమైన ప్రవర్తన ఎంతగానో ఆకట్టుకుంది. సంజయ్ కూడా తనకు తగ్గ జీవన సహచరి ఆమె అని అభిప్రాయపడ్డాడు.

దీపిక డబ్బుని ఆమె ఇష్టం ఏమన్నా చేసుకోనివ్వండి. అందులో మాకు ఒక్క పైసా అక్కర్లేదు అని చెప్పిన సంజయ్ కుటుంబాన్ని అందరూ ఎంతగానో అభినందించారు. ఆ తర్వాత సంజయ్ సలహామీదే దీపిక తనకు వచ్చే ఫ్లాట్స్ రెంట్‌ను అంగవికలుర కోసం ఏర్పాటు చేసిన స్కూల్‌కి పంపిస్తానన్నది.

వజ్రమ్మ కూడా కట్నకానుకలు ఏమీ అక్కర్లేదు అనడంతో అరుంధతీ, ఆనందరావు, సింధూర పెళ్ళికని దాచిన డబ్బుతో పెళ్లి వైభవంగా జరిపి కూతుర్లు, అల్లుళ్లకు భారీగా ఆడపడుచు లాంఛనాలు జరపటంతో అంజలి, మంజుల కూడా చెల్లెలి, తమ్ముడి పెళ్లి చూసుకుని వాళ్ళ వాళ్ళ భర్తలతో ఆనందంగా వూర్లకి వెళ్ళిపోయారు.

తమ కూతురు తమ కళ్ల ఎదుటే ఎదురింట్లోనే కాపురం వుండటం అరుంధతికి ఎంతో సంతోషంగా వుంది.

వజ్రమ్మ మనవడి పెళ్లి అవగానే తాను గ్రామంలోనే ప్రశాంతంగా వుంటానని వూరికి ప్రయాణం పెట్టుకుంది.

"అదేంటి నానమ్మా, నువ్వేగా చెప్పావు. ముని మనవలతో హాయిగా కాలక్షేపం చేయాలన్నావు. ఊరిలో ఒంటరిగా వుండటం ఎందుకు? " అని అడ్డొచ్చాడు అరవింద్.

"నిజమే. కానీ మునిమనవళ్లనివ్వడానికి మీరు ఏడాదో, రెండేళ్లో తీసుకుంటారుకదా. ఈ లోపల నేను గ్రామంలోనే వుంటాను. కొత్త జంట మధ్య నేనెందుకు పానకంలో పుడకలాగా, అసలు మీ మధ్య నేను అడ్డు లేకపోతేనేకదా మీరు నాకు తొందరగా మునిమనవళ్ళనిస్తారు. ఏమ్మా మనవరాలా? "

సింధూర సిగ్గుగా నవ్వేసింది. *



# 'విజేత'పై సమీక్షలు

జూలై 'చతుర'లో ప్రచురితమైన విజయార్కే నవల 'విజేత'పై మాకందిన ఉత్తమ సమీక్షలు

## పట్టాభిషేకం

(ప్రథమ బహుమతి
రు: 100/- పొందిన సమీక్ష)

పట్టుదల, కృషివుంటే ఎవరైనా, ఏ రంగంలోనైనా విజేతగా నిలబడతారని నిరూపించిందీ నవల. కథలోని విషయాన్ని పక్కతోవ పట్టించకుండా చక్కగా నడిపారు రచయిత. వంటకాన్ని ఎక్కడా చెడకుండా సు




లువుగా వండి వడ్డించారని చెప్పవచ్చు.

"ఆరంభింపరు నీచమానవుల్", "పట్టు పట్టరాదు- పట్టి విడువరాదు'' అన్నవాటికి అద్దం పట్టిందీ నవల. అరుణ్ యొక్క రూపం, అతని చేతిలోని కళా అనుకున్నది సాధించటంలో అతనికి బాగా ఉపయోగపడినాయి.

ఆ పల్లెటూర్లోని అందమైన మరదలు రాజేశ్వరి, అమాయకమైన ఆమె కోరిక చిత్రించిన తీరు చాలా రోజులు గుర్తుంటుంది.

మనం స్నేహం, స్నేహం అనుకుంటూ వుంటాంగానీ, అవసరానికి నిలబడే నిజమైన స్నేహితులు ఎందరు అన్నదే అసలు ప్రశ్న. రమేష్ కూడా చివరికి అరే వీడికి కొంచెం అండగా వుంటే బాగుండేదే, నాకు లోటు లేకుండా జరిగిపోయేదిగదా అనుకుంటాడు. ఎదుటివాడు మనకు ఏవిధంగా ఉపయోగపడతాడూ అనే దృష్టితో చూసే నేటి సమాజానికి రమేష్ ఒక సజీవ చిత్రణ.

తర్వాత మనకు తెలిసిన కొందరు నటీనటుల గురించి, దర్శకుల గురించి కథలో చిత్రించారు. అవి అనవసర ప్రస్తావనల్లా లేవు.

సినిమారంగంపట్ల ఆడవాళ్లు ఎందుకు ఆకర్షితులౌతున్నారు? ఈ రంగంలోనే ఎందువల్ల మగవారినుండి ఎక్కువగా ప్రాబ్లెమ్స్ ఫేస్ చేస్తున్నారు? అన్న పాయింట్లను రచయిత టచ్ చేశారుగానీ, ఇంకా ఎక్కువగా ఎనలైజ్ చేసి, సజెషన్స్ చూపించి వుంటే బావుండేది.

హాసిని పాత్రకు అంతకుమించిన ముగింపు ఏదన్నా ఇస్తారని ఆశించాం. ఈ పాత్ర చిత్రణ చాలారోజులు మనల్ని హంట్ చేస్తుంది.

అరుణ్ సినిమారంగంలో సక్సెస్‌ఫుల్ హీరో అయిన తర్వాత కూడా అతను అనుకున్నవిధంగా తన ఊరికి వచ్చేయగలగటం నిజంగా హైలైట్‌గానే అన్పించింది. ఎందుకంటే, అంతటి సక్సెస్‌ని వదులుకోవటం మానవమాత్రులకు సాధ్యం కాదు. అతడు సినిమారంగానికి గుడ్‌బై చెప్పటం అతనిలోని నిజమైన కళాభిమానాన్నీ పల్లెటూరి వాతావరణం పట్ల అతనికున్న అభిమానాన్ని చెప్పక చెప్పింది. రంగుల మోజుల్లో పరుగుపెట్టక నిలకడైన జీవితాన్ని అనుభవించగోరిన అరుణ్ నిజంగా విజేతే.

-సి. సరస్వతి
తెనాలి-522 201.

## విప్పి చూపిన మేడి పండు

(ద్వితీయ బహుమతి
రు: 75/- పొందిన సమీక్ష)

ఇది వినూత్న కథాంశం. అందులోనూ ఆకర్షణీయమైంది. అందమైనవాడు, ఆర్టిస్టు, డబ్బున్నవాడు, చదువుకున్నవాడు, తన బావ సినిమా హీరో కూడా కావాలన్నది మరదలి కోరిక. టౌన్‌లో ఉద్యోగం చేయాలన్నది తల్లిదండ్రుల, అత్తమామల కోరిక. ఈ రెండూ అతడికి నచ్చవు. తనదైన ప్రత్యేక లోకంలో కాలం తెలీకుండా గడపటం అతగాడి హాబీ. తన మరదలి కోరిక తీర్చటం కోసం- పెద్ద సవాలు చేసి ఫిల్మ్‌సిటీకి వస్తాడు. అక్కడ రమేష్ వ్యవహారం, రమేష్‌పట్ల ఇతగాడి వ్యవహారం కృతకంగా వుంటాయి. పీతాంబరంగారి పరిచయంవరకు కథ ఇబ్బందిగా నడుస్తుంది. అక్కణ్ణుంచి కథ ఆసక్తికరంగా వున్నా కాలక్షేపం అన్పించక మానదు. అయితే అతడు- తన లక్ష్యంపట్ల సూటిగా పోవటం చాలా ఆసక్తిగా వుంటుంది. తను సంపాదించిన కొద్ది మొత్తాన్ని కూడా నటనలో మెలకువలు నేర్చుకోటానికే ఖర్చు పెడతాడు. బొమ్మలు వేసి షాప్‌లో అమ్మటం, ఆ డబ్బుతో జీవనం గడపటం. ఇవన్నీ అతనిలోని హీరో ఇమేజ్‌ని పెంచుతాయి. ద్వారాకానాథ్ అతణ్ణి హీరోగా ఎన్నుకొనే సందర్భం సినిమాటిక్‌గా ఉన్నా థ్రిల్లింగ్ అన్పిస్తుంది. మేడిపండు ఇండస్ట్రీని తను చూడటమే కాకుండా దాని పొట్టవిప్పి తన మరదలికి, మనకీ చూపిస్తాడీ హీరో! పీతాంబరంగారిలో ఈనాడు ఒక అగ్ర హీరో నుండి గుప్తదానం తీసుకున్న ఒకప్పటి ఒక అగ్రశ్రేణి ప్రతినాయకుడిని, హాసినిలో ఈ మధ్యే రాలిపోయిన ఒక తార కన్పించకమానదు. ఇలా వాస్తవాన్ని, ఊహని కలగలిపి వినూత్నంగా తయారయిన ఈ నవల ముగింపు- మరింత వినూత్నంగా వుండి, ఈ నవలను విజయవంతం చేసింది. కరెక్టుగా తన ఫిల్మ్ రిలీజ్‌రోజున- తన గదిలో కిటికీ దగ్గర ప్రకృతి సౌందర్యం తిలకిస్తూ- అతడు స్వచ్ఛంగా, స్వేచ్ఛగా ఆనందించటం నిజమైన విజయం. ఈ రచయిత సీరియస్ ప్లాట్స్ తీసుకుంటే- పాఠకులకు మరింత ప్రయోజనం.

-రవిచంద్ర ఎ.
మంగళగిరి-522 503

## రచయితే విజేత

(తృతీయ బహుమతి
రు: 50/- పొందిన సమీక్ష)

బయటనుంచి చూసేవారికి సినిమా ప్రపంచం ఎంతో అందంగా, ఆకర్షణీయంగా కన్పిస్తుంది. కానీ, ఆ ప్రపంచంలోకి వెళ్ళి చూస్తేగాని లొసుగులు ఏమిటో తెలియవు. 'మేడిపండు జూడ మేలిమై ఉండును పొట్టవిప్పి జూడ పురుగులుండు' అన్న కవి సందేశం సినిమాకు చక్కగా సరిపోతుంది.



ఈ సినిమా ఆకర్షణలోపడి ఎందరో యువతీ యువకులు తమ విలువైన జీవితాన్ని ధ్వంసం చేసుకుంటున్నారు.

జూలై చతుర నవల 'విజేత'లో ఈ ప్రపంచాన్ని గురించి రచయిత చక్కగా విశ్లేషించారు. ఎందరో కవులు, రచయితలు, నటులుగా మారాలని నిరంతరం ప్రయత్నిస్తూనే అవకాశం అనే ఎండమావి వెంట పరుగులు తీస్తూవుంటారు.

ఈ నవలలో రాజేశ్వరి సినిమా ప్రపంచంవేపు ఆకర్షితురాలై తన బావ అరుణ్ హీరో కావాలని కలలు కంటుంది. తీరా ఆ కలలు నిజమై అరుణ్ సినిమా హీరో అయ్యాక వాస్తవాన్ని గ్రహిస్తుంది. ఆ సినిమా ప్రపంచంలోని కుళ్ళేమిటో అర్థమవుతుంది. 'ఇదో వింత ప్రపంచం. చూడ్డానికే అద్భుతంగానీ, కృత్రిమ విలువలతో ద్వంద్వ ప్రవృత్తితో బ్రతికే ఈ మనుష్యులకు దూరంగా తన బావను తీసుకువెళ్ళాలి' అని నిర్ణయించుకుంటుంది.

హాసిని పాత్ర బయట ప్రపంచానికి తన నడుము ఊపులతో, కైపెక్కించే చూపులతో తెలుగు ప్రేక్షకులను మత్తెక్కిస్తున్న సెక్సీ డాన్సర్. ఎక్స్‌పోజింగ్ కారెక్టర్ కాకుండా మంచి క్యారెక్టర్ కోసం తపించిన మనసున్న మంచి నటి హాసిని. ఆమె కోరిక తీరకుండానే చివరకు తనను తాను కాపాడుకోలేని స్థితిలో ఆత్మహత్యకు పాల్పడుతుంది. ఇలా అర్థాంతరంగా బ్రతుకు ముగించుకునే ఆడవాళ్ళు సినిమా ప్రపంచంలో ఎందరున్నారో! మంచి చెయ్యాలనుకునేవారికి చివరకు పట్టెడు మెతుకులు కరువయ్యే పరిస్థితి ఎలా వుంటుందో పీతాంబరం క్యారెక్టర్ తెలియజేస్తుంది.

ఈ నవలలో చెప్పుకోదగ్గ క్యారెక్టర్ అరుణ్‌ది. పట్టుదలతో కృషిచేసి సినిమా హీరో అయినందుకు అతను విజేత కాలేదు. తన కొచ్చిన అవకాశాల్ని, డబ్బునీ, కీర్తిప్రతిష్ఠలనీ కాదనుకొని, తనకు నచ్చిన జీవనపథంవేపు మళ్ళినందుకు అన్ని ప్రలోభాల్ని జయించి అతను నిజంగానే విజేత అయ్యాడు.

-సూర్యదేవర జోగేశ్వరరావు
మైలవరం-521 230

## రంగుల వలయంలో రగిలే హృదయాలు

*(నాలుగవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

నెలనెలా ఒక్కో నూతన విషయంపై వాస్తవాలకు అనుగుణంగా మేటి నవలలను అందించే ఘనత 'చతుర'కే దక్కుతుంది.

నేటి ఆధునిక యుగంలో టి.వి.ల వల్ల దినసరి కార్యక్రమాల్లో ఒక భాగంగా మారి, యావత్ సమాజంపైనే ఎంతో ప్రభావాన్ని చూపుతూ, మేడిపండు వైనంలో యున్న ఈ 'రంగుల ప్రపంచము'ను ఆ రంగుల వలయంలో రగిలే హృదయాలను క్లుప్తంగా విజయార్కెగారు 'విజేత'లో అందించిన విధానం అభినందనీయం.

హృదయాలను కదిలించే కళాకారుల జీవితాలను, కళ్లతో నోట్లు సంపాదించే చలనచిత్రరంగపు తీరును సంక్షిప్తంగా చూపుతూనే చలనచిత్ర జగత్తొక 'కుళ్లు ప్రపంచం' అని రాజేశ్వరి చేత అనిపించడం బాగుంది.

అరుణ్, రమేష్‌ల స్నేహాన్ని 'ఈ ప్రపంచంలో బంధాలన్నీ ఆర్థిక సంబంధాలే' అనుకునేలా చూపారు. హాసిని పాత్ర నవలకు జీవం పోసింది.

అది ఏ రంగమైనా స్త్రీ స్త్రీయే. భావుకులు ఈ ప్రకృతినే స్త్రీగా పోలిస్తే... ఆర్యులు 'మాతృదేవోభవా' అంటూ స్త్రీకే మొదటి స్థానాన్ని ఇచ్చారు. భరతమాత, కళామతల్లి, చదువుల తల్లి ఇలా ప్రతీ దానికి స్త్రీ రూపాన్నే కల్పించారు. అసలు స్త్రీయే లేకుండా ఈ మానవాళి సృష్టే లేదు. అటువంటి ఉదాత్త




ష్మైన స్త్రీని ఈ రంగుల వలయంలో నిక్కృ ష్టంగా దిగజారుస్తూ వారి కన్నీరును పన్నీరుగా కోట్లు సంపాదించే తీరును హాసిని పాత్ర ద్వారా చక్కగా మలచారు.

ఎంతటి కళాంకితులైనా ముందు జాగ్రత్త లేని నిస్వార్థపరుల గతి ఏమిటనేది పీతాంబరం ద్వారా, సమాజ శ్రేయస్సుకొరకు ఫైనాన్షియర్లకు భయపడకుండా ముందడుగు వేసి మంచి చిత్రాలను అందివ్వాలని ద్వారాకానాథ్ ద్వారా తెలియజేశారు. నటన యొక్క నిర్వచనం తెలియని నరేంద్రలాంటి నిర్మాతల కొడుకులు కెమేరా ముందుండడంవల్ల, సత్తా వున్న అరుణ్‌లాంటివారు తెరవెనుకే కనుమరుగైపోతున్నారు.

'కృషివుంటే- సాధించగలం' అనే మనో నిబ్బరాన్ని, కరిగే ఎదను చిత్రకారుని కుంచెలో పోస్తే కలిగే 'ఇన్‌స్పిరేషన్'ను, నటనలో జీవించి, కళలో పరిపూర్ణత సాధించితే వచ్చే ఫలితాన్ని అరుణ్ పాత్ర ద్వారా చక్కగా చెప్పారు.

మధ్యలో హాసిని మనస్సు అరుణ్‌వైపు మళ్ళించినా... ముగింపు రాజేశ్వరితోనే చేయడంతో రచయిత 'విజేత అయ్యారు. ఇదివరకు చతుర నవలలు 'సినిమాలు'గా వచ్చి హిట్ అయినవి. ఈ నవల కూడా సినిమా తీస్తే హిట్ అవుతుంది.

-త్రినాథ్
చెన్నై-600 118

# చిత్రజగత్తుకు దర్పణం

*(అయిదవ బహుమతి రు: 50/- పొందిన సమీక్ష)*

కౌగితం పూవువంటి సినీప్రపంచపు లోతుపాతుల్ని అశ్లీలానికి, అవినీతికి ఆలవాలమైన ఆ సినీజగత్తులోని కొన్ని అరుదైన వ్యక్తిత్వాలు గల వ్యక్తులను కళ్ళకు కట్టినట్టు చూపించారు విజయార్కె.

తనదైన శైలిని, దర్శకత్వ ప్రతిభను నిలబెట్టుకోడంలో ఎన్నో కష్టనష్టాలకు సిద్ధపడిన ద్వారకానాథ్, ఎందరో కళాకారుల్లా విలాసవంతమైన జీవితం గడిపి చివరికి అన్నీ చేజార్చుకొని అనుభవాన్ని మిగుల్చుకున్న పీతాంబరం, పాత్ర ఏదైనా వ్యక్తిత్వాన్ని నిలుపుకోవాలని తాపత్రయపడిన హాసిని... మొదలైన పాత్రలన్నిటినీ సహజంగా చిత్రీకరించారు. ఈ నవలలో హీరోయిన్‌గా రాజేశ్వరిని చెప్పుకున్నా నిజమైన కథానాయిక హాసినియే. అరుణ్ చిత్రీకరించిన, హాసిని చిత్రం ఆమెకు ఆనందం కలిగించడం హాసిని అరుణ్‌ని అభిమానించడం ఆమే హీరోయిన్ అనుకునేలా చేశాయి. ఆమెలాంటి అభాగినులు నేటి సినీప్రపంచంలో ఎందరో.

రాజేశ్వరి, అరుణ్‌ల అన్యోన్యత ఒకరికోసం ఇంకొకరన్నట్లు ప్రేమాభిమానాన్ని పంచుకుంటూ పాఠకలోకానికి మనోల్లాసాన్ని కలిగించారు.

చిత్రసీమను గురించి ఎన్నో నవలలు, కథలు వచ్చాయిగానీ ఈ నవల వాటికి భిన్నంగా అశ్లీలతకు, అవినీతికి తావు లేకుండా సభ్యత, సంస్కారం,' మనోవిశ్లేషణలు ముప్పేటలుగా కూర్చిన త్రివేణీ సంగమంలా గంభీరంగా ప్రవహించింది.

వ్యక్తిత్వం, శీలం, కార్యదీక్ష నిలబెట్టుకుంటూ తన లక్ష్యాన్ని సాధించిన అరుణ్ పాత్ర నేటి యువలోకానికి ఆదర్శప్రాయంగా నిలబడింది. చిత్రసీమలోని మహామహుల జీవితాలకి దర్పణంగా ఈ నవలలోని పాత్రలు మలచబడి పాఠకుల మనసుల్లో నిలిచిపోతాయి.

-కొచ్చర్లకోట కామేశ్వరి,
ఇబ్రహీంపట్నం-521 450



## సచిత్ర విచిత్రం




# కాదేదీ పోటీకనర్హం

అడ్వర్టయిజ్‌మెంటుకోసం జరిపిన ఆర్నెల్లలోపు పిల్లల పోటీలో ఈ నాలుగు నెలల పసివాడి ఫోజు ప్రథమ బహుమతిని గెలుచుకుంది. ఆట దుస్తుల్లో గడ్డికూరి ఈ పిల్లగాడిని ఆపైన కూర్చోబెట్టారని వేరే చెప్పాలా!

# చతుర ప్రపంచం

## రుచులు అనేకం

ప్రపంచం మొత్తంమీద ప్రజల ఆహారపు అలవాట్లను పరిశీలిస్తే భిన్నభిన్న ప్రాంతాల్లో భిన్న భిన్న రకాలుగా కనపడుతుంది. రామాయణ కాలంలో అప్పటి ముఖ్య ఆహారం బియ్యం, గోధుమలు, వాటితో తయారుచేసిన రకరకాల పదార్థాలు. నువ్వులు, పప్పుధాన్యం, బియ్యం కలిపి కిచిడీలాంటి పదార్థాన్ని తయారుచేసి తినేవారు. వేయించిన బియ్యం, పప్పుధాన్యాలు, నూపప్పు మొదలయిన వన్నీ బెల్లం పానకంతో కలిపి కుడుములు లాంటి స్వీట్లు తయారుచేసేవారు.

ఇవికాక గోధుమ పిండి బెల్లం కలిపిన స్వీట్లు, సెనగపిండి, బెల్లం, వెన్న లేదా నెయ్యిలతో కలిపిన స్వీట్లు తయారుచేసేవారు.




ఆహారంలో పాలు అత్యంత ప్రధాన పాత్ర వహించేవి. క్షీర్, పాయసం, వెన్న, పెరుగు, నెయ్యి ఇవన్నీ ఎక్కువగా తినేవారు. పాలను కాచి మరగబెట్టి కోవా తయారుచేసి దానితో రకరకాల స్వీట్లను చేసేవారు. నెయ్యిని చాలా పవిత్రమైన పదార్థంలా చూసేవారు. స్నానం చెయ్యనిదే, అపరిశుభ్రమైన బట్టలతో నేతి పాత్రను తాకేవారుకాదు. పాలు, పెరుగు, నెయ్యిలను పండుగరోజుల్లో విపరీతంగా వాడేవారు. అన్నం, బెల్లం, పాలు, కొంచెం నెయ్యి కలిపిన పాయసాన్ని దేవతలకి నివేదించేవారు. పాయసానికి పవిత్రస్థానాన్నిచ్చేవారు ఆ రోజుల్లో. బుద్ధుడు తన నిరాహారదీక్షని, పాల వాని కూతురు

సుజాత ఇచ్చిన పాయసం తాగి విరమించా డని ఓ కథ వుంది. ఈ దృశ్యం అమరావతి శిల్పకళలో కనబడుతుంది. ఈ పాయసాన్ని అమావాస్యనాడు, రాత్రులందు తినరాదని నిషేధం వుంది. పండుగ దినాల్లో, పూజాది నాల్లో ఈ పాయసాన్ని తప్పని సరిగా చేసే వారు. పాయసాన్నం సరస్వతీదేవికి నివే దించడం శ్రేష్టమని భరతముని తన నాట్య శాస్త్రంలో ఉటంకించారు.

ఆయుర్వేద సంహితలో 'పెరుగు' ప్రయో జనాలను విపులీకరించారు. పెరుగుని కూడా పవిత్ర పదార్థంగా భావించేవారు అప్పటివారు. ఎవరైనా ప్రయాణమై వెళ్లేట ప్పుడుగానీ, అక్షరాభ్యాస సమయంలోగానీ పెరుగు తిని, దాన్ని తిలకంగా దిద్దుకునే వారు. బాదుషా జహంగీర్ కూడా అత్యవ సర సమయాల్లో పెరుగు తిలకాన్ని ధరించే వాడు. ఒక కవి తన పద్యాల్లో ఇలా రాసు కున్నాడు, "ప్రతి జన్మలోనూ కాళిదాసు పద్యాల్ని చదవాలి, ప్రతి జన్మలోనూ గేదెపె రుగు తినే భాగ్యం లభించాలి" అని. రామా యణంలో శ్రవణకుమారుణ్ణి దశరథుడు శబ్దభేదితో కొట్టి చంపినపుడు అతడి తండ్రి "నేనెప్పుడూ నా గురువుని వ్యతిరేకించి ఎరు గను. రాత్రులందు ఎన్నడూ పెరుగు భుజించి ఎరుగను. మరి నాకెందుకీ పుత్ర శోకం" అని విలపిస్తాడు. అంటే అంత పవి త్రమైన, రుచికరమైన పెరుగునూ రాత్రు లందు తినడాన్ని నిషేధించారు పెద్దలు.

అప్పటి ప్రజలు కూడా పెరుగును చిలికి ఉప్పు, అల్లం, కరివేపాకు, దబ్బాకు లాంటి విచేర్చి పల్చని మజ్జిగ చేసుకుని తాగేవారు. వేసవికాలాల్లో వీధులలో ఇలాంటి రుచికర మైన పలుచని మజ్జిగను పేదలకు పోసే వారు.

దానిమ్మ, ద్రాక్ష మొదలైన పళ్లరసాలకు తేనెను చేర్చి తాగేవారు. పళ్ళరసాలను ఉడి కించి, గాఢంగా మరిగించి నిలవవుంచే వారు. మనకి తెలిసిన మామిడి, నేరేడు, అరటి, కొబ్బరి, దానిమ్మ, ద్రాక్ష వగైరా పళ్లే కాక పేరు తెలియని, కళ్ళ చూడని అనేక రకాల పళ్లు రామాయణ కాలంల్లో వాడు కలో వుండేవి.

ఆ కాలంలో చేపల వాడకం వున్నట్టు ఎక్కడా ప్రస్తావనలేదు. అయినా ఓ రామా యణంలో కబంధుడు రాముడిచేతిలో చని పోయేముందు అతడికో సలహా ఇస్తాడు. "రామా! లక్ష్మణుడ్ని పంపాసరోవరానికి పంపు. అక్కడ చక్కని చేపలు దొరుకు తాయి. వాటిని బాణాలతో కొట్టి చంపి, పైపొలుసులను, మొప్పలను తీసివేసి, వేయించుకుని తింటే ఎంతో రుచికరంగా వుంటుంద'న్నాడట. దీనినిబట్టి చూస్తే కబంధుడు దండకారణ్యానికి చెందిన గిరిజ నుడయ్యుంటాడు అంటారు. అండమాన్ దీవుల ప్రజలు చేపలను పట్టడానికి వింటిని, బాణాన్ని ఉపయోగించేవారు.

సీతాదేవి రాముడివెంట అడవికెళ్ళేట ప్పుడు గంగను ప్రార్థిస్తుంది. తాను తిరిగి వచ్చేటప్పుడు మాంసాన్ని, అన్నాన్ని, వంద లాది పాత్రలతో మద్యాన్ని తెచ్చి సమర్పిస్తా నని.

భరతుడు చిత్రకూట పర్వతానికి బయ లుదేరి వెళ్లేటప్పుడు భరద్వాజుని ఆశ్రమా నికి వెడతాడు. భరద్వాజుడు భరతునికి, అతని సైన్యానికి రుచికరమైన మద్యాన్ని మేక, గొర్రె, ఎలుగు, లేడి, నెమలి, కోడి మొదలైన అనేక రకాల పక్షుల, జంతువుల మాంసంతో చక్కని విందుని ఇస్తాడు.

హనుమంతుడు సీతకోసం లంక కెళ్ళినప్పుడు రాజప్రాసాదమంతటావెతు కుతూ భోజనశాలకొస్తాడు. అక్కడ రకర కాల జంతువుల మాంసాలు వండబడి వున్నట్టు మరో వర్ణన వుంది రామాయ ణంలో.




పళ్లరసాలు, రకరకాల షర్బతులను తయారుచేసుకుని తాగడం కూడా అప్పటి ప్రజలకు తెలుసు. ఆనాటి సారాయిగ్లాసులు బంగారంతో గానీ, స్ఫటికంతోగానీ తయారు చేయబడి వింతవింత ఆకృతుల్లో మలచబడేవి.

అయితే గుడ్లు, ఉల్లి, వెల్లులి ప్రస్థావన మాత్రం ఎక్కడా కనిపించదు.

## ఆరవ ఇంద్రియం

కొంతమంది వ్యక్తులు మామూలు మనుషులకు భిన్నంగా వుంటూ, భూత, భవిష్యత్, వర్తమానాల గురించి జోస్యం చెబుతూ వుంటారు. ఏదైనా ఓ సంఘటన జరగబోయే ముందు 'ఇది ఇలా జరగవచ్చని నా సిక్స్ సెన్స్ చెబుతోందంటారు కొందరు. ఈ సిక్స్ సెన్స్‌నే ఎక్స్‌ట్రా సెన్సినరీ పెర్‌సెప్షన్ అంటారు శాస్త్రజ్ఞులు. ఇది పారాసైకాలజీకి సంబంధించిన ఓ అంగం. చాలామంది సైంటిష్టులు ఈ ఎక్స్‌ట్రా సెన్సినరీ పెరసెప్షన్ అంతా ఉత్త గ్యాస్ అనీ, చెత్త అనీ కొట్టిపారేస్తారు.




పారాసైకాలజీ ఏం చెబుతోందంటే మనిషి జ్ఞానేంద్రియాలు అయిదూ (చెవులు, కళ్లు, నాలుక, ముక్కు, చర్మం) కాక ఆరవ అంగంగా మనసు వచ్చి చేరుతోంది. కానీ ఈ మనసనేది కంటికి కనిపించేది కాదు. అందుకే దీని అస్థిత్వాన్ని శాస్త్రజ్ఞులు నిర్దిష్టంగా వివరించలేకపోతున్నారు.

పారాసైకాలజిస్టులు ఈ ఎక్స్‌ట్రా సెన్సినరీ పెర్‌సెప్షన్‌ని 4 భాగాలుగా విభజించారు. 1. టెలీపతీ 2. సైకోకైనసిస్ 3. క్లియర్‌వాయన్స్ 4. ప్రికగ్నిషన్.

టెలీపతీ అనేది సుదూరంగా వున్న ఇద్దరు వ్యక్తుల మధ్య ఎలాంటి మాటలు, గుర్తులు లేకుండా అయిదు జ్ఞానేంద్రియాలకు సంబంధంలేకుండా జరిగే సంభాషణ. సైకోకైనసిస్ అనేది ఒక వస్తువును చేతితో తాకకుండా కేవలం మానసికశక్తితో అటూఇటూ కదపడం. క్లియర్ వాయన్స్ అంటే

ఎక్కడో దాగివున్న వస్తువును లేదా సంఘట నను ఎలాంటి భౌతిక చర్యలు చేయకుండా కనుక్కోవడం, ప్రికగ్నిషన్ అంటే ఒక సంఘ టన జరగడానికి ముందుగానే దాన్ని తెలుసు కోవడం.

ఈ ప్రయోగాన్ని మొదట్లో లండన్ యూ నివర్సిటీలో ఫిజిక్స్ ప్రయోగశాలలో గెల్లర్ అనే వ్యక్తి నిర్వహించాడు. అతడు గీజర్ కౌంటర్ అనే మెషీన్ తీసుకుని దృష్టిని దానిమీద ఏకాగ్రం చేశాడు. అప్పుడు అందు లోని ఛార్ట్ రికార్డర్ నార్మల్‌కన్నా 200 సార్లు ఎక్కువగా శబ్దాన్ని చేసింది. ఇనుపరాడ్‌లను వంచడం, ప్లాస్టిక్ పెట్టెలలో పెట్టిన రాళ్ళను చూపులతో చూర్ణం చేయడం, ఇలాంటి ప్ర యోగాలన్నీ కేవలం మానసిక శక్తితో ఎలాంటి భౌతిక సహాయం తీసుకోకుండా నిర్వహించాడతడు. ఇది చూసి లండన్ కింగ్స్ యూనివర్సిటీలో మాథమాటిక్స్ ప్రొ ఫెసర్‌గావున్న జాన్ టేలర్ చాలా మెచ్చు కుని, "ఇది విజ్ఞానశాస్త్రానికే ఓ ఛాలెంజ్" అని అన్నాడు. "మనిషి తన మేధోశక్తిద్వారా కేవలం మానసిక బలంతో వస్తుస్వరూపాల ను మార్చడం నిజంగా గొప్ప విద్య'' అన్నాడు.

ఈ ప్రయోగాలన్నీ బ్రిటిష్ సైన్స్ మాగ జైన్ 'నేచర్'లో విపులంగా రాయబడ్డాయి. ఇది విజ్ఞానశాస్త్ర ప్రపంచంలో కలకలం పుట్టించింది. గెల్లర్ క్లియర్‌వాయన్స్‌తో కూడా మరో ప్రయోగం చేశాడు. అతనిని ఓ గదిలో బంధించి చీమ కూడా చొరబడటానికి వీలులేకుండా కిటికీలన్నీ మూసి వుంచారు. బయట ఎక్కడో దూరంగా ఎవరో కాగితంపై గీస్తున్న చిత్రాన్ని తన క్లియర్‌వాయన్స్ శక్తి ద్వారా యధాతథంగా గీశాడు.

ఓసారి ఓ యుద్ధంలో గాయపడ్డ గెల్లర్ మిలిటరీ హాస్పిటల్‌లో చికిత్సకోసం చేర్చబ డ్డాడు. అతడు కొంచెం కోలుకున్నాక పక్క బెడ్‌మీది రోగికి తన మనోశక్తితో చిన్న చిన్న మ్యాజిక్‌లను చేసి నవ్వించేవాడు. ఇవన్నీ విన్న ఇజ్రాయిల్‌లోని ఓ కంపెనీ మానేజరు గెల్లర్ శక్తి సామర్థ్యాలు ప్రజలందరికీ తెలిసే లా ఇజ్రాయిల్‌లోని అన్ని థియేటర్‌లకూ బుక్‌చేసి గెల్లర్ ప్రయోగాలపై ఒక ప్రదర్శనని ఏర్పాటుచేశాడు.

రష్యాకు చెందిన నైనాకులగినాకి కూడా ఈ శక్తి వుందని వెల్లడయింది. ఆమె కూడా కొన్ని ప్రయోగాలను చేసి చూపించింది. బంతిని గాల్లోకి విసిరి అక్కడే ఆపేసేది. కేవలం తన చూపుతో పెన్నులు, సిగరెట్ పెట్టెలు మొదలగు వాటిని సృష్టించి ఇచ్చేది. అయితే ఇవన్నీ కొత్తగా వచ్చినవి కావు. అంతక్రితం ఈ వస్తువులన్నీ ఎక్కడో అక్కడ వున్నవే. ప్రయోగశాలలోని ఓ కప్పకేసి దీర్ఘంగా చూస్తూ దాని గుండె కొట్టుకోవడాన్ని నిలిపి వేసింది. అయితే ఈమెకు మాత్రం ఇవన్నీ చేయడంతో చాలాశక్తిని కోల్పోతున్న ట్టు అనిపించేది. ఈ ప్రయోగాలు చేస్తున్నప్పు డు 70, 80 వరకూ వుండాల్సిన ఆమె పల్స్‌రేట్ 200 చూపించేది. ప్రయోగం పూర్తి య్యాక తలనెప్పి, కీళ్ళనెప్పి, నిద్రలేకపో వడం మొదలయిన సమస్యలకు గుర య్యేది.

అయితే ఇలా చేసేటప్పుడు వారి అను భూతులేమిటి? ఇలా ఎలా చేయగలుగుతు న్నారని కొంతమంది అడిగిన ప్రశ్నలకు సమాధానంగా ఆమె "ఆ సమయంలో వె న్నుపాముపై కిందనుంచి పైకి ఏదో కరెంటు పాకుతున్నట్టు వుంటుందని, హిందూ మతంలో చెప్పినట్టు కుండలినీ శక్తి జాగృత మవడం అంటే ఇదేనేమో'' అంది.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad Tel: 290328 Office Address: CHATURA Monthly, Eenadu Compound, Somajiguda. Tel. Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942; Nellore: 331080

